


# కంచుకోట

మాహిష్మతీనగర రాజైన యశోవర్ధనుడు అరవై ఏళ్ళ కాలం అవిచ్ఛిన్నంగా రాజ్యపాలన చేసి వృద్ధుడయాడు. ఇరవై ఏళ్ళ చిన్న వయసులో రాజ్యపాలనకు వచ్చిన అతడు, స్వయంగా అనేక యుద్ధాలు చేసి, రాజ్యపు ఎల్లలను ఎంతో విస్తరింపచేశాడు. అంత పెద్దరాజ్యానికి అధినేత అయినా, యశోవర్ధనుడికి వృద్ధాప్యంలో మనశ్శాంతి లేకుండా పోయింది. అందుకు కారణం అతడి కుమారులు.

యశోవర్ధనుడికి, తపోవర్ధనుడు, గుణవర్ధనుడు అని యిరువురు పుత్రులు. పెద్దవాడైన తపోవర్ధనుడు యిరవైఅయిదేళ్ల వయసువాడు. అతడికి లోకవ్యవహారాలమీద ఏమాత్రం ఆసక్తి లేదు. అతడెప్పుడూ తన కాలాన్ని ధర్మగ్రంథాలు పఠించటంలోనూ, వేదాంతులతో, పండితులతో ధర్మసూక్ష్మాల గురించి చర్చించటంలోనూ గడిపేవాడు.

చిన్నవాడైన గుణవర్ధనుడు ఇరవైఏళ్ల వయసువాడు. అతడిది యింకొక రకం తత్వం. అతడు కేవలం విలాసాల్లో కాలం గడుపుతూండేవాడు. అతడిలో ధర్మాధర్మ విచక్షణ అన్నదే లేదు. అసత్యవాదులూ, దుండగులూ కపటులూ, అతడికి ఆప్తమిత్రులు.

యశోవర్ధనుడు తన శేషజీవితాన్ని ఏ ఆశ్రమంలోనో దైవధ్యానం చేసుకుంటూ గడపాలనుకున్నాడు. తను రాజ్యపరిత్యాగం చేసేముందు సమర్థుడైనవాడొకడు పరిపాలనా భారం వహించటం అవసరం,







లేకపోతే దేశం అరాజకం పాలవుతుంది. ఐహికవిషయాలమీద ఏమాత్రం ఆసక్తిలేని తన పెద్దకుమారుడు, తనతరవాత రాజు కావటం దేశానికి క్షేమం కాదు. ఇక పోతే చిన్నవాడు గుణవర్ధను డున్నాడు.

గుణవర్ధనుడి దుండగాలనుగురించి యశోవర్ధనుడు వినివున్నాడు. స్వయంగా అతణ్ణి చాలాసార్లు మందలించటంకూడా జరిగింది. ఇరవై ఏళ్ళ వయసులో ఎవరైనా అలాగే ప్రవర్తిస్తారనికూడా యశోవర్ధనుడు అనుకున్నాడు. రాజ్యభారం నెత్తిన పెడితే, అతడికి బాధ్యతలు తెలిసిరాగలవన్న నమ్మకం కలిగిందాయనకు.



అయితే, మంత్రి సామంతులలో కొందరితో యీ విషయమై మాట్లాడినప్పుడు, వారు గుణవర్ధనుడు రాజు కావటాన్ని వ్యతిరేకించారు. పెద్దవాడైన తపోవర్ధనుడుండగా, చిన్నవానికి రాజరికం కట్టబెట్టడం ప్రజలలో అశాంతిని రేకెత్తించగలదని వారు సంశయం వెలిబుచ్చారు.

ధర్మచింతా, గుణశీలాలూ వున్న తపోవర్ధనుడు రాజుకావటం అందరికీ క్షేమం కాగలదని వారు సలహా యిచ్చారు.

ఈ సలహా యశోవర్ధనుడికి మనస్కరించలేదు. క్షాత్రధర్మంలో ఏమాత్రం ఆసక్తినీ కనబరచని తన పెద్దకుమారుడు రాజు కావటమంటే, అతడు ఏ మంత్రిచేతి కీలుబొమ్మగానో వుండవలసి వస్తుందని ఆయన భావించాడు. తను నెత్తురోడ్చి సంపాయించిన రాజ్యం, తన వంశీకుల నుంచి పరాయివాళ్ళ హస్తగత మవుతుందని కూడా భయపడ్డాడు.

ఇలాటి భయ సందేహాలతో కొంతకాలం మథనపడి యశోవర్ధనుడు చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు. అది, తన రాజ్యంలోని సామంతులనూ, పెద్దలనూ ఒకచోట సమావేశపరచటం, వారికి తన అభిప్రాయం తెలియపరిచి, చిన్నవాడైన గుణవర్ధనుణ్ణి









తన తరవాత రాజుగా అంగీకరించవలసిం
దని కోరటం.

ఇందుకుగాను కొన్నాళ్ళ తరవాత రాజ్యం
లోని సామంతులూ, పెద్దలూ సభకు పిలవ
బడ్డారు. అందరూ సమావేశం అయిన తర
వాత, యశోవర్ధనుడు వారికి తన అభి
ప్రాయం తెలిపరిచాడు. అంతేకాక, గుణ
వర్ధనుడు తన తరవాత పట్టాభిషిక్తుడు కావ
టానికి, తన పెద్దకుమారుడైన తపోవర్ధనుడు
అభ్యంతరం చెప్పడనికూడా సామంతలకు
హామీయిచ్చాడు.

అవగుణాల పుట్ట అయిన గుణవర్ధనుడు
రాజు కావటం సభలో ఎవ్వరికీ యిష్టం
లేదు. అయినా, ఆ మాట రాజుతో అనేం
దుకు ప్రతివారూ జంకారు. అలాంటి సమ
యంలో వీరపుర సామంతుడయిన సూర్య
వర్మ ధైర్యంగా సభలో లేచి నిలబడి, గుణ
వర్ధనుడి దుండగాలను గురించి చెప్పి,
అతడు రాజు కావటానికి తగడని తన అభి
ప్రాయం ప్రకటించాడు.

సభలో హర్షధ్వానాలు చెలరేగినై. సూర్య
వర్మ చెప్పినదానిని బలపరుస్తూ చాలా
మంది సామంతులు మాట్లాడారు. కొందరు
యశోవర్ధనుణ్ణి మరి కొంతకాలం రాజ్య
పాలనాభారం వహించవలసిందనీ, యీ



కాలంలో తపోవర్ధనుడికి రాజ్య వ్యవహా
రాల్లో ఆసక్తి కలిగించేందుకు ప్రయత్నించ
వలసిందనీ విన్నవించారు.

యశోవర్ధనుడికి ఏమి చేసేందుకూ పాలు
పోలేదు. ఇందరు సామంతులనూ, పెద్ద
లనూ వ్యతిరేకించి, తను చిన్న కొడు
కును రాజుగా ప్రకటిస్తే, దేశంలో అంత
ర్యుద్ధం తప్పదు. తన సామంతులందరిలో
బలవంతుడూ, పలుకుబడికలవాడూ
అయిన సూర్యవర్మ యిలాంటి తిరుగు
బాటుకు తప్పక నాయకత్వం వహిస్తాడు.
ప్రస్తుతానికి దేశంలో శాంతి కాపాడాలంటే,
తను రాజ్యపరిత్యాగం చేసే ప్రయత్నం విర









మించుకున్నట్టు ప్రకటించటం ఒక్కటే మంచిమార్గంగా ఆయనకు తోచింది. ఆయన అలాగే చేశాడు. సభికుల్లో ఆనందోత్సాహాలు వెల్లివిరిసినై.

సభ చాలించిన తరవాత యశోవర్ధనుడు తన మంత్రిని వెంటబెట్టుకుని నేరుగా ఉద్యానవనానికి వెళ్ళాడు. అక్కడ మంత్రిని సంప్రతించగా, అతడు సూర్యవర్మతో ఏకాంతంగా మాట్లాడటం మంచిదని యశోవర్ధనుడికి సలహా యిచ్చాడు.

సామంతుల్లో బలవంతుడైన అతణ్ణి తమ పక్షం చేసుకుంటే, అంతా చక్కబడగలదని మంత్రి అభిప్రాయపడ్డాడు.

సూర్యవర్మ ఉద్యానానికి పిలిపించబడ్డాడు. యశోవర్ధనుడు సగౌరవంగా అతడికి తన పక్కన కూర్చునేందుకు చోటు చూపి, "వర్మా! నీవు యీనాటి సభలో నిర్భయంగా వెలువరించిన అభిప్రాయాలతో నేను ఏకీభవించలేకపోయినా, నీ ధైర్యాన్ని మెచ్చుకుంటున్నాను. వీరపుర సామంతులెప్పుడూ ప్రభుభక్తిపరాయణులని నాకు తెలుసు. గుణవర్ధనుడు యింకా చిన్నవాడు. నీబోటి అనుభవజ్ఞుల అండదండలూ, సహాయసహకారాలూ వుంటే, అతడు చక్కని పరిపాలకుడు కాగలడని నా అభిప్రాయం," అన్నాడు.



"మహారాజా! ధర్మాధర్మాలు తెలిసిన వాడూ, సాధుశీలుడూ అయిన యువరాజు తపోవర్ధనుడుండగా, మీరు రాజ్యాన్ని మరెవరికో కట్టబెట్టచూడటం, ప్రజల దృష్టిలో న్యాయం అనిపించుకోదు," అన్నాడు సూర్యవర్మ.

"తపోవర్ధనుడు లౌకిక వ్యవహారాల్లో ఆసక్తి వున్నవాడు కాదు. అలాంటివాడివల్ల రాజ్యం అరాజకం పాలవుతుంది," అన్నాడు యశోవర్ధనుడు.

"అతడికి లౌకిక విషయాల్లో ఆసక్తి కలిగించటం ఏమంత కష్టంకాదు. జ్యేష్ఠుడుగా అతడు నిర్వహించవలసిన బాధ్యతలను గుర్తుచేస్తే, అతడు తప్పక రాజ్యభారం వహించగలడు," అన్నాడు సూర్యవర్మ.

యశోవర్ధనుడు తన మంత్రికేసి సాభిప్రాయంగా చూశాడు. మంత్రి, సూర్యవర్మ చెప్పినదానికి అవునన్నట్టు తల వూపాడు.

"అలా అయితే, తపోవర్ధనుణ్ణి ఒక్క సంవత్సరంపాటు నీ సంరక్షణలో వుంచుతాను. ఈ కాలంలో అతడికి లౌకిక వ్యవహారాల్లో ఆసక్తి కలిగించి, రాజార్హమైన విద్యాబుద్ధులు నేర్పగలవా?" అని అడిగాడు యశోవర్ధనుడు.

సూర్యవర్మ అందుకు అంగీకరించాడు. ముందుగా తను వీరపురం వెళ్ళి, అక్కడి





పరిపాలనా వ్యవహారాలను తన కుమారుడు చంద్రవర్మకు ఒప్పచెప్పి, కొద్ది రోజులలోనే రాజధానికి తిరిగిరాగలనన్నాడు. ఇందుకు యశోవర్ధనుడు సరేనన్నాడు.

సూర్యవర్మ, యశోవర్ధనుడిదగ్గిర సెలవు తీసుకుని తన విడిదికి వెళ్ళాడు. ఆ రోజు సాయంత్రమే బయలుదేరి వీరపురం వెళ్ళేం దుకు సన్నాహాలు ప్రారంభించాడు.

సూర్యవర్మ యీవిధంగా తిరుగుప్రయా ణానికి సన్నాహాలు చేసుకుంటూ వుండగా, ఆతణ్ణి దారిలో పొంచివుండి హత్య చేసేం దుకు మరొక ప్రదేశంలో ఏర్పాట్లు జరుగు తున్నవి. దీనికి నాయకుడు సర్పకేతుడనే ఒక సామంతుడు. ఆతడి రాజ్యం వీరపురం ఎల్లలలోనే వుంది. ఎలా అయినా తను వీరపురాన్ని చేజిక్కించుకోవాలని ఆతడు ఎంతకాలంగానో వ్యూహాలు పన్నుతున్నాడు, కాని సాధ్యంకాలేదు. ఈనాడు, యశో వర్ధనుడి చిన్న కొడుకైన గుణవర్ధనుణ్ణి తన పక్షానికి తిప్పుకోవటంద్వారా తన పని సాను కూలం కాగలదని ఆతడు వూహించాడు.

తండ్రి తరవాత తను రాజు కావటానికి వ్యతిరేకించినవాడు వీరపుర సామంతుడైన సూర్యవర్మ అని తెలిసినప్పుడు గుణవర్ధ నుడు నిలువెల్లా దహించుకుపోయాడు. ఆతడి అండ చూసుకునే తతిమ్మా సామం తులుకూడా తనకు వ్యతిరేకులయ్యారని ఆతడు భావించాడు. కాని, సూర్యవర్మను తను ఒంటరిగా ఎదిరించలేడు. తనవెంట తిరిగే మిత్రుల్లో ఎవరూకూడా అంత ధైర్య సాహసాలు కలవాళ్ళు కారు.

గుణవర్ధనుడు, సూర్యవర్మమీద పగ తీర్చుకోవటం ఎలానా అని ఆలోచిస్తున్న సమయంలో, సర్పకేతుడు ఆతణ్ణి చూడ వచ్చాడు. ఇద్దరూ ఒకరి మనోభావాలను మరొకరు తెలుసుకున్నారు. కొద్దిమంది అంగ రక్షకులతో వీరపురం పోతున్న సూర్య వర్మను, కొండలలో హఠాత్తుగా ఎదిరించి





చంపటం చాలా తేలిక అని సర్పకేతుడు చెప్పాడు. అందుకు అవసరం అయిన బలగం తనవెంట వున్నదన్నాడు.

"మీరు యీ పని విజయవంతంగా నెరవేర్చగలిగితే, ఏదో ఒకనాడు మీరు కోరిన సహాయం చేస్తాను. బలవంతుడైన సూర్యవర్మ ఆటంకం లేనినాడు నేను రాజుకావటం నిజం!" అన్నాడు గుణవర్ధనుడు.

"అందులో సందేహం లేదు. అలా జరుగుతుందని ముందుగా వూహించే, నేను సూర్యవర్మ సంస్థానాన్ని ఆక్రమించుకునేందుకు అవసరమైన వ్యూహం ఆలోచించి వుంచాను. అతడి మరణవార్త తెలియగానే, నా సైన్యం ఆ సంస్థానంమీద పడి ఆక్రమించుకుంటుంది. అందుకు సూర్యవర్మ కొడుకు చంద్రవర్మ పెద్ద ఆటంకం కాదు. నా సైన్యం అంతా మామూలు పౌరులు ధరించే ఉడుపులు ధరించి వీరపురం కోటను ఆక్రమించుకుంటారు. యశోవర్ధన మహారాజుకు, అది క్రూరుడైన సామంతుడిమీద సంస్థానప్రజలు చేసిన తిరుగుబాటుగా కనిపించేటట్టు చూడాలి," అన్నాడు సర్పకేతుడు.

"అందుకు అవసరం అయిన సహాయం నేను చేస్తాను. సూర్యవర్మ ప్రజాకంటకుడని మా తండ్రిగారితో సమయం చూచుకుని చెపుతాను. అతడి హత్య వీరపుర సంస్థాన సరిహద్దుల్లోనే జరగటం దీన్ని బాగా బలపరుస్తుంది. తతిమ్మా ఏర్పాట్లు మీరు చేయండి," అన్నాడు గుణవర్ధనుడు.

గుణవర్ధనుడి మాటలు సర్పకేతుడికి చాలా ఉత్సాహాన్ని కలిగించినై. బలవంతుడైన సూర్యవర్మ ఆటంకం తొలగిననాడు, గుణవర్ధనుణ్ణి మాహిష్మతీ నగరరాజును చేయటం ఏమంత కష్టంకాదని అతడికి తోచింది. సూర్యవర్మను హత్యచేసిన తరువాత తను వీరపుర సంస్థానాన్ని తన సంస్థానంలో కలుపుకోవటమే గాక, మాహి









ఖ్యాతి రాజాస్థానంలోకూడా గొప్ప పలుకు బడిని సంపాయించవచ్చునుకున్నాడు.

ఈ విధంగా సూర్యవర్మను హత్య చేసేందుకు కుట్ర పన్నిన సర్పకేతుడు హడావిడిగా రాజధానీనగరం వదిలి, తన అనుచరులతో వీరపుర సంస్థాన సరిహద్దుల్లో పొంచివుండి సూర్యవర్మ రాకకోసం ఎదురు చూడసాగాడు.

సూర్యవర్మకు తనమీద జరుగుతున్న కుట్రవిషయం ఏమీ తెలియదు. అతడు కొద్దిమంది అనుచరులతో, సేవకులతో కలిసి ఆ సాయంకాలమే తన సంస్థానానికి బయలు దేరాడు. మధ్యదారిలో ఆ రాత్రికి ఒకచోట మజిలీచేసి, సూర్యోదయం కాగానే మళ్లీ ప్రయాణం సాగించాడు.

ఆనాటి సూర్యాస్తమయ సమయానికి సూర్యవర్మ తన సంస్థాన సరిహద్దులను చేరాడు. ఆ ప్రాంతమంతా కొండలా, చెట్ల డవులామయం. ఏ ప్రమాదాన్నీ శంకించని సూర్యవర్మ తన గుర్రాన్ని ముందు నడుపుతూ, తను యువరాజు విషయంలో స్వీకరించ నున్న కొత్త బాధ్యతలను గురించి ఆలోచిస్తున్నాడు.

హఠాత్తుగా కొండగుట్టలలో చిన్న కల కలం బయలుదేరింది. సూర్యవర్మ ఆ ధ్వని వింటూనే గుర్రాన్ని ఆపి వెనుదిరిగి తన అనుచరులకేసి చూసేంతలో, రాళ్ళవెనక నుంచీ, చెట్లవెనకనుంచీ సామాన్య పౌర దుస్తులు ధరించివున్న అనేకమంది సాయుధులైన రౌతులు భీకరంగా అరుస్తూ వాళ్ళమీద పడ్డారు. సూర్యవర్మ రెప్పపాటు కాలంలో ఒరనుంచి కత్తిదూసి, శత్రువు లను ఎదుర్కొన్నాడు. కాని, అనరికే అతడు తన అనుచరులనుంచి వేరు చేయ బడ్డాడు. పదీ పన్నెండుమంది సాయుధులు భీకరంగా అరుస్తూ ఒక్కుమ్మడిగా అతడి మీద విరుచుకుపడ్డారు.

—(ఇంకా వుంది)







# కంచుకోట

## 2

[మాహిష్మతీనగర రాజైన యశోవర్మనుడు, తన కుమారు లిద్దరిలో చిన్నవాడైన గుణవర్మను డికి పట్టాభిషేకం చేయాలని నిశ్చయించాడు. కాని యిందుకు వీరపుర సామంతుడైన సూర్యవర్మ వ్యతిరేకించాడు. సర్పకేతు డనే సామంతుడు, గుణవర్మనుడితో కుట్రపన్ని, అతణ్ణి హత్య చేసేందుకు అడవిలో పొంచివుండి హఠాత్తుగా మీద పడ్డాడు. తరవాత—]

సూర్యవర్మ తను శత్రువ్యూహంలో చిక్కుకున్నానని గ్రహించాడు. ఆ శత్రువు ఎవడో కూడా అతడికి అర్థమైంది. "నరకండి! చంపండి! సూర్యవర్మ ప్రాణాలతో బైట పడితే, మీ ప్రాణాలు దక్కవు!" అన్న మాటలు అతడికి వినిపించినై. ఆ కంఠ స్వరం సర్పకేతుడి దని ఆతడు వెంటనే పోల్చుకున్నాడు. సూర్యవర్మ చేతికత్తి గాలిలో రివ్వు రివ్వుమని భయంకరంగా ధ్వనించింది. ఎదురుగా వున్న శత్రు సైనికుడి తలతోపాటు, పక్కగా ఎదుర్కొన వచ్చిన శత్రువు కుడి చేయి కూడా ఒకే దెబ్బకు గాలిలోకి ఎగిరి దూరంగా పడినై. కాని, అదే సమయంలో మరి నలుగురు శత్రు సైనికులు ఒక్కుమ్మడిగా అతణ్ణి చుట్టుముట్టారు. సర్పకేతుడు భీకరంగా అరుస్తూ తన సైనికులను హెచ్చరిస్తున్నాడు.







అంతలో దూరం నుంచి, "అయ్యా, ప్రభూ! వస్తున్నాను," అన్న జవాబు వినబడింది.

"నువ్వు వెంటనే వీరపురానికి వెళ్ళి, చంద్రవర్మతో...." సూర్యవర్మ మాట ముగించక ముందే, ఒక శత్రుసైనికుడు అతణ్ణి వెనకనుంచి కత్తితో పొడిచాడు.

ఆ కత్తిపోటుకు, సూర్యవర్మ, "అబ్బా!" అంటూ గుర్రం మీది నుంచి కిందికి పడిపోయాడు. అదే సమయంలో అతడి శరీరం మీద మరి కొన్ని కత్తిదెబ్బలు బలంగా తగిలినై.

"అదుగో, ఒకడు పారిపోతున్నాడు! వాణ్ణి తరిమి చంపండి. ఈ వార్త ముందుగా వీరపురంలో తెలియకూడదు!" అంటూ సర్పకేతుడు గావుకేక పెట్టాడు. ఆ వెంటనే నలుగురైదుగురు అశ్వికులు, పారిపోతున్న సుబాహుడి వెంటబడ్డారు.

సుబాహుడు సూర్యవర్మ సేవకుల్లో చాలా నమ్మకస్థుడు. అతడు బాల్యం నుంచి సూర్యవర్మను సేవిస్తున్నవాడు. అతడు మంచి తెలివితేటలు గలవాడే కాక, చాలా ధైర్యసాహసాలు కూడా గలవాడు.

తన ప్రభువును రక్షించటం సాధ్యం కాదని గ్రహించగానే, సుబాహుడు అక్కడి నుంచి పారిపోయి, జరిగిన ఘోరం సంగతి ముందుగా చంద్రవర్మతో చెప్పా

తనకు మృత్యువు తప్పదని సూర్యవర్మ అనుకున్నాడు. హఠాత్తుగా అతడికి తన కుమారుడు చంద్రవర్మ గుర్తుకు వచ్చాడు. తన మరణం తరవాత సర్పకేతుడు తన సంస్థానాన్ని ఆక్రమించుకునేందుకు ప్రయత్నించి తీరుతాడు. ముందుగా తన కుమారుణ్ణి తగు జాగ్రత్తలో వుండ వలసిందిగా హెచ్చరించగలిగితే ఎంత బావుండును!

"సుభాహూ! సుబాహూ!" అని పెద్దగా కేకవేస్తూ, సూర్యవర్మ శత్రు అశ్వికుల్లో ఒకణ్ణి కత్తితో నిలువునా నరికి, మరొకడి గుర్రాన్ని గుండెల్లో పొడిచి అది అదనుగా తనగుర్రాన్ని వెనక్కు తిప్పాడు.



లనుకున్నారు. అంతలో సూర్యవర్మ హెచ్చరిక వినిపించింది. సుబాహుడు తన గుర్రాన్ని శత్రుఅశ్వికుల మధ్య నుంచి పక్కకు దూకించి, కొండదారి వెంట వడిపాడు.

గుర్రం అతి వేగంగా పరిగెత్తుతున్నది. సుబాహుడు వీరపురం చేరాలంటే, ఆ కొండపై నున్న చుట్టుదారి వెంట పోవాలి. ఆ మార్గం చాలా ఇరుకైనది. రెండు గుర్రాలు ఎదురుబొదురుగా తప్పుకునేందుకు మాత్రమే జాగా ఉంటుంది.

గుర్రాన్ని కొండమీదికి ఎక్కిస్తూ, సుబాహుడు వెనుదిరిగి చూశాడు. అతడిని వెంబడిస్తున్న అశ్వికులు కూడా తమ గుర్రాలను ఒకదాని వెనక ఒకదానిని కొండ ఎక్కిస్తున్నారు.

శత్రు సైనికులకూ, సుబాహుడికీ మధ్య వున్న దూరం దాదాపు బాణం వేటుకు అందీ అందనట్లుగా వుంటుంది.

తనకూ, శత్రువులకూ మధ్య వున్న దూరాన్ని మరికొంత ఎక్కువ చేసుకో గలిగితే తప్ప, లేకపోతే శత్రువుల బాణాలకు తను ఆహుతి కావలసి వస్తుందని సుబాహుడు గ్రహించాడు.

అతడిలా ఊహిస్తున్నంతలో రివ్వు మంటూ ఒక బాణం వచ్చి, అతడికి పది పన్నెండు గజాల వెనకగా తక్కు మంటూ ఒక కొండరాయికి బలంగా తగిలి, రెండుగా విరిగి కింద పడిపోయింది.

సుబాహుడు తన గుర్రాన్ని గట్టిగా అదలించాడు. అది మరింత వేగంగా పోసాగింది. వెనక రివ్వుమనే బాణాల చప్పుడూ, కేకలూ వినిపించసాగినై. కొంచెంసేపు తరవాత అతడు వెనుదిరిగి చూశాడు. శత్రుసైనికులకూ అతడికీ మధ్య వున్న దూరం మరికొంత ఎక్కువ యింది. కాని, వాళ్ళు వదిలేలా లేరు. అతణ్ణి అనుసరించి గుర్రాలను నడుపుతూనే వున్నారు.

మెలికలుగా కొండను చుట్టివున్న, ఆ సన్నని మార్గం. వెంట సుబాహుడు తన

గుర్రాన్ని జాగ్రత్తగా నడుపుతున్నాడు. అతడికి కుడివైపున ఉవ్వెత్తుగా లేచిన కొండగోడా, ఎడమవైపున అగాధంలాంటి పల్లమూ వున్నవి. గుర్రం కాలు ఏ మాత్రం పట్టు తప్పినా, తను అగాధంలోపడి తునాతునకలవటం తప్పదు. అంతేకాక, క్రమంగా చీకటి కమ్ముకోవటంతో మార్గం కూడా అంత స్పష్టంగా కనిపించటం లేదు. కాని, తనను శత్రువులు వెంబడిస్తున్నారన్న సూచనగా, గుర్రాల సకిలింపులూ, వాటి గిట్టలకు తగిలి దిగువ అగాధంలోకి జారుతున్న రాళ్ళధ్వని వినిపించుతూనే వున్నవి.

కొంతసేపటికి బాగా చీకటిపడి చంద్రుడు ఉదయించాడు. కొండమార్గం మరింత మెలికలు తిరుగుతున్నది. అలాంటి సమయంలో సుబాహుడికి హఠాత్తుగా శత్రుఅశ్వికులు అగాధానికి అవతల వున్న దారి మీద కనిపించారు. అంతకు ముందు అతడు ఆ మార్గానే వచ్చాడు. మధ్య అగాధం ఒకటి వారిని వేరుచేస్తున్నా, అడ్డదారిన చూస్తే, వాళ్ళు అతడికి చాలా సమీపంలో వున్నారు. "ఇప్పుడు వాళ్ళు బాణాలు ప్రయోగించేందుకు మంచి అవకాశం!" అనుకుంటూ సుబాహుడు గుర్రం మీది నుంచి దిగబోయేంతలో రివ్వుమంటూ ఒక బాణం వచ్చి గుర్రం డొక్కలో బలంగా తాకింది.

గుర్రం ముందు రెండు కాళ్ళనూ గాలిలోకి ఎత్తి, పెద్దగా ఘోషించి గుద్ది



దానిలా కుడివైపునవున్న కొండ అంచును తలతో ఓసారి ఢీకొట్టి, దభీమంటూ పక్కకు పడిపోయింది. దానితోపాటు సుబాహుడు కూడా కిందికి పడిపోయాడు. మరుక్షణం గుర్రం పెద్దగా సకిలించి అగాథం వైపుకు దొర్లింది. రికాబులో కాలు చిక్కుకున్న సుబాహుడు కూడా దానితోపాటు అగాథంకేసి ఈడ్వబడ్డాడు. అయిదారు పొర్లిగింతల తరవాత కొంచెం ఏటవాలుగా వున్న ఆ ప్రదేశంలో సుబాహుడి చేతికి ఒక బలమైన చెట్టుకొమ్మ దొరికింది.

అతడు దానిని బలంగా రెండు చేతులతోనూ పట్టుకున్నాడు. అతడి కాలినుంచి రికాబు జారిపోయింది.

గుర్రం పెద్ద ధ్వనితో రాళ్ళమీదుగా మరికొంత దూరం దొర్లుకుంటూ పోయి, పెద్ద శబ్దంతో దిగువనున్న అగాథంలో పడిపోయింది.

అగాథానికి అవతల గల కొండమార్గం మీదినుంచి ఒక్కుమ్మడిగా కేకలూ, చప్పట్లూ వినిపించినై. శత్రువులు తనను హతమార్చామని భ్రమపడుతున్నారని సుబాహుడు గ్రహించాడు. గుర్రంతోపాటు తనూ అగాథంలో పడి చిన్నాభిన్నమై పోయాడని వాళ్ళు భావిస్తున్నారు.

సుబాహుడు చెట్లకొమ్మల్లో వున్న చోటునే కదలా మెదలక వుండిపోయాడు. ఆ ప్రదేశం కొంత చీకటిగా వున్నా, తెల్లని చంద్రకాంతిలో తను కదిలితే శత్రువులు





గుర్తించవచ్చు. అప్పుడు మరొక బాణం తన ప్రాణాలను బలిగొంటుంది.

సుబాహుడు కొమ్మల సందుగా శత్రు సైనికుల కేసి పరీక్షగా చూశాడు. వాళ్ళు గుర్రాలు దిగి అగాధం అంచుకు వచ్చి మోకాళ్ళమీద వంగి చూసి, తరవాత తమతమ గుర్రాల దగ్గిరకు వెళ్ళి కొంచెం సేపు కూడబలుక్కున్నారు. వాళ్ళు ఒక వేళ తనను గుర్తించారేమో అని భయ పడుతూన్న సుబాహుడికి, అంతలోనే వాళ్ళ నవ్వులు వినిపించినై. తరవాత వాళ్ళు గుర్రాలను వచ్చిన మార్గంకేసి తిప్పి, వాటిని అధిరోహించి బయలు దేరారు.

సుబాహుడు నిశ్చింతగా ఊపిరి పీల్చు కున్నాడు. రికాబులో చిక్కి మెలిదిరిగిన కాలు నెప్పి పెడుతున్నా, అతడికి ఆ సమయంలో అదేమంత బాధ అనిపించ లేదు. తను శత్రువుల చేతబడకుండా తప్పించుకున్నాడు. సూర్యోదయం లోపల వీరపురం చేరి చంద్రవర్మకు, జరిగిన ఘోరం సంగతి చెప్పి, సర్పకేతుడి మీద పగ తీర్చుకునే ఉపాయం గురించి ఆలో చించవచ్చు.

శత్రుసైనికులు కొండమార్గం మలుపు తిరగగానే, సుబాహుడు కొమ్మల చాటు నుంచి బయటికి వచ్చాడు. అతడి దుస్తులు చీలికలూ వాలికలూ అయి వున్నవి. శరీరం చాలాచోట్ల దోక్కుపోయి రక్తం కారుతున్నది. అతడు అక్కడ వున్న చెట్ల ఆకులు రెండు గుప్పెళ్ళ నిండా కోసి, వాటిని బాగా నలిపి ఆ వచ్చిన ఆకురసాన్ని తన గాయాలకు పూసు కున్నాడు. ఆదే సమయంలో అతడికి కొంత దాపులగా కొండచిరుత అరుపు వినిపించింది.

ఆ అరుపు వింటూనే సుబాహుడు నిశ్చేష్టుడయ్యాడు. ఈ కొండకోనల్లో చిరుతపులులూ, తోడేళ్ళేగాక, పెద్ద పెద్ద కొండచిలువలు కూడా వుంటవని అతడికి జ్ఞాపకం వచ్చింది. అలాంటి వాటి నోట





పడకుండా తను బతికి బయటపడాలంటే రక్షణకు ఏదో ఒక ఆయుధం అవసరం. కాని, తన కత్తి డాలూ గుర్రంమీద నుంచి దొర్లినప్పుడు ఎక్కడో పడిపోయినై.

సుబాహుడు అటు యిటూ కలయ చూసి, అందుబాటులో కనిపించిన ఒక దృఢమైన చెట్టుకొమ్మను విరిచి చేత బట్టుకున్నాడు. తరవాత అక్కడ వున్న రాళ్ళనూ, కొమ్మలనూ ఊతగా చేసుకుని కొంచెం, కొంచెంగా పాకుతూ, మార్గం మీదికి వచ్చాడు.



ఇప్పుడు తను ఏ మార్గాన పోతే వీర పురం దగ్గిరో సుబాహుడికి తెలుసు. అతడు గుడ్డి వెలుగులో అతిజాగ్రత్తగా నడుస్తూ, బాగా నడిరేయి అయేసరికి కొండకు అద్దరిన వున్న ఒకానొక గ్రామప్రాంతానికి చేరాడు.

గ్రామం యింకా అల్లంత దూరం వుండనగా సుబాహుడికి కాగడాల కాంతి, వాటి చుట్టూచేరి మాట్లాడుకుంటున్న మనుషులూ కనిపించారు. ఇంత రాత్రి వేళ గ్రామవాసులకు వూరి వెలపల ఏం పని? బహుశా, యీ కాగడాలు బంది పోటు దొంగలవేమో అన్న అనుమానం కలిగింది సుబాహుడికి. అంతలోనే గుర్రపు డెక్కల శబ్దం వినబడింది. రస్తా వెంట అతివేగంగా పరుగులు తీస్తున్న రౌతులు కొందరు, కాగడాలు పట్టుకుని వున్న వాళ్ళను సమీపించి, "ఇంకా యిక్కడే జాగుచేస్తున్నారా? ఊc—కద లండి, నడవండి!" అని హెచ్చరిక లిస్తూ ముందుకు వెళ్ళిపోయారు.

ఈ సంఘటన సుబాహుడికి ఆశ్చర్యాన్నే కాక, అనుమానం కూడా కలిగించింది. ఆ కాగడావాళ్ళు బందిపోట్లు కారు. గుర్రపు రౌతులు ధరించిన దుస్తుల తీరుచూస్తే, వాళ్ళు సైనికులుగా కనిపిస్తున్నారు. అయితే వాళ్ళు వీరపుర సైనికులా? లేక సర్పకేతుడి సైనికులా? కాగడాలచుట్టూ చేరిన జనం కదిలి వెళ్ళవలసిన ప్రాంతం ఏదై వుంటుంది?

ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు రాబట్టాలంటే, తను ఆ కాగడాలున్న చోటుకు వెళ్ళటం ఒక్కటే మార్గమని సుబాహుడు నిశ్చయించుకున్నాడు. ఒక వేళ వాళ్ళు వీరపురం పౌరులే అయితే, వాళ్ళనుంచి తను ఒక గుర్రాన్ని ఎరువు తీసుకుని త్వరత్వరగా వీరపురం చేరవచ్చు. అలా కాకవాళ్ళు శత్రువులైతే....సుబాహుడు తన దుస్తులకేసి పరీక్షగా చూసుకున్నాడు. ఈ చింకి దుస్తుల్లో తను ఫలానా అని ఎవరూ గుర్తించలేరన్న ధైర్యం అతడికి కలిగింది. అతడు ముందుకు నడిచి కాగడాలవాళ్ళను సమీపించాడు.

సుబాహుడు దాపులకు వచ్చేలోపలే, కాగడాల చుట్టూ చేరినవాళ్ళలో ఒకడు, పెద్దగా గొంతెత్తి, "అడుగో, ఎవడో బిచ్చగాడు వస్తున్నట్టున్నది. ఒరే తిరిపెం! నువు యిక అడుక్కుతిన నవసరం లేదు. తెల్లవారేలోపల మేము వీరపురాన్ని కొల్లగొట్ట బోతున్నాం. మా వెంట వస్తివా, నీక్కూడా అటూ యిటూ పధ్నాలుగు తరాలకు సరిపడా సొమ్ము దొరుకుతుంది! ఏమంటావ్? వస్తావా?" అన్నాడు.

సుబాహుడు నిర్విణ్ణుడై అంతలోనే తేరుకుని, "అవును, దొరా! నేనూ మీ వెంట వీరపురం వస్తాను. నాకు సొమ్మేమీ అవసరం లేదు. డొక్కటానికి యింత బువ్వ దొరికితే చాలు!" అన్నాడు.

అవతలివాడు ఏదో అనబోయేంతలో కొందరు రౌతులు వేగంగా అటు వస్తూ, "సర్పకేతరాజుకూ జై!" అంటూ అరిచి, "మీలో ఎవరైనా వీరపురం వాళ్ళున్నారేమో ఇప్పుడే చూసుకోండి. తరవాత ఏడిచి లాభం లేదు!" అన్నారు.

జనంలో ఒకడు, సుబాహుణ్ణి వాళ్ళకు చూపుతూ, "ఇక్కడ వున్నవాళ్ళమంతా ఒకరి నొకరు ఎరిగున్న వాళ్ళమే! వీడెవడో కొత్తవాడు. బిచ్చగాడిలా వున్నాడు. యిప్పుడే యిక్కడికి వచ్చాడు." అన్నాడు.

రౌతులు "హేయ్!" అంటూ సుబాహుడి కేసి తమ గుర్రాలను వేగంగా దూకించారు. —(ఇంకావుంది)








# 3

[సర్పకేతుని అనుచరుల కత్తిదెబ్బలకు, తన యజమాని సూర్యవర్మ మరణించటం చూసిన సుబాహుడనే సేవకుడు, ఈ సంగతి సూర్యవర్మ కుమారుడైన చంద్రవర్మకు చెప్పేందుకు, గుర్రంమీద వీరపురం బయలుదేరాడు. దారిలో అతని గుర్రాన్ని సర్పకేతుని అనుచరులు చంపారు. కాలినడకను కొండ దిగిన సుబాహుడికి కాగడాలతో వున్న పల్లివాసులు కనిపించారు. అతడు వారిని సమీపించేంతలో కొందరు రౌతులు, 'హేయ్' అంటూ అతణ్ణి చుట్టుముట్టారు. తరవాత—]

సుబాహుడు ఒక్క త్రుటికాలం నిశ్చేష్టు డయాడు. తన అంతం సమీపించిందని కూడా అతడు భయపడ్డాడు. తన యజమాని మరణం సంగతి వీరపురంలో తెలియ పరిచిన తరవాత, యిలాంటి ప్రమాదం వచ్చివుంటె అతడు లెక్కచేసి వుండేవాడు కాదు. ఈ క్షణాన తన చావు వీరపుర సంస్థానానికికూడా ఎంతో వినాశకరంగా పరిణమిస్తుంది. దైవకృపవలన తను, యీ రౌతులను మోసపుచ్చి పారిపోగలిగితే ఎంత బావుండును!

"ఏయ్, ఎవరు నువ్వు? మాట్లాడవేం?" అంటూ ఒక రౌతు సుబాహుణ్ణి సమీపించి, చేత్తో జుట్టు పట్టుకుని కుదిపాడు.

అంతలో జనంలోనుంచి ఒకడు, "పాపం, ఆ పిచ్చిగాణ్ణి హింసించకండి! ఉపవాసాలతో మాటా పలుకూ పడిపోయి నట్టుంది!" అన్నాడు జాలిగా.







ఆ మాటలతో సుబాహుడు తెప్పరిల్లాడు. తను మామూలు బిచ్చగాడుగా నటించటం ఏమంత కష్టం కాదని అతడికి ధైర్యం కలిగింది.

"బాబూ, యింత రొట్టెముక్క! యింత..." అంటూ సుబాహుడు రౌతు కళ్ళల్లోకి జాలిగా చూస్తూ, గుర్రం కళ్ళాన్ని పట్టుకున్నాడు.

"ఛీ, యిదేం పీడ! ఎవడో వీరపురం వేగులవా డనుకున్నాను," అంటూ రౌతు గుర్రాన్ని అదిలించి ముందుకు వెళ్ళాడు.

"వీడేం వేగులవాడు! శరీరంలో ప్రాణం వున్నట్టే లేదు. యీ చింకిగుడ్డలూ వీడూ... అరే, శనిగ్రహం! నీ వంటినే మోసుకోలేని వాడికి, చేతులో ఆ లావు దుడ్డుకర్ర ఎందుకు?" అన్నాడొక రౌతు.

"కొండల్లో చిరుతపులుల్ని, తోడేళ్ళని బెదరకొట్టేందుకు, దొరా," అన్నాడు సుబాహుడు తడుముకోకుండా.

ఈ జవాబు వింటూనే రౌతులతోపాటు, జనంలోనుంచికూడా కొందరు పొట్టలు చెక్కలయేలా నవ్వారు. "ఎంత గొప్ప వేటగాడివిరా నువు! కాలుతీసి కాలు పెట్టే ఓపిక లేనివాడివి చిరుతపులుల్ని తోడేళ్లని బెదరకొడతావా?" అన్నారు వాళ్ళు.

"ఇంత రొట్టెముక్క పెట్టించండి, దొరా! తరవాత నా ప్రతాపం చూద్దురుగాని. వారంరోజులుగా పచ్చి మంచినీళ్లతో బతుకుతున్నాను," అన్నాడు సుబాహుడు.

రౌతులు యీ మాటలేవీ వినిపించుకో లేదు. వాళ్ళు గుర్రాలను ముందుకు వురికిస్తూ, "మీరు త్వరగా రాకాసిదిబ్బదగ్గిరకు చేరాలి. అక్కడ మీకు కావలసిన ఆయుధాలు యివ్వబడతై. తెల్లవారేలోపల వీరపురం మన గుప్పెట చిక్కుతుంది. సర్పకేత రాజుకూ, జై!" అంటూ వెళ్లిపోయారు.

సైనికులు వెళ్ళగానే, జనంలోనుంచి కొందరు ముందుకు వచ్చి, సుబాహుణ్ణి









చుట్టుముట్టారు. వాళ్ళల్లో ఒకరు సుబాహుడితో, "ఏరా అబ్బీ! చూట్టానికి యువకుడిలాగే కనబడుతున్నావు. కాలూ చేయీ కూడా బాగానే వున్నట్టున్నది. అలాంటి వాడికి ఈ బిచ్చం ఎత్తుకునే కర్మ ఎందుకు పట్టింది?" అన్నారు.

"అది తెలుసుకునేందుకే, యీ కొండల మీద వున్న ఒక గురువును అయిదేళ్లనుంచి సేవిస్తున్నాను, దొరా? ఆయనకు యిన్నేళ్ళుగా నామీద దయ కలగలేదు. ఇంతకు ఒక గంట ముందుగానే ఆయన ప్రసన్నులై కొండమీదినుంచి, కాగడాలతో వున్న మీ అందరినీ చూపిస్తూ, 'ఇవ్వాళ తెల్లవారే లోపల నిన్ను యింతకాలంగా పట్టి పీడిస్తున్న శని వదిలిపోతుంది. అంతే కాదు, నీ వెంట వచ్చేవాళ్ళ శనికూడా విరగడ అవుతుంది. అదుగో, ఆ కనబడే కాగడాలదగ్గిరకు వెళ్ళు!' అని సెలవిచ్చారు. దానితో హుటాహుటిగా కొండ దిగి మీదగ్గిరకు వచ్చాను," అన్నాడు సుబాహుడు.

సుబాహుడు యిలా చెప్పగానే చుట్టూ చేరిన వాళ్ళు ఒక్క క్షణకాలం ఆశ్చర్య సంభ్రమాలతో నోట మాటరాక తడబడి, అంతలోనే తెప్పరిల్లి, "ఆ కొండమీద వుండే మహాపురుషుణ్ణి గురించి చాలాకాలంగా వినటమే గాని, చూసినవాళ్ళెవరూ లేరు. ఇవ్వాళ తెల్లవారేలోపల వీరపురాన్ని వశపరుచుకుని కొల్లగొట్టబోతున్నాం. దివ్యదృష్టి వున్నవాడు గనక, ఆయనకు ముందుగానే యిదంతా తెలిసివుంటుంది. ఇక మనకు విజయం తప్పదు. త్వరగా బయలుదేరుదాం," అన్నారు.

ఆ వెంటనే కొందరు గ్రామంలోకి పరిగెత్తి. సుబాహుడి కోసం యిన్ని రొట్టెలూ, పాలూ తీసుకువచ్చారు. సుబాహుడు తృప్తిగా వాటితో కడుపు నింపుకున్న తరవాత, అతడి ముందు కొత్తదుస్తులు పెట్టి, ఆ చింకి గుడ్డలు విప్పి, వాటిని ధరించమన్నారు. అలాంటి







దుస్తుల్లో తానెవరైందీ గుర్తించేవాళ్లు వుండ వచ్చని అనుమానించిన సుబాహుడు, వాళ్ల కేసి ఆప్యాయత ఒలికేలా చూస్తూ, "మిత్రులారా! మీ దయకు కృతజ్ఞుణ్ణి. కాని, యిప్పుడు నేను కొత్తదుస్తులు ధరించటం గురువు ఆజ్ఞను ధిక్కరించటం అవుతుంది. నన్ను పట్టి పీడిస్తున్న శని, యీనాటి సూర్యోదయం లోపల వదిలిపోతుంది. ఆ తరవాత వీటిని ధరిస్తాను," అన్నాడు.

ఆ వెంటనే, "జై...." అంటూ కొందరు దిక్కులు పిక్కటిల్లేలా అరిచి, సుబాహుడి కేసి తిరిగి, "ఇంతకూ నీ పేరేమిటో మాకు తెలియులేదు!" అన్నారు.

"పేరా.... పేరు....!" అంటూ సుబాహుడు కొంచెం తడబడి, "తల్లి దండ్రులు పెట్టిన పేరు ఏమయితేం? శనిచేత యింత కాలంగా పీడించబడుతున్నవాణ్ణి. గురువాజ్ఞ మేరకు అది వదలగానే........" అంటూండగానే, జనంలోనుంచి ఒకడు, "ఇవ్వాళతో మనందరి శనీ వదులుతుంది! ఈనాటి నుంచి నీపేరు శనిమర్దనుడు," అన్నాడు. వెంటనే "శనిమర్దనుడికీ, జై!" అన్న కేకలు మిన్నుముట్టినై.

తరవాత అందరూ కాగడాల వెలుగులో రాకాసిదిబ్బ దగ్గరకు బయలుదేరారు. తన వెంట వున్నవాళ్లు మాట్లాడుకునేదాన్నిబట్టి,





వాళ్ళంతా కటిక దరిద్రులని, సర్పకేతుడు ధనధాన్యాలు దోచుకుతవని ఆశ కల్పించటం వల్లనే, వాళ్ళు వీరపురంకేసి బయలుదేరుతున్నారని గ్రహించాడు సుబాహుడు.

"నాకు వీరపురాన్ని గురించి బాగా తెలియదు. దాని సామంతుడైన సూర్యవర్మ అంత ప్రజాకంటకుడా?" అని సుబాహుడు జనంలో ఒకడిని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే అతను నవ్వి, "ఈ సామంతుల్లో ప్రజాకంటకుడు కాని వాడెవడు? సూర్యవర్మ సంగతి మాకు తెలియదుగాని, సర్పకేతుడికన్న జనకంటకుడు మరొకడు పుట్టబోడు," అన్నాడు.

"అలా అయితే, వీరపురాన్ని దోచుకోవటానికి మనం ఎందుకు వెళ్ళాలి? ఆ విధంగా మనం సర్పకేతుడికి సాయం చేసినవాళ్ళ మవుతాంగదా!" అన్నాడు సుబాహుడు.

అసరికి వాళ్ళిద్దరి సంభాషణలో మరి నలుగురైదుగురు వచ్చి పాల్గొన్నారు. వాళ్ళు సుబాహుడి ప్రశ్నలకు వింతగా నవ్వి, "మనం సర్పకేతుడికి సహాయం చేయటానికి వెళ్ళటం లేదు. వీరపురాన్ని కొల్లగొట్టేందుకు అతను సహాయం చేస్తానన్నాడు. మనం అక్కడి నుంచి తెచ్చుకోగలిగినదంతా మనదే, అందులో అతనికిగాని, అతని సైనికులకుగాని పాలుండదు," అన్నారు.





అమాయకత్వం, దురాశా కరుడుకట్టిన యీ పల్లెవాసులతో తను ఏం మాట్లాడినా లాభంలేదని సుబాహుడు గ్రహించాడు. వాళ్ల దృష్టిలో తమను పాలించే సామంతులందరూ ఒకటే. వీలయినప్పుడల్లా యితరులు తమను దోచుకుంటున్నారు, అదే విధంగా అవకాశం చిక్కితే తామూ యితర్లను కొల్లగొడతారు—అదీ వాళ్ల మనస్తత్వం.

కొద్దిసేపటి తరవాత అందరూ రాకాసి దిబ్బప్రాంతానికి చేరారు. ఆ సరికే అక్కడ వందల సంఖ్యలో జనం చేరివున్నారు. వాళ్ళల్లో చాలామందిదగ్గిర వెలుగుతున్న పెద్దపెద్ద కాగడా లున్నవి. వాళ్లందరినీ కొందరు సైనికులు సొలుషలుగా నిలబెడుతున్నారు. సుబాహుడు వున్న ముఠాను కూడా ఒకచోట నిలబెట్టారు.

ఆ తరవాత దళనాయకుల దుస్తుల్లో వున్న కొందరు అశ్వికులు ముందుకు వచ్చి అక్కడ చేరిన జనాన్ని వుద్దేశించి యీ విధంగా చెప్పారు:

"మహాశక్తి సంపన్నుడూ, దయామయుడూ అయిన సర్పకేతరాజు సహాయం వల్ల మీరు యీనాటితో దారిద్ర్య బాధనుంచి విముక్తులవుతారు. ఇప్పటి సమస్య ఏమిటంటే, వీరపుర పట్టణంలో ఎలా ప్రవేశించటమా అనేది. పట్టణ ద్వారపాలకుల్ని మోసగించి, ఒకసారి ద్వారాలు తెరిచేలా చేశామంటే, ఆ తరవాత మనకు పట్టణంలో అడ్డు నిలబడగల శక్తి ఏమీ వుండదు. కనుక, మీలో ఒక వందమంది ముందుగా పట్టణ ద్వారాలను సమీపించి, హాహాకారాలు చేస్తూ, సర్పకేతరాజు సైనికులు మీ గ్రామాలమీద పడి దోచుకుంటూన్నట్టు ఆర్తనాదాలు చేయండి. ఆ కేకలకు కాపలావాళ్లు ద్వారాలు తెరుస్తారు. వెంటనే మీరు పక్కకు తొలిగి దారియిస్తే, పొరదుస్తుల్లో వున్న మా సైనికులు పట్టణంలో చొరబడతారు. వారి







వెనకగా ప్రవేశించి మీరు, మీ యిష్టంవచ్చి నట్టు నగరాన్ని కొల్లగొట్టవచ్చు. మీరు మాత్రం వీలయినప్పుడల్లా యశోవర్ధన మహా రాజుకూ, జై అంటూమాత్రం నినాదాలు చేస్తూవుండాలి. యశోవర్ధన మహారాజు పంపగా వచ్చినవారని భ్రమపడి, సూర్య వర్మ సైనికుల్లో కొందరైనా మిమ్మల్ని ఎదుర్కొనేందుకు భయపడతారు. మిగిలిన వాళ్లను పారదుస్తుల్లో వుండే మా సైనికులు హతమారుస్తారు. ఏ పరిస్థితుల్లోనూ మీరు సర్పకేతరాజు పేరు ఉచ్చరించరాదు."

దళనాయకుల మాటలు ముగిసేలోపలే జనంలోనుంచి 'యశోవర్ధన మహారాజుకూ, జై!' అన్న కేకలు వినిపించినై. వీరపురాన్ని ఆక్రమించుకోవటానికి యింత నిగూఢమైన కుట్ర జరుగుతున్నదని అర్థం కాగానే సుబా హుడు నిర్విణ్ణుడయాడు. తను వీళ్లనుండి విడివడి ముందుగా వీరపురం ప్రవేశించి చంద్రవర్మకు యీ మోసాన్ని గురించి తెలియపరచగలిగితే ప్రమాదం జరగకుండా ఆతణ్ణీ, నగరాన్నీ రక్షించవచ్చు. కాని, వీళ్ళందరి దృష్టినుంచి తప్పుకుని పారి పోవటం ఎలా?

సుబాహుడు యీ విధంగా ఆలోచిస్తు న్నంతలో జనం మహాప్రవాహంలా ముందుకు కదిలారు. వాళ్ళల్లో చాలామంది పార దుస్తుల్లో వున్న సర్పకేతుడి సైనికులని ఆతడు గుర్తించగలిగాడు. అందరికన్న ముందు పరుగులు తీస్తున్న ఓ వందమంది ప్రజలతో సుబాహుడు కలిశాడు. చూస్తూండ గానే వాళ్ళు పట్టణద్వారాలను సమీ పించారు. వెంటనే జనంలో కొందరు శోకి స్తున్నట్టుగా ఎలుగెత్తి, "అయ్యా, ద్వారాలు తెరవండి! సర్పకేతుడి సైనికులు మా గ్రామాలమీద పడి కనపడిందల్లా దోచు కుంటూ, ప్రజలను హింసిస్తున్నారు. మాకు వెంటనే సైనిక సహాయం కావాలి!" అని కేకలు పెట్టారు.





పట్టణద్వారాల వెనక వున్న కాపలా వాళ్ళు, ద్వారాలు తెరవటమా మానటమా అని సందేహించేలోపలే, జనంలోనుంచి మరి కొందరు భయకంపితులైన వాళ్ళలా, "అయ్యా, మాకు సూర్యవర్మరాజులంవారే దిక్కు! మా మొర వారికి చెప్పుకోనీయండి," అంటూ బిగ్గరగా అరిచారు.

ఆ వెంటనే ద్వారాలు తెరవబడినై. అప్పటివరకూ వాటిదగ్గిర వున్నవాళ్ళు పక్కలకు తప్పుకున్నారు. మరుక్షణంలో పౌర దుస్తుల్లో వున్న సర్పకేతుడి సైనికులు, అప్పటివరకూ దాచివుంచిన ఆయుధాలు బయటికి తీసి కాపలావాళ్ళమీద పడి, చూస్తూండగానే కొందరిని చంపి, మిగలా వారిని ఖైదీలుగా పట్టుకున్నారు. జనం రణగొణధ్వని చేస్తూ ఒక్కుమ్మడిగా ముందుకు కదిలారు.

సుబాహుడు ఒక్క గంతులో ద్వారం దాటి, పెనుగులాడుతున్న కాపలావాళ్ల పక్కనుంచి ముందుకు పరిగెత్తాడు. అదే సమయంలో వెనకనుంచి కేకలూ, చప్పట్లూ వినిపించినై. "ఎవడా పరిగెత్తేది? జనం అంతా కలిసికట్టుగా వెళ్ళాలి. వాణ్ణి పట్టుకోండి!"

మరుక్షణం నలుగురైదుగురు సర్పకేతుడి సైనికులు, "ఆగు, ఆగు!" అంటూ సుబాహుడి వెంటబడ్డారు. తను, చావో బతుకో తేల్చుకోవలసిన సమయం ఆసన్నమయిందని సుబాహుడు నిశ్చయించుకుని, చెంగున వెనుదిరిగి, సమీపిస్తున్న సైనికుణ్ణి ఎగిరి డొక్కలో బలంగా తన్ని, వాడు వెనక్కుపడిపోయేలోపల, వాడి చేత గల కత్తిని లాక్కున్నాడు. ఇంతలో మరొక సైనికుడు అతణ్ణి సమీపించాడు. సుబాహుడు తన కత్తితో వాణ్ణి బలంగా గుండెల్లో పొడిచి, మరికొందరు సైనికులు రావటం గమనించి, తక్కున వెనుదిరిగి రాజప్రాసాదంకేసి పరిగెత్తసాగాడు. —(ఇంకా వుంది)








## 4

[సుబాహుడు బిచ్చగాడులా నటించి సర్పకేతుడి సైనికుల బారిపడకుండా తప్పించుకున్నాడు. తరవాత అతను వీరపురం దేచుకో బయలుదేరినవారితో కలిసి వీరపురం చేరాడు. సర్పకేతుడి సైనికులు మాయోపాయం ప్రయోగించి, వీరపుర పట్టణ ద్వారాలు తెరుచుకుని, పట్టణంలో ప్రవేశించారు. రానున్న ప్రమాదాన్నిగురించి, తన యజమాని చంద్రవర్మతో చెప్పేందుకు, సుబాహుడు రాజప్రాసాదం కేసి పరిగెత్తసాగాడు. అది గమనించిన సర్పకేతుడి సైనికులు కొందరు అతడి వెంటబడ్డారు. తరవాత—]

సుబాహుడు తను తాత్కాలికంగా ప్రమాదాన్నుంచి బయటపడినా, తనను వెన్నాడి కొందరు సైనికులు వస్తున్నట్టు, వాళ్ల అడుగుల చప్పుడునుబట్టి గుర్తించాడు. ఆగి వెనుదిరిగి చూచేందుకైనా అవకాశం లేదు. తను, ఎంత త్వరగా పరిగెత్తి రాజప్రాసాదంలో దూరబడగలుగుతానా అన్నదానిమీదే అతడి మనస్సు కేంద్రీకరింపబడి వున్నది.

వెనక కేకలూ, చప్పట్లూ మరింత దగ్గిర అవుతున్నవి. అంతలో సుబాహుడు రాజప్రాసాదం ముందున్న జలయంత్రంచాటుగా ముందుకు పరిగెత్తి, ప్రాసాదద్వారం ముందు కాపలావున్న భటులను వుద్దేశించి, "నేను సుబాహుణ్ణి దారి యివ్వండి! నన్ను తరుముకువస్తున్నవాళ్లు సర్పకేతుడి సైనికులు. వాళ్లను అడ్డగించండి. మన భటులకందరికీ హెచ్చరిక యివ్వండి," అంటూ







కావలాభటులు దారి యివ్వగా చెంగున ప్రాసాదంలో ప్రవేశించాడు.

ఈలోపల కావలాభటులు కత్తులు దూసి, తమను సమీపిస్తున్న సర్పకేతుడి సైనికులను ఎదుర్కొన్నారు

సుబాహుడు, చంద్రవర్మ వుండే మేడ పై భాగానికి మెట్లమీదుగా పరిగెత్తుతూ ఎలుగెత్తి, "యువరాజా, ఘోరప్రమాదం! సర్పకేతుడి సైనికులు పట్టణంలో జొరబడ్డారు," అంటూ అరవసాగాడు.

సుబాహుడి కేకలకు, నిదురిస్తున్న చంద్రవర్మ వులిక్కిపడి లేచి హడావిడిగా పడకగదినుంచి బయటికి వచ్చాడు. ఆతడికి ప్రాసాదం ముందు గల రాజమార్గంమీద పెద్ద కలకలం వినబడింది. అతడు ఆశ్చర్యపడుతూ మిద్దెమీదికి పరిగెత్తి పిట్టగోడనానుకుని ఆ కలకలం వచ్చిన వైపుకు చూచేంతలో, సుబాహుడు రొప్పుతూ అక్కడికి వచ్చాడు.

"యువరాజా! సర్పకేతుడి సైనికులు మోసంచేసి పట్టణ ద్వారాలు తెరుచుకుని లోపల ప్రవేశించారు. మన భటులను హెచ్చరించండి. శత్రుసైనికులు చాలామంది ఈసరికే ప్రాసాద ప్రాంగణంలో ప్రవేశించి వుండవచ్చు," అన్నాడు.

చంద్రవర్మ ఒక్క త్రుటికాలం నిశ్చేష్టుడయ్యాడు. అంతలో రాజమార్గానికి యిరువైపులా వున్న గృహాలనుంచి పెద్ద పెద్ద మంటలు లేచినై. గుర్రాల సకిలింపులూ, సైనికుల కేకలూ, గృహస్థుల ఆర్తనాదాలూ చూస్తూండగానే మిన్నుముట్టినై.

చంద్రవర్మ, సుబాహుడికేసి తిరిగి, "మా తండ్రిగారెక్కడ? ఆయన వెంట నువు యశోవర్ధనమహారాజుగారివద్దకు వెళ్లావు గదా?" అని అడిగాడు.

సుబాహుడు ఆ ప్రశ్న వింటూనే వెలవెలపోయాడు. అతడు ఎంత ప్రయత్నించినా నోటమాట రాలేదు. ఇప్పటి విపత్కర పరి









స్థితుల్లో, సూర్యవర్మ దుర్మరణం సంగతి చెప్పటం ఏమీ మంచిది కాదని అతడికి మెరుపులా తోచింది. ముందు, ద్రోహబుద్ధితో పట్టణం ప్రవేశించిన సర్పకేతుడి అనుచరులను సర్వనాశనం చేయాలి. ఆ తరవాత అవకాశం కలగగానే అన్ని విషయాలూ సాకల్యంగా మాట్లాడుకోవచ్చును.

"యువరాజా! తమ తండ్రిగారు వీరపుర మార్గంలో వున్నారు. ప్రస్తుత కర్తవ్యం గురించి ఆలోచించండి. ఇప్పటికే సర్పకేతుడి సైనికులు పట్టణానికి నిప్పంటించుతున్నారు. ఏ నిమిషంలో అయినా, వాళ్లు రాజప్రాసాదం ప్రవేశించవచ్చును," అన్నాడు సుబాహుడు, వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

అంతలో మిద్దెపైకి వచ్చే మెట్లమీద కలకలం బయలుదేరింది. వాళ్లు శత్రు సైనికులు కావచ్చున్న అనుమానం కలిగింది సుబాహుడికి. అతడు ఒక్క గంతులో చంద్రవర్మ పడకగదిలో జొరబడి, అక్కడ గోడకు వేలాడుతున్న కత్తులు రెండు తీసుకుని, బయటికి వచ్చి వాటిల్లో ఒకదానిని చంద్రవర్మకు యిచ్చాడు.

మెట్లమీదినుంచి, "యువరాజా, యువరాజా!" అన్న కేకలు వినిపించినై. ఆ కంఠస్వరం గుర్తించిన చంద్రవర్మ, "ఎవరు? సేనానీ!" అంటూ బదులు కేకవేశాడు.

వీరపుర సేనాని ధీరమల్లుడు ఆ కేక వింటూనే సూటిగా చంద్రవర్మ వున్నచోటుకు పరిగెత్తుకు వచ్చాడు.

"యువరాజా! ప్రమాదం ముంచుకు వస్తున్నది. యశోవర్ధన మహారాజు మన మీద ఎందుకు కత్తికట్టారో, నాకు తెలియటం లేదు. ఆయన పంపగా వచ్చిన సైనికులు పట్టణంమీద పడి, కనబడిన గృహానికల్లా నిప్పుపెడుతూ, దోచుకుంటున్నారు. కొందరు పట్టణప్రజలుకూడా, ఆ సైనికులతో కలిశారు," అన్నాడు ధీరమల్లుడు.









యశోవర్ధన మహారాజు పంపగా వచ్చిన సైనికులన్నమాట వింటూనే చంద్రవర్మ నిలువెల్లా వణికి, "సేనానీ...." అని ఏమో చెప్పబోయేంతలో, సుబాహుడు అందుకుని, "యువరాజా! ఆ సైనికులు యశోవర్ధన మహారాజు పంపగా వచ్చినవాళ్లు కాదు. మన పట్టణంలో ప్రవేశించేందుకూ, తరవాత మనలను మోసగించేందుకూ సర్పకేతుడు పన్నిన కుయుక్తి అది. నేను మారువేషంలో వాళ్లతోపాటు పట్టణంలో ప్రవేశించాను. పౌరదుస్తుల్లో వుండి, సైనికులకు సహాయం చేస్తున్నవాళ్లు మన పట్టణవాసులు కారు, వాళ్లంతా సంస్థాన ఎల్లల్లో వుండే పల్లెవాసులు. డబ్బుదొరుకుతుందని ఆశ చూపి, యిక్కడికితెచ్చారు," అన్నారు.

ఈ జవాబు వింటూనే సేనాని ధీరమల్లుడు నిశ్చేష్టుడయాడు. తరవాత అతడు చంద్రవర్మకేసి తిరిగి, "సుబాహుడు చెప్పేదే నిజంలా తోస్తున్నది. సర్పకేతుడు యిలాంటి కుటిల పద్ధతులు అవలంబించటంలో అందెవేసిన చేయి. మాహిష్మతీనగరం వెళ్లిన మహారాజులకుకూడా అతడివల్ల ఏదైనా అపాయం కలగవచ్చు," అన్నాడు ధీరమల్లుడు.

"ముందు మనం చిక్కుకున్న అపాయం సంగతి ఆలోచించండి, సేనానీ! మన భటులనందరినీ సమాయత్తపరిచి శత్రువులను పట్టణంనుంచి బయటికి తరిమే మార్గం ఏదో యోచించండి," అంటూ సుబాహుడు చంద్రవర్మకేసి చూశాడు.

చంద్రవర్మ, సుబాహుడు చెప్పినదానికి అవునన్నట్టుగా తల వూపి, "సేనానీ, రాజప్రాసాదరక్షణ సంగతేమిటి? దీని రక్షణకు ఎలాంటి ఏర్పాటులు చేశావు?" అని అడిగాడు ఆదుర్దాగా.

"యశోవర్ధన మహారాజునూ, జై అంటూ కొందరు సాయుధులు కావలివాళ్లను తప్పుకుని భవనప్రాంగణంలో ప్రవేశించారు.









కాని, ఆ వెంటనే మన భటులు వాళ్లను ఎదుర్కొని హతమార్చటం జరిగింది. ఆ వచ్చినవాళ్లు సర్పకేతుడి సైనికులని మన వాళ్లకు ముందుగానే సుబాహుడు హెచ్చరిక యివ్వటం చాలా లాభించింది," అన్నాడు ధీరమల్లుడు.

"అయితే, మన భటులనందరినీ ఆయత్తపరుచు. కొద్దిమంది భటులను యిక్కడ కాపలావుంచితే సరిపోతుంది. తక్కినవారితో పట్టణం ప్రవేశించి, ఆ సర్పకేతుడి సైనికులను వేటాడదాం," అన్నాడు చంద్రవర్మ.

"భటులందరూ ఆయత్తపరచబడ్డారు, యువరాజా! యశోవర్ధన మహారాజు పేర కొట్టే బేరీలు నన్ను కలవరపరిచినై. అందుకే మీదగ్గిరకు వచ్చాను," అన్నాడు ధీరమల్లుడు.

ఆ సరికి పట్టణంలో అనేకచోట్ల పెద్ద పెద్ద మంటలు లేచినై. ఒక్క రాజమార్గం వైపునుంచే కాక, అన్ని వైపులనుంచి కేకలూ, ఆర్తనాదాలు వినబడుతున్నవి. చంద్రవర్మ మిద్దెపైనుంచి కాలిపోతున్న పట్టణంకేసి ఓసారి సాలోచనగా చూసి పెద్దగా నిట్టూరుస్తూ, మెట్లు దిగి భవనంముందుకు వచ్చేశాడు. అక్కడ ఆయుధధారులైన భటులు— నాలుగైదు వందలమంది సోలుపులుగా నిలబడి వున్నారు. వారి పక్కనే అశ్వారూఢులైన కొందరు రౌతులు పెద్దపెద్ద యీటెలు చేబూని సర్వసన్నద్ధంగా వున్నారు.

చంద్రవర్మ ఓ యాభైమంది భటులనూ, పదిమంది అశ్వికులనూ రాజప్రాసాదరక్షణకు నియోగించి, మిగతావారిని రెండు సమభాగాలుగా విభజించి, ఒక భాగాన్ని సేనాని ధీరమల్లుడికి ఒప్పచెపుతూ, "సేనానీ, నేను కోటద్వారాలు దాటి రాజమార్గం మీదికి వెళ్ళగానే తూర్పుదిక్కుకు తిరుగుతాను. నువ్వు నీ భటులతో పడమటి దిక్కుకు వెళ్ళటం మంచిది. ఇద్దరం ఆ







విధంగా శత్రుసైన్యాన్ని ఛేదించుకుంటూ, అర్ధచంద్రాకారంగా తిరిగి. ఉత్తరద్వారాన్ని చేరుకుందాం. ఒకవేళ...దైవనిర్ణయం మరోవిధంగా వుంటే, అప్పటి పరిస్థితులకు అనుగుణంగా వుండే నిర్ణయాలు ఎప్పటికి వారంగా చేసుకోవటం తప్ప మరోమార్గం లేదు," అన్నాడు.

"చిత్తం, యువరాజా! మీరుమాత్రం అనవసర ప్రమాదాలకు లోనుకాకండి. ఈ చీకటిమాటున శత్రువుల బలం తెలియటంలేదు," అన్నాడు ధీరమల్లుడు.

ఆ వెంటనే రెండుసైన్య విభాగాలూ, 'సూర్యవర్మమహారాజుకూ, జై!' అంటూ



ప్రాసాదప్రాంగణం దాటి పట్టణంలోకి ప్రవేశించినై అప్పటికి తూర్పుదిక్కు తెలతెలవారుతున్నది. సాయుధుడై గుర్రంమీద వున్న సుబాహుడు, చంద్రవర్మకు ఆ దాపులనే తగలబడుతున్న గృహాలను చూపిస్తూ, "యువరాజా! సర్పకేతుడు తన కుటిల యత్నంలో కొంతవరకు విజయం సాధించాడు. అతడి పక్షాన పట్టణంలో ప్రవేశించినవారిలో సుశిక్షితులైన సైనికులు బహు కొద్దిమంది, ఎక్కువ భాగం దోపిడీ కోసం వచ్చిన పల్లెవాసులు. మనం నిర్దయగా వాళ్ళల్లో కొందరినైనా హతమార్చగలిగితే, తతిమ్మావాళ్ళు ప్రాణాలు అరచేతబట్టుకుని నగరం వదిలి పారిపోతారు. అలా చేద్దామంటారా?" అన్నాడు.

చంద్రవర్మకు యీ ఆలోచన బాగానే వున్నట్టు తోచింది. అతడు తన వెంటవున్న అశ్వికులను హెచ్చరించి, పెద్దగా జైజై నినాదాలు చేస్తూ, కాగడాలు పట్టుకుని యిటూ అటూ పరిగెత్తుతున్న దోపిడీదారుల మీదికి వురికాడు. మరుక్షణంలో అశ్వికుల చేత గల ఈటెలు దోపిడీవార్ల వెన్నుల్లోనూ, గుండెల్లోనూ బలంగా గుచ్చుకున్నై. ఆ వెంటనే, 'సూర్యవర్మ సైనికులు, సూర్యవర్మ సైనికులు!' అంటూ ఆ ప్రాంతమంతా








గగ్గోలు బయలుదేరింది. మరుక్షణమే రాజ
మార్గంప్రక్కల అటూయిటూ వున్న సందు
గొందులనుంచి, 'సూర్యవర్మ సైనికులా?
ఎక్కడ? ఎక్కడ?' అన్న కేకలతోపాటు
పరిగెత్తివస్తున్న గుర్రాల గిట్టల చప్పుడు
కూడా వినబడింది.

శత్రుసైనికులను హతమార్చేందుకు
చంద్రవర్మకు అది మంచి అదనుగా కన
బడింది. అతడు తన భటులలో సగం
మందిని, శత్రుసైనికులు వస్తున్న గొందికి
అటువైపుగా నిలబెట్టి, తక్కిన సగంమందితో
రెండవవైపున నిలబడ్డాడు. రాజమార్గం
చేరేందుకు ముందువెనుకలు చూడకుండా
వస్తున్న శత్రు అశ్వికులను, వచ్చినవారిని
వచ్చినట్టు యిరువైపులనుంచీ ఎదుర్కొని
తెగటార్చాలని చంద్రవర్మ వ్యూహం.

అతడి వ్యూహం పారింది. మితిమీరిన
విజయోత్సాహంలో సర్పకేతుడి సైనికులు
రాజమార్గంమీద ఏమున్నదో చూసుకో
కుండా, గొందిలోనుంచి వేగంగా రాజ
మార్గం చేరేందుకు ప్రయత్నించారు. ఇరు
వైపులా సర్వసన్నద్ధంగా వున్న చంద్రవర్మ
భటులు వచ్చినవారిని వచ్చినట్టు తమ
ఈటెలతో పొడవసాగారు. అక్కడ జరుగు
తున్న భీభత్సాన్ని గుర్తించి, వెనుదిరిగి



పారిపోయే లోపలే, శత్రువులలో ఎక్కువ
భాగం చంద్రవర్మ భటులచేత నిర్దయగా
హతమార్చబడ్డారు.

ఈ విజయంతో చంద్రవర్మ భటులలో
ఎక్కడలేని ఆత్మవిశ్వాసం కలిగింది. వాళ్లు
ఒక్కుమ్మడిగా, 'సూర్యవర్మ మహ
రాజుకూ, జై' అంటూ రాజమార్గంమీద
కనబడిన ప్రతి శత్రుసైనికుణ్ణీ, బంది
పోటునూ వెంటాడి తమ ఈటెలతో, కత్తు
లతో పొడవసాగారు. పట్టణప్రజలుకూడా,
తమ యువరాజు భటులతో రావటం
గుర్తించి, దొరికిన ఆయుధమల్లా చేబూని,
శత్రువులమీద విరుచుకుపడ్డారు.









కొద్దిసేపట్లో చంద్రవర్మ ఎదురుపడిన శత్రువులనెల్లా హతమారుస్తూ ఉత్తరద్వారం సమీపించాడు. పడమటివైపుగా శత్రు సంహారానికి బయలుదేరిన సేనాని ధీరమల్లుడు కూడా అల్లంత దూరంలో కనిపించాడు. కానీ, అతని వెనకభాగాన పెద్ద అశ్విక దళం ఒకటి కదులుతూండటం చంద్రవర్మ కంటబడింది.

చూస్తూండగానే ధీరమల్లుడు తన అశ్వికులతో చంద్రవర్మను సమీపించి, "యువరాజా! మనం వెంటనే రాజప్రాసాదదుర్గం చేరటం మంచిది. సర్పకేతుడు స్వయంగా మరికొంత సైన్యంతో పట్టణం ప్రవేశించాడు. అసంఖ్యాకులైన ఆ శత్రుసైనికులతో స్వల్ప సంఖ్యలో వున్న మనం ముఖాముఖిని తలపడటం ఆత్మహత్యతో సమానమవుతుంది! దుర్గరక్షణల ఆసరాతో పోరాడదాం. ఈ లోపల సరిహద్దులలోవున్న మనసైన్యం సహాయంరావచ్చు," అన్నాడు.

సర్పకేతుడు మరికొంత సైన్యంతో పట్టణం ప్రవేశించాడనే వార్త చంద్రవర్మకు పిడుగుపాటులా తోచింది. దీని అర్థం, అతడు మాయోపాయాన్ని పరిత్యజించి, ప్రత్యక్షంగా దండోపాయానికి పూనుకున్నాడన్నమాట!

చంద్రవర్మ తన అశ్వాన్ని గిరుక్కున వెనక్కు తిప్పాడు. సుబాహుడూ, ధీరమల్లుడూ, తమ తమ గుర్రాలను అతడికి యిరువైపులా నడిపారు. భటులు వెంటరాగా అందరూ అతివేగంగా ప్రాసాదంకేసి బయలుదేరారు. దారిలో ఎక్కడా వారిని శత్రువులు ఎదుర్కోలేదు. కాని, వారందరూ ప్రాసాద ప్రాంతాన్ని సమీపించేసరికి, దాని ముఖద్వారంముందు శత్రుపదాతి సైనికులూ, అశ్వికులూ కనిపించారు. వాళ్లందరూ ద్వారాలను బద్దలుకొట్టేందుకు ప్రయత్నిస్తున్నారు. అదిచూచి చంద్రవర్మ భీకరంగా గర్జిస్తూ తన భటులతో ఒక్కుమ్మడిగా వాళ్లమీద విరుచుకుపడ్డాడు. —(ఇంకా వుంది)





# కంచుకోట

## 5

[తనను వెంటతరుముతున్న శత్రుసైనికులనుంచి తప్పించుకుని సుబాహుడు, రాజ ప్రాసాదం చేరి చంద్రవర్మతో శత్రువులు మాయోపాయం చేసి పట్టణంలో ప్రవేశించిన సంగతి చెప్పాడు. తరవాత చంద్రవర్మ తన సేనాని వీరమల్లుడితో కలిసి పట్టణంలో చొర బడి చాలామంది శత్రువులను హతమార్చాడు. కాని, యింతలో సర్పకేతుడు కొత్త సైన్యంతో వచ్చిన వార్త తెలిసింది. చంద్రవర్మ తన భటులనందరినీ వెంటబెట్టుకుని ప్రాసాద దుర్గరక్షణకు వెళ్లాడు. అప్పటికే శత్రువులు దాన్ని చుట్టుముట్టి తలుపులు బద్దలు కొడుతున్నారు. చంద్రవర్మ తన సైనికులతో హఠాత్తుగా వాళ్లను ఎదుర్కొన్నారు. తరవాత—]

చంద్రవర్మ భటులకూ, సర్పకేతుడి సైనికులకూ దుర్గముఖద్వారంవద్ద భీషణ పోరాటం జరిగింది. సంఖ్యలో నాలుగైదింతలున్న సర్పకేతుడి సైనికులు ప్రారంభంలో చంద్రవర్మ భటుల ధాటికి తట్టుకోలేక కొంత వెనుకకు తగ్గారు. కాని, కొద్దిసేపటిలోనే, వాళ్లకు చంద్రవర్మ భటులు స్వల్పసంఖ్యాకులని తెలిసి, ధైర్యం తెచ్చుకుని తెగించి పోరాడసాగారు.

ఈ విధంగా కొంతసేపు సంకుల సమరం సాగింది. తను ఎంత ప్రయత్నించినా దుర్గ ద్వారాలను చేరుకోలేకపోవటంతో చంద్రవర్మ ఏమి చేయటమా అని ఆలోచించేంతలో, దూరంగా మరొక అశ్వికదళం వస్తున్న









సూచనగా పెద్ద ధ్వని వినబడింది. ఆ వెంటనే సుబాహుడు తన గుర్రాన్ని చంద్రవర్మ పక్కకు నడిపి, "యువరాజా! మనం పెద్ద చిక్కులో పడబోతున్నాం. మనను వెనుకనుంచి ఎదుర్కొనేందుకు సర్పకేతుడు కొత్త అశ్వికులను రంగంలోకి దింపుతున్నాడు," అన్నాడు.

అప్పటి పరిస్థితుల్లో తను దుర్గంలోకి దొరబడగలగటం సాధ్యమయే పని కాదని నిర్ణయించుకున్నాడు చంద్రవర్మ. రెండు శత్రుసైన్యాలమధ్య చిక్కుకుపోకుండా బయటపడటమే తక్షణ కర్తవ్యంగా అతడికి తోచింది. సేనాని ధీరమల్లుడుకూడా రానున్న విషమపరిస్థితిని అర్థం చేసుకున్నాడు. సైనికులు చేసే రణగొణధ్వనిలో అతడు పెద్దగా ఎలుగెత్తి, "యువరాజా! మీరు యిక్కడ్నుంచి త్వరగా బయటపడటం మంచిది. నేను, నా భటులతో మీకు మార్గం కల్పిస్తాను," అన్నాడు.

చంద్రవర్మకు ఆలోచించేందుకు కూడా వ్యవధి లేదు. శత్రువుల అశ్వికదళం వెనుకనుంచి త్వరత్వరగా చేరువ అవుతున్నది. అతడు గుర్రాన్ని దుర్గద్వారాలనుంచి వెనుకకు తిప్పుతూ, "సుబాహూ!" అని పెద్దగా కేకవేసి తన కత్తితో శత్రుసైనికుల మధ్యగా దారి నరుక్కుంటూ తిరోగమించసాగాడు. సుబాహుడుకూడా తన యజమాని వెనకనే తన గుర్రాన్ని పరిగెత్తించాడు.

చంద్రవర్మ, సుబాహుడూ శత్రుసైనికుల మధ్యనుంచి బయటపడి పారిపోతున్నంతలో, అది గ్రహించిన శత్రుఅశ్వికులు కొందరు వాళ్లను వెంబడించేందుకు ప్రయత్నించారు. కాని, సేనాని ధీరమల్లుడు వారి మార్గాన్ని అటకాయించాడు. యీ అదనులో చంద్రవర్మ, సుబాహుడూ యుద్ధరంగానికి దూరంగా పారిపోసాగారు.

వాళ్లిద్దరూ ఆ విధంగా కొంతదూరం రాజమార్గంవెంట వెళ్ళి, తరవాత తమ గుర్రా











లను నగరదక్షిణద్వారంకేసి తిప్పారు. నగరంలోనుంచి బయటపడాలంటే, బహుశా తమకు ఆ దక్షిణద్వారం ఒక్కటే శరణ్యమని చంద్రవర్మ నిశ్చయించుకున్నాడు. తక్కిన ద్వారాలన్నీ శత్రువుల అధీనంలో వున్నట్టు అతడికి తెలుసు.

చంద్రవర్మా, సుబాహుడూ దక్షిణద్వారం అల్లంత దూరంలో వున్నదనగా తమ గుర్రాలను ఆపి, ద్వారందగ్గిర శత్రుసైనికులకోసం పరీక్షించి చూశారు. అక్కడ పెద్ద శత్రుసైన్యం వున్న సూచనలు లేవు. కొందరు జనులు ఆ ద్వారంవెంట బయటికి పోతున్నారు. అయిదారుగురు శత్రుసైనికులు ద్వారానికి ఒక పక్కగా నిలబడి సంభాషించుకుంటున్నారు. వారి గుర్రాలు అంత దూరంలో మేకులను కట్టివేయబడి వున్నవి.

"యువరాజా! సేనాని ధీరమల్లుడు యింకా శత్రుసైనికులను మనను వెంబడించకుండా నిలువరిస్తూ వుండాలి. అయినా, అతడికి సహాయంగా వున్న కొద్దిమంది భటులతో అతడు యింకెంతో సేపు శత్రువులు మనను వెంబడించకుండా ఆపలేడు. కనుక, మనం త్వరగా నగరంనుంచి బయటపడటం మంచిది. ఒక్క దూకున ద్వారం దాటి పోదాం," అన్నాడు.

చంద్రవర్మ అవునన్నట్టు తలవూపి, గుర్రాన్ని గట్టిగా అదిలించాడు. అదే సమయంలో ద్వారంవద్ద మంతనాలాడుతున్న శత్రుసైనికుల దృష్టి వాళ్లమీదికి ప్రసరించింది. వాళ్లు ఉలిక్కిపడి అంతలోనే ఒరనుంచి కత్తులు దూసి, "హేయ్," అంటూ తమ గుర్రాలకేసి పరిగెత్తబోయారు.

"సుబాహూ! మనం వెంటనే ద్వారం దాటి పోవాలి. గుర్రాన్ని ఆపకుండా పరిగెత్తిస్తూనే, నీ కత్తివేటుకు దొరికేమాత్రం యీ శత్రుసైనికులను తెగటార్చు," అంటూ చంద్రవర్మ తన గుర్రాన్ని ద్వారంకేసి పురికించాడు.







శత్రుసైనికులలో ముగ్గురు యీలోపల తమ గుర్రాలను చేరి, వాటిని మేకులనుంచి విప్పుతున్నారు. ఇరువురు సైనికులుమాత్రం దారికి అడ్డుగా నిలబడి. "ఆగండి! ప్రాణాలు దక్కవు," అంటూ కత్తులు దూశారు.

"ప్రాణాలు దక్కనిది ఎవరికి?" అంటూనే సుబాహుడు వేగంగా పరిగెత్తుతున్న తన గుర్రంమీదినుంచి ఒక పక్కకు ఒరిగి కత్తితో ఒక సైనికుడి తలను మొండెంనుంచి వేరుచేశాడు. రెండవ సైనికుడిపై చంద్రవర్మ కత్తి విసిరేంతలో ఆ సైనికుడు ప్రమాదాన్ని గ్రహించి చటుక్కున భూమిమీదికి బోర్లా పడిపోయాడు.



ఈలోపల శత్రుసైనికులు తమ గుర్రాలను ఎక్కి, చంద్రవర్మ, సుబాహులవెంట బడ్డారు. చంద్రవర్మ వెనుదిరిగి చూడకుండా ద్వారాన్నుంచి తన గుర్రాన్ని వేగంగా బయటికి దూకించి సూటిగా వున్న బాటవెంట పరిగెత్తించసాగాడు.

ముందు చంద్రవర్మ, కొంచెం వెనకగా సుబాహుడూ తమ గుర్రాలను మహావేగంగా పరిగెత్తిస్తున్నారు. వారికి కొంచెం దూరంలో నలుగురు శత్రుఅశ్వికులు రణగొణధ్వని చేస్తూ వస్తున్నారు.

"యువరాజా! మనం ఆగి, యీ శత్రువుల అంతు తేల్చుకోవటం మంచిదేమో! వీళ్లు మనను వదిలేలా లేరు," అన్నాడు సుబాహుడు.

"మనం ఆగటం మహా ప్రమాదం. యీపాటికి మనం నగరంనుంచి పారిపోయిన సంగతి సర్పకేతుడివరకూ వెళ్ళి వుంటుంది. అతడు తప్పక మనను వేటాడేందుకు పెద్ద బలగంతో బయలుదేరుతాడు. ఈ శత్రుసైనికులను యింకా వెంబడించనీ, ఆ కనబడే కొండ సానువులు చేరగానే, వాళ్ల పని పట్టువాం," అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ మాట ముగించీ ముగించక ముందే రివ్వుమంటూ ఒకబాణం అతడి










కుడిభుజాన్ని రాసుకుంటూ పోయి, బాటకు ఒకపక్కగా భూమిలో గుచ్చుకుపోయింది. "సుబాహూ!" అంటూ చంద్రవర్మ పెద్దగా అరిచి గుర్రంమీద ముందుకు వాలి దాని మెడమీదుగా కరుచుకు పడుకున్నాడు.

"ఇప్పటివరకూ నేను బతికే వున్నాను, యువరాజా!" అంటూ సుబాహుడుకూడా గుర్రం జూలుమీదికి వంగి తల వెనక్కు తిప్పి చూశాడు. శత్రు అశ్వికులలో ఒకడు విల్లంబు రెండుచేతులతో పట్టుకుని గురి చూస్తున్నాడు. గుర్రం కళ్లెపుతాళ్లను అతడు పళ్లమధ్య గట్టిగా బిగించిపట్టుకున్నాడు. యీ దృశ్యం సుబాహుడికి ఆశ్చర్యాన్ని, భయాన్నీ కూడా కలిగించింది. కాని, అతడు చంద్రవర్మకు యీ సంగతి చెప్పబోయేంతలో ఆ అశ్వికుడి గుర్రం కాలు బాటలో వున్న ఒక రాతిముక్కకు తగిలి ఒక్క త్రుటికాలం అది ఒక పక్కకు ఒరిగింది. అదే క్షణంలో వెనుక వేగంగా వస్తున్న గుర్రాలలో ఒకటి దాన్ని బలంగా తాకింది. బాణం విల్లూ పట్టివున్న సైనికుడు ఆ తాకిడికి గుర్రంమీది నుంచి నాలుగైదడుగుల ఎత్తున గాలిలోకి లేచి పెద్దగా అరుస్తూ కింద పడిపోయాడు. అతణ్ణి నలగతొక్కుకుంటూ తక్కిన గుర్రాలు ముందుకు దూకినై.

సుబాహుడు ఆనందంతో ఎగిరి గుర్రం మీద నిదానంగా కూర్చున్నాడు. ఈ దెబ్బతో తక్కిన అశ్వికులు తమను వెంట తరమటం మాని, తమతోటి వాడికి సహాయం చేసేందుకు ఆగుతారని అతడు అనుకున్నాడు. కాని, అతడి ఆశ నిరాశ అయింది. శత్రు అశ్వికులు తమవాడికోసం వెనుదిరిగైనా చూడకుండా గుర్రాలను వేగంగా పరిగెత్తిస్తున్నారు. కాని, వాళ్ళల్లో విల్లంబులు పట్టినవాడెవడూ లేడన్న సంగతి సుబాహుడికి ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది.

"యువరాజా! శత్రుఅశ్వికుల్లో బాణాలు వదిలేవాడు, వాడి అనుచరుల గుర్రం గిట్టల











కింద నలిగి చచ్చారు. ఇప్పుడు మనను వెంబడించి వస్తున్నవాళ్ళు ముగ్గురు. వాళ్ల దగ్గిర వున్న ఆయుధాలు కత్తులుమాత్రమే. ఆగి, వాళ్ళను యమపురికి పంపుదామా?" అన్నాడు సుబాహుడు.

చంద్రవర్మ వెనుదిరిగి చూశాడు. శత్రు అశ్వికులు ముగ్గురు. వాళ్ళను తుదముట్టించటం ఏమంత కష్టం కాదు. కాని, యీలోపల మరికొందరు శత్రువులు అక్కడికి రావటం జరిగితే తమ పరిస్థితి ప్రమాదకరంగా పరిణమిస్తుంది. అతడు యీ విధంగా ఆలోచిస్తూ, తన గుర్రం వేగాన్ని తగ్గించి, బాటకు ఒక పక్కగా దాన్ని నిలిపాడు. ఇంతలో సుబాహుడుకూడా అక్కడికి వచ్చి తన గుర్రాన్నికూడా నిలువరించాడు. ఆ వెంటనే శత్రుఅశ్వికులు గుర్రాలను ఆపి, చంద్రవర్మా, సుబాహుల కేసి చూస్తూ ఏదో మాట్లాడుకోసాగారు.

"యువరాజా! ఈ దుర్మార్గులు మనతో కలియబడటానికి భయపడుతున్నట్టున్నది. వాళ్ళు ధైర్యంచేసి యిక ముందుకు రారు. మనమే వెళ్ళి వాళ్ల పని పట్టిద్దాం?" అన్నాడు సుబాహుడు.

చంద్రవర్మ శత్రుఅశ్వికులకేసి ఓ క్షణకాలం చూసి, "సరే, సుబాహూ! మనం వీళ్ళను త్వరగా పరలోకయాత్రకు ప్రయాణం కట్టించాలి. ఆలస్యం అయితే, మరికొందరు శత్రువులు యిక్కడికి రావొచ్చు," అంటూ గుర్రాన్ని శత్రుఅశ్వికులకేసి నడపసాగాడు.

చంద్రవర్మా, సుబాహుడూ తమకేసి రావటం చూస్తూనే, శత్రుఅశ్వికులు ముగ్గురూ తమ గుర్రాలను గిరుక్కున వెనక్కు తిప్పి, నగరంకేసి పోనివ్వసాగారు. చంద్రవర్మ తన గుర్రాన్ని డొక్కల్లో గట్టిగా పొడిచి వేగంగా ముందుకు దూకించాడు. కాని, శత్రుఅశ్వికులుకూడా తమ గుర్రాలను గట్టిగా అదిలించి పారిపోసాగారు.











శత్రువులను తరుముకుంటూ చంద్రవర్మా, సుబాహుడూ దాదాపు ఒక కోసెడు దూరం నగరంకేసి వెళ్ళారు. హఠాత్తుగా వారికి నగరంవైపునుంచి వస్తున్న కొందరు రౌతులు కనిపించారు. చంద్రవర్మ వాళ్లను చూస్తూనే తన గుర్రాన్ని ఆపి వెనక్కు తిప్పుతూ, "సుబాహూ! శత్రువుల ఎత్తుగడ అర్థమైందిగదా? ఇక మనం పారిపోవటమే వుత్తమం. మనం, యీ ముగ్గురినీ అందుకునే లోపల ఆ శత్రుపటాలం అంతా వచ్చి మనను చుట్టుముట్టుతుంది," అన్నాడు.

చంద్రవర్మా, సుబాహులు తమ గుర్రాలను వెనక్కు తిప్పి పరిగెత్తించే లోపల శత్రుఅశ్వికులు ముగ్గురుకూడా తమతమ గుర్రాలను మళ్ళించి వాళ్ల వెంట పడ్డారు. క్రమక్రమంగా శత్రుఅశ్వికులకూ, చంద్రవర్మ సుబాహులకూ మధ్య వున్న దూరం తగ్గుతున్నది.

"యువరాజా, మనం యీసారి నిజంగా ప్రమాదంలో చిక్కుకున్నాం," అన్నాడు సుబాహుడు పెద్దగా ఆయాసపడుతూ.

చంద్రవర్మ జవాబివ్వలేదు. తనను అనుసరించి రమ్మన్న సూచనగా అతడు సుబాహుడికేసి చేయిమాత్రం వూపాడు. పారిపోతున్నవాళ్లూ, తరుముకువస్తున్న వాళ్లూకూడా తాము ఎలాంటి మార్గాన వస్తున్నదీ గమనించటం లేదు. చూస్తూ వుండగానే వాళ్ళు బాటకు యిరువైపులా వున్న పొదలూ, గుట్టలూ దాటి ఒక కొండ దారిన బడ్డారు.

చంద్రవర్మా, సుబాహుడూ ఎక్కిన గుర్రాలు బాగా డస్సిపోయినై. అవి యింకెంతసేపో తమను మోయలేవని చంద్రవర్మ గ్రహించాడు. అతడి దృష్టి శత్రుఅశ్వికులకేసి మళ్లింది. వాళ్ళు ఎక్కిన గుర్రాలుకూడా రొప్పుతూ, నోటివెంట నురుగులు కక్కుతున్నవి. అతడి దృష్టి కొండకు దిగువగా ప్రసరించింది. దాదాపు బాణం









వేటు దూరంలో పదీ పన్నెండుమంది శత్రు అశ్వికులు తమకేసే వస్తున్నారు.

"సుబాహూ, యిక మనం ఈ గుర్రాలను నమ్ముకుని లాభంలేదు. అవి ఏ క్షణానయినా ప్రాణాలు వదలవచ్చు. మనం పాదచారులుగా పారిపోవటమే మంచిది," అంటూ చంద్రవర్మ గుర్రంమీదినుంచి దిగాడు. అతడి వెంటనే సుబాహుడుకూడా గుర్రం దిగాడు. అదే క్షణంలో శత్రుసైనికులు పెద్దగా కేకలుపెడుతూ తమ తమ గుర్రాలనుంచి దిగి, చంద్రవర్మా సుబాహుల కేసి పరిగెత్తి రాసాగారు.

చంద్రవర్మ తనచుట్టూ ఒకసారి కలయ చూచి, కొండమీద ఏటవాలుగా వున్న ఒక ప్రదేశంకేసి పరిగెత్తి, అక్కడ వున్న రాళ్లనూ, చిన్న చిన్న అడవిమొక్కలనూ పట్టుకుంటూ కిందికి దిగసాగాడు. సుబాహుడుకూడా అతణ్ణి అనుసరించాడు. యిద్దరూ కలిసి అగాధంగా వున్న దిగువప్రాంతంకేసి జాగ్రత్తగా పోతున్నంతలో, ఏటవాలుగా వున్న ప్రదేశంమీదికి పదీ పన్నెండుమంది శత్రుసైనికులు వచ్చారు.

వాళ్లల్లో ఒకడు పెద్దగా గొంతెత్తి, "మనం వాళ్ళను అనుసరించి పోవటం ప్రమాదకరం. పట్టు తప్పితే కింద అగాధంలో వున్న నదిలో పడిపోతాం. యిక్కడే వుండి వాళ్ళమీదకు రాళ్ళు దొర్లించండి," అని అరిచాడు. ఆ వెంటనే పెద్ద పెద్ద బండరాళ్ళు చంద్రవర్మా సుబాహులకేసి దొర్లిరాసాగినై.

ఆసరికి చంద్రవర్మా, సుబాహుడూ అగాధం అంచుకు చేరారు. చంద్రవర్మ ఒక్కసారి పైనున్న శత్రుసైనికులకేసి చూసి, "సుబాహూ, యిక మనకు మార్గాంతరం లేదు. నీకు యీత వచ్చును గదా...." అంటూ అగాధం అంచున పొంగులువారుతూ పారుతున్న నదిలోకి చెంగున దూకాడు. —(ఇంకా వుంది)








## 6

[సర్పకేతుడు మరికొంత కొత్తసైన్యంతో నగరం ప్రవేశించటంవల్ల, చంద్రవర్మ వ్యూహం విఫలమయింది. అతడూ, సుబాహుడూ గుర్రాలమీద నగరం వదిలి కొండలకేసి పారిపోసాగారు. కొండలలో శత్రువులు వారిద్దరిని చుట్టుముట్టారు. చేసేది లేక చంద్రవర్మా, సుబాహుడూ కొండదిగువను ప్రవహిస్తున్న ఒక నదిలోకి దుమికారు. తరవాత—]

చంద్రవర్మ నదీప్రవాహంలో ఈదేందుకు ప్రయత్నించాడు. కాని, ప్రవాహవేగం అతణ్ణి అటూ యిటూ విసిరికొట్టసాగింది. కొండ అంచున వున్న శత్రుసైనికులు గోలగా మాట్లాడుకోవటం అతడికి వినిపిస్తూనేవుంది. సుబాహుడుకూడా తనతోపాటు నదిలోకి దూకాడా? లేక శత్రువుల చేత చిక్కాడా?

చంద్రవర్మ యిలాంటి ఆలోచనలతో సతమతమవుతూ, నదీజలంలో వేగంగా కొట్టుకుపోసాగాడు. ఈదటానికి అతడు చేసిన ప్రయత్నం ఫలించలేదు. కొద్దిసేపటిలోనే అతడు ఆయాసంతో సొమ్మసిల్లిపోయాడు. ఇక నాకు చావు తప్పదు, అనుకుంటూ అతడు కడసారిగా మునిగిపోకుండా వుండేందుకు గట్టిప్రయత్నం చేసి నిస్పృహతో కళ్లు మూసుకున్నాడు.

చంద్రవర్మ తిరిగి కళ్లు తెరిచేసరికి సూర్యుడు ఆకాశమధ్యంలో వున్నాడు. చుట్టూ చిత్తవెత్తుగా పెరిగిన చెట్లతో భయంకరంగా వున్న అడవి. తను ఒకానొక నీటి








మడుగు ఒడ్డున పడివున్నట్టు అతడు గ్రహించాడు. తను అదృష్టవశాత్తూ నదీజలంలో మునిగిపోకుండా, దాని పాయలలో ఒక దానివెంట కొట్టుకువచ్చి యిక్కడికి చేరినట్టు అతడు తెలుసుకున్నాడు. ఆ వెంటనే అతడికి సుబాహుడు గుర్తుకువచ్చాడు. చంద్రవర్మ లేచి కూర్చుని అతడికోసం చుట్టూ కలయచూశాడు. అతడి జాడ లేదు.

కొద్దిసేపటికల్లా చంద్రవర్మను ఆకలి దహించసాగింది. అతడు నీటిమడుగు దగ్గిర నుంచి కదిలి, అల్లంత దూరంలో వున్న చెట్లను సమీపించాడు. ఆ చెట్లలో కొన్ని ఫలభారంతో భూమికి వంగి వున్నవి. ఆకలిగొనివున్న చంద్రవర్మ చేతికి అందిన పండ్లను కోసుకుని ఆత్రంగా తిన్నాడు. ఆ క్షణంలో అతడికి యీ అడవి ఎంత భయంకరమైనదన్న జ్ఞానం లేదు.

ఆకలి చల్లార్చుకున్న తరవాత చంద్రవర్మ తన పరిస్థితిని గురించి ఆలోచించసాగాడు. తను శత్రువులచేత బడకుండా తప్పించుకోగలిగాడు, అది గొప్ప అదృష్టమే. కాని, యిప్పుడు తను వున్న అడవి ప్రాంతం ఎలాంటిది? ఇందులో మానవమాత్రు లెవరైనా వున్నారా? లేక క్రూరమృగాలకూ, భూతప్రేతాలకూ ఉనికిపట్టయిన చోటా? ఈ విధంగా ఆలోచిస్తూ చంద్రవర్మ అడవిలోకి బయలుదేరాడు. అతడు చెట్ల కిందుగా కొద్దిదూరం నడిచేంతలో, తీవ్రమైన పెనుగాలి తాకిడికి అల్లల్లాడినట్టుగా అడవిలోని చెట్లన్నీ ఒక్కసారి భూమిమీదికి వరిగి, అంతలోనే దేహన్ని గగుర్పొడిపించేలా వికృతంగా ఈలలూ, అరుపులూ ప్రారంభించినై.

ఈ వింత చూస్తూనే చంద్రవర్మ స్థాణువులా అయిపోయాడు. చెట్లకొమ్మలు చేతులు చాచినట్టుగా అతడికేసే వంగి కీచు గొంతులతో అరవసాగినై. అతడు ఎటు తిరిగితే అటుకేసి ఆ కొమ్మలు వంగి, అతణ్ణి పట్టుకోబోతున్నట్టుగా నటించటం ప్రారం







ఖించినై. తను ఏదో మంత్రగ్రస్తమైన అడవిని ప్రవేశించినట్టు చంద్రవర్మ గ్రహించాడు. ఇప్పుడు యీ సంకటంనుంచి బయటపడటం ఎలా? ఆతడు ఒరలో వున్న కత్తి దూసి, తనకేసి చెవులు చిల్లులుపడేలా అరుస్తూ, వంగుతున్న చెట్టుకొమ్మను ఒక్క దెబ్బతో నరికాడు. తక్షణం పెద్ద మూలుగుతో కలిసి భయంకరమైన కేక వినబడింది. అందుకు ప్రతిగా అగ్నిపర్వతం బద్దలయినంత వేడిమితో గాడ్పులు ప్రారంభమై, ఆ ప్రదేశం మార్మోగేలా బుసలు వినిపించినై.

చంద్రవర్మ నిలువెల్లా వణికిపోయాడు. కాని, అంతలోనే ఆతడికి ఎక్కడ లేని తెగింపూ, సాహసం వచ్చింది. ఆతను కత్తిని పిడికిట బిగించి పాముబుసల్లాంటి ధ్వని, వేడిగాలి వస్తున్నవైపుకు తిరిగాడు. ఆతడి కళ్లకు చెట్లకిందుగా పాకి వస్తున్న పెద్ద మూడుతలల సర్పం ఒకటి కనిపించింది. అది నాలుకలు చాస్తూ, పెద్దగా బుసలు కొడుతూ ఆతణ్ణి సమీపిస్తున్నది. వేటుకు ఒక్కతల....అనుకుంటూ చంద్రవర్మ కత్తి ఎత్తాడు. అంతలోనే అడవిలోపలినుంచి వికృతమైన కంఠస్వరంతో, . ఆప్యాయత ఒలికే మాటలు వినిపించినై.

"నాయనా, కాలనాగూ! ఆ మానవుణ్ణి చంపకు. కష్టాలలో దిక్కు తెలీక మన







దగ్గరకు వచ్చినవాడు. అతిథి సమానుడు. క్షేమంగా నా దగ్గరకు తీసుకురా!"

ఆ మాటలు వింటూనే మూడుతలల కాలసర్పం, చంద్రవర్మకు అంత ఎడంలో ఆగిపోయింది. అడవిలోని చెట్లన్నీ నిశ్శబ్దంగా వూరుకున్నవి. గాలి స్తంభించిపోయింది. చంద్రవర్మ ఆశ్చర్యంగా సర్పంకేసి చూశాడు.

కాలసర్పం తనను అనుసరించమన్న సూచనగా మూడుతలలనూ ఒకసారి చంద్రవర్మకేసి ఆడించి, అడవిలోకి బయలు దేరింది. చంద్రవర్మకు మార్గాంతరం కనిపించలేదు. ఈ అడవి ప్రాంతాన్నంతా తమ మంత్రబలంతో ఎవరో వశపరుచుకుని వున్నాడు. ఆ గొంతు ఆ వ్యక్తిదే. తను ఆ మూడుతలల సర్పాన్ని అనుసరించి వెళ్లక తప్పదు. పారిపోవటానికి ప్రయత్నిస్తే తనకు యీ నిమిషానే చావు మూడుతుంది.

చంద్రవర్మ యిలా ఆలోచిస్తూ, కత్తిని మరింత గట్టిగా గుప్పెట బిగించిపట్టుకుని కాలసర్పాన్ని అనుసరించి నడవసాగాడు. కొంతదూరం వెళ్లేసరికి ఎదురుగా చెట్ల మధ్య, గద్దతలా, రెక్కలూ—సింహశరీరంతో వున్న ఒకపెద్ద వికృతాకారం కనిపించింది. సర్పం దాని ముందుకు వెళ్లి ఆగి, మూడుతలలనూ ఒకసారి వంచి పెద్దగా బుసకొట్టింది. మరుక్షణం ఆ వికృతాకారం నిలువునా రెండుగా చీలి పక్కలకు పడిపోయింది. వెంటనే శిథిలావస్థలో వున్న ఒక గృహం, దాని వాకిట తెల్లని జుట్టుతో, ముడతలు పడిన శరీరంతో నడుం వంగివున్న ఒక స్త్రీ చంద్రవర్మకు కనిపించారు.

చంద్రవర్మకు నోట మాట రాలేదు. ఆ స్త్రీని చూస్తూనే, యీమె పిశాచా, మానవ స్త్రీయా అనుకున్నాడు. అంతలో ఆ స్త్రీ చేతిలో వున్న కర్రను భూమిమీద రెండు మూడుసార్లు గట్టిగా కొట్టి, "కాలనాగూ, యిక నువ్వు పోవచ్చును," అంటూ చంద్రవర్మకేసి తిరిగి, "రా, నాయనా! ఇంట్లోకి రా.







నీకోసం ఎంత కాలంగా ఎదురుచూస్తున్నాను," అన్నది ఆప్యాయంగా.

"నా కోసమా?" అన్నాడు చంద్రవర్మ ఆశ్చర్యపడుతూ.

"అవును, నాయనా, నీకోసమే! నేను నీకు చేయువలసిన సహాయమూ, నువ్వు నాకు చేయవలసిన సహాయమూ చాలా వుంది" అన్నది ఆ స్త్రీ.

ఆ మాటలతో ఆమె మానవస్త్రీయే అనీ, మాంత్రికురాలనీ చంద్రవర్మ గ్రహించాడు.

"నే నెవరినో నీకెలా తెలుసు? నీ పేరేమిటి?" అంటూ చంద్రవర్మ ఆ స్త్రీకేసి నడిచాడు.

"నాపేరు కాపాలిని. నేను నీకేమీ హాని చేయబోవటంలేదు గనక, ఆ కత్తిని ఒరలో దాచవచ్చును. ఒకవేళ నేను బుద్ధి మార్చుకుని నీకు హాని చేయదలిస్తే, ఆ కత్తి నీకెందుకూ వుపయోగపడదు. నువ్వు అడవిని ప్రవేశిస్తూనే, నా శక్తిని చూశావు గదా? నోరూ వాయీ లేని చెట్టుచేమలతో మాట్లాడించాను. అవే నీదారిని అడ్డగించినవికూడా," అన్నది కాపాలిని.

చంద్రవర్మ ఆ పరిస్థితుల్లో తను నిస్సహాయుణ్ణని గ్రహించాడు. అతడు కత్తిని ఒరలో పెడుతూ, "కాపాలినీ, నేను రాజ్యాన్నీ, స్నేహితులనూకూడా కోల్పోయి





ఈ అడవిప్రాంతాలచేరిన నిర్భాగ్యుణ్ణి. నేను నీ కెలాంటి హాని తలపెట్టబోవటంలేదు. నువ్వుకూడా నాకు ఎలాంటి హానీ చేయవని నమ్మవచ్చునా?" అన్నాడు.

"నేను నీకు హాని తలపెట్టడమా?" అంటూ కాపాలిని ఆశ్చర్యంగా చంద్రవర్మ కేసి చూసి, "చంద్రవర్మా! నేను నా చాతనైన విధంగా నీకు సహాయం చేయదలిచాను. కాని, ఆ సహాయం చేసేముందు, నువ్వు నాకొక సహాయంచేయవలసి వుంటుంది," అన్నది.

తనను పేరుతో కాపాలిని సంబోధించటంతోనే, చంద్రవర్మకు ఆ మాంత్రికురాలి



శక్తిసామర్థ్యాలమీద నమ్మకం కుదిరింది. బహుశా, ఆమెకు తననుగురించి సర్వం తెలిసివుంటుంది. ఇప్పుడు వీరపురంలో ఏమి జరుగుతున్నదో, తన సేనాని ధీరమల్లుడూ, సుబాహుడూ ఏమయ్యారోకూడా ఆమె చెప్ప గలగవచ్చు!

చంద్రవర్మ నిర్భయంగా కాపాలినిని సమీపించాడు. ఆమె అతణ్ణి ఎంతో గౌరవంగా ఇంటిలోపలికి తీసుకుపోయింది. ఇంటిగోడలకు అనేక జంతువుల తలలూ, మానవ కపాలాలూ వేలాడుతున్నవి. గోడలో పెద్ద గవాక్షం వున్నచోట ఎంతగా తయారుచేసిన ఒక బల్లమీద పెద్ద గాజుగోళం ఒకటి తళతళ మెరుస్తున్నది.

కాపాలిని, చంద్రవర్మకు గాజుగోళం వున్న బల్లపక్కగా ఒక మెత్తను చూపిస్తూ, "వర్మా, అక్కడ కూర్చో. నువ్వు నిజంగా నదిలో మునిగిపోకుండా బతికి బయటపడటం నా అదృష్టమే అను కుంటున్నాను. నేను సాధించవలసిన ఒక కార్యం అయితే నీవల్లనే కావాలి, లేకపోతే మరెవ్వరివల్లా కాదు," అన్నది కాపాలిని.

చంద్రవర్మ గాజుగోళం పక్కగా మెత్త మీద కూర్చుంటూ, "కాపాలినీ, యీ గోళం చాలా వింతగా వున్నది. ఇలాంటివాటి వుప









యోగాన్ని గురించి నేను కొంత వినివున్నాను. ఇందులో మనం మనుష్యుల భూత భవిష్య ద్వర్తమానాలను చూడవచ్చునా?" అని ప్రశ్నించాడు.

చంద్రవర్మ ప్రశ్న వింటూనే కాపాలిని నిస్పృహగా నిట్టూర్చి. "నాయనా, చంద్రవర్మా! నువ్వనుకుంటున్నట్టు, యీ గాజు గోళం నిజంగా భవిష్యత్తులో జరగబోయే దాన్నికూడా చూపించగలిగితే, నేను యింత నిరాశ పడవలసిన అవసరంలేదు. ఈ గోళం భూతవర్తమానాలను మాత్రమే చూపగలుగుతుంది. ఆ కారణంవల్లనే నేను ఒకానొక కష్టసాధ్యమయిన కార్యం సాధించేందుకు నీ సహాయం కోరుతున్నాను," అన్నది.

"ఆ కార్యం అంత కష్టసాధ్యమా?" అన్నాడు చంద్రవర్మ.

"అవును కష్టసాధ్యమే; అసాధ్యం మాత్రంకాదు. ఇక్కడికి నూరుయోజనాల దూరంలో శంఖుడు అనబడే ఒకానొక మాంత్రికుడున్నాడు. నువ్వు అతడి మంత్ర గృహంలో దొరబడి, నాకోసం ఒకానొక వస్తువును సంగ్రహించి తేవలసివుంటుంది. ఆ వస్తువుగాని లభ్యమయితే, నేను మరొక వెయ్యేళ్లకాలం యౌవ్వనారోగ్యాలతో సుఖంగా జీవిసాను. లేకపోతే..."

కాపాలిని మాట ముగించకుండానే, వెక్కివెక్కి ఏడుస్తూ; కన్నీళ్లను తుడుచుకోసాగింది. చంద్రవర్మకు ఆ నిమిషంలో ఆమెమీద ఎక్కడలేని జాలి కలిగింది. ఈ మంత్రగత్తె, తనను మోసంచేసి హతమార్చాలని చూస్తున్నదేమో అన్న సంశయం అంతవరకూ అతడి మనసులో ఏమైనా వుంటే, అది కాస్తా ఆమె దుఃఖాన్ని చూస్తూనే మాయమయింది.

"కాపాలినీ, నేను నీకు నా శాయశక్తులా సహాయంచేస్తాను. కాని, ముందుగా నీవు నాకు ఒక చిన్న వుపకారం చేయాలి. నా వీరపురనగరం యిప్పుడెలా వున్నది? నా





సేనాని ధీరమల్లుడూ, నా సేవకుడు సుబా హుడూ, బతికే వున్నారా? ఆ వృత్తాంతం, యీ గాజుగోళంలో చూసి చెప్పగలవా?" అని అడిగాడు చంద్రవర్మ.

కాపాలిని చిరునవ్వుతో లేచి గోడకు తగిలించివున్న ఒక పొడవాటి మానవాస్థి కను తీసుకుని గాజుగోళాన్ని సమీపించి, ఏదో మంత్రం చదువుతూ దానిని తాకి, "ఇదిగో, నీ వీరపురనగరం!" అన్నది.

భగభగమనే మంటలతో, ఆకాశం ఎత్తు లేచిన పొగలతో, వీధులవెంట దారీ తెన్నూ లేకుండా హాహాకారాలు చేస్తూ పరిగెత్తే పౌరులతో ప్రత్యక్షమైన వీరపురనగరాన్ని చూస్తూనే, చంద్రవర్మ వికృతంగా అరిచి, కళ్లు మూసుకుంటూ, "కాపాలినీ! ఇక చాలు, ఆ దృశ్యం చూడలేను," అన్నాడు బిగ్గరగా. కాపాలిని మానవాస్థికతో గోళాన్ని తాకిన మరుక్షణం ఆ భీతి కొల్పే దృశ్యం అదృశ్యమైంది. "ఇదుగో, నీ సేనాని ధీర మల్లుడు!" అంటూ కాపాలిని మానవాస్థి కతో మరోసారి గాజుగోళాన్ని తాకింది.

చంద్రవర్మ కళ్లు తెరిచి గోళంకేసి ఆదుర్దాగా చూశాడు. గుట్టలు పుట్టలు, పెద్ద పెద్ద కొండలు....సేనాని ధీరమల్లుడు తన అశ్వికులతో వేగంగా పోతున్నాడు. అతణ్ణి అన్ని వైపులనుంచీ చుట్టుముట్టుతూ సర్ప కేతుడి బలగం సమీపిస్తున్నది. ధీరమల్లుడు తన గుర్రాన్ని నిలుపరించి, తన అనుచరుల కేసి తిరిగి ఏదో చెప్పి, కత్తి దూసి శత్రువు లకు ఎదురుగా తన గుర్రాన్ని దూకించాడు.

"ఇది యివ్వాళ ఉదయం జరిగింది. ఆ తరవాత ధీరమల్లుడేమయిందీ నువ్వు చూడటం మంచిది కాదు," అంటూ కాపాలిని తన చేతగల మానవాస్థికతో గాజు గోళాన్ని తాకింది. వెంటనే ఆ దృశ్యం మాయమయింది.

చంద్రవర్మ నిర్విణ్ణుడై గాజుగోళంకేసి చూస్తూ వుండిపోయాడు. (ఇంకా వుంది)








## 7

[ చంద్రవర్మ నదిలో పడి కొట్టుకుపోయి, ఒకానొక అడవి మధ్య ఒడ్డుపట్టాడు. అతడు కొంతసేపటికి తెప్పరిల్లి అడవిలో ప్రవేశించేసరికి, చెట్లనుంచి మూలుగులూ, కేకలూ వినిపించినై. అంతలో మూడు తలల సర్పం ఒకటి అతడికి ఎదురైంది. దానిని అనుసరించిపోయి, చంద్రవర్మ కాపాలిని అనే మంత్రగత్తె గృహం చేరాడు. మంత్రగత్తె అతణ్ణి ఆహ్వానించింది. ఆమె తనవద్ద వున్న గాజుగోళంలో వీరపురనగర పరిస్థితినీ, సేనాని ధీరమల్లుడు శత్రువులచే చుట్టుముట్టబడుతూండటాన్నీ చంద్రవర్మకు చూపింది. తరవాత—]

కాపాలిని చంద్రవర్మ భుజంమీద చేయి వేసి, "నాయనా, చంద్రవర్మా అధైర్య పడకు," అన్నది ఆప్యాయంగా. "కష్టాలు కలకాలం వుండవు. తిరిగి ఏదో ఒకనాడు నీ రాజ్యాన్ని జయించుకోగలవు. నాకు వాగ్దానం చేసిన విధంగా సాయపడ్డావంటే, ఆ తరవాత నీకు అన్నివిధాలా తోడ్పడతాను.'

కాపాలిని మాటలు చంద్రవర్మకేమాత్రం వుత్సాహం కలిగించలేదు. మూడు యోజనాల ఆవతల వున్న శంఖుడనే మాంత్రికుడి మంత్రగృహం ప్రవేశించి, కాపాలిని కోసం తను ఒకానొక వస్తువును సంగ్రహించుకు రావాలి. ఆ ప్రయత్నంలో తను చావకుండా బయటపడగలిగితే—అప్పుడు కాపాలిని తనకు చేస్తానన్న సహాయం వుపయోగపడుతుంది. అలాకాక తను మరణిస్తే...

చంద్రవర్మ ఆలోచిస్తున్న విషయం ఏదో గ్రహించినదానిలా కాపాలిని ఒక్కసారి







నిట్టూర్చి, అంతలోనే చిరునవ్వు నవ్వుతూ, "నాయనా, వర్మా! నీవు ఆలోచిస్తున్న సంగతేదో నేను గ్రహించాను. నువ్వీ నిమిషాన యిక్కణ్ణించి వెళ్లిపోదలిస్తే, వెళ్లిపోవచ్చు; నేను ఆటంకపరచను. కాలనాగు కాని, అడవిలోని చెట్టుచేమలుగాని నీకు ఏమాత్రం హాని చేయవని హామీ యిస్తున్నాను, సరేనా?" అన్నది.

తను యిక్కడినుంచి నిరాటంకంగా వెళ్లిపోవచ్చునన్నమాట వింటూనే చంద్రవర్మ దిగాలుపడిపోయాడు. తను యిక్కడినించి వెళ్లదలిచినా, వెళ్లేందుకు ఒక స్థానం అంటూ ఎక్కడా వున్నట్టు అతడికి కనబడలేదు. ఇప్పటి పరిస్థితుల్లో తను అడవులవెంటా, కొండలవెంటా ఒంటరిగా తిరగటం తప్ప చేయగలిగిందేమీ లేదు. తండ్రి మరణించాడు! రాజ్యం శత్రువుల హస్తగతం అయింది! విశ్వాసపాత్రుడైన సేవకుడు సుబాహుడు కనబడకుండా పోయాడు!

"కాపాలినీ, నేను నీకు నా సర్వశక్తులా సాయపడేందుకు ప్రయత్నిస్తాను. శంఖుడనే మాంత్రికుడి మంత్రగృహం నుంచి నేను తేవలసిన వస్తువేమిటి?" అన్నాడు చంద్రవర్మ ఉత్సాహంగా.

కాపాలిని ముఖం వికసించింది. ఆమె మెత్తమీదినుంచి లేచి తన చేత గల మానవాస్థికతో, గోడపక్కన వున్న కొయ్యబొమ్మ తలమీద గట్టిగా కొడుతూ, "భైరవా! మన యింటికి అతిథి వచ్చాడు. త్వరగా విందు భోజనం వడ్డించు," అన్నది.

ఆ వెంటనే ఇల్లు దద్దరిల్లేలా 'హుం' అన్న బొబ్బ కేకతో ఒక మహాకాయుడు ప్రత్యక్షమై, "ఇదుగో, విందుభోజనం!" అంటూ అన్ని రకాల పదార్థాలూ, పిండివంటలూ ఒక బంగారు పళ్లెరంలో తెచ్చి చంద్రవర్మ ముందు పెట్టాడు.

చంద్రవర్మకు ఎక్కడలేని ఆకలీ పుట్టుకొచ్చింది. అతడు భోజనం చేస్తున్నంత







సేపు ఒకపక్క భైరవుడూ, మరొకపక్క కాపాలినీ తృప్తిగా చూస్తూ నిలబడ్డారు. చంద్రవర్మ తినగలిగినంత తిని, మిగిలిన పదార్థాలతో బంగారు పళ్లెరాన్ని దూరంగా తోయగానే, భైరవుడు చేయి కడుక్కొనేందుకు నీళ్లు తెచ్చాడు.

కాలనాగూ, భైరవుడూలాటి భయంకర శక్తులను తన చేతుల్లో వుంచుకున్న కాపాలిని, శంఖుడి నుంచి తనకు కావలిసిన వస్తువును ఎందుకు తెప్పించుకోలేదు? వాళ్లకన్న తనలో వున్న అధిక శక్తులేమిటి? ఇందులో ఏదైనా మోసం లేదుగదా? అనుకున్నాడు చంద్రవర్మ.

"నాయనా, చంద్రవర్మా! ఇప్పుడు ముఖ్య విషయాలగురించి మాట్లాడదాం. శంఖుడి మంత్రగృహంలో అపూర్వ శక్తులు గల ఒక శంఖం వున్నది. ఒకానొక మూలికతో కాచిన కషాయం అందులో పోసి తాగినవాళ్లకు వృద్ధాప్యం నశించి తిరుగా యౌవ్వనం లభిస్తుంది. వెయ్యేళ్లవరకూ తిరిగి వృద్ధాప్యం వాళ్లకేసి ముఖం చూపదు. ఇప్పటికి పది వందల ఎనభైఏళ్లక్రితం ఆ చికిత్సపొందాను. అప్పట్లో మాంత్రికుడైన శంఖుడు నాకు విరోధికాడు. కాని, ఆ తరవాత అతడికి నాతో బద్ధవిరోధం ఏర్పడింది," అంటూ కాపాలిని చటుక్కున వెనుదిరిగి, అంత దూరంలో నిలబడివున్న భైరవుడికేసి కళ్లురుముతూ చూసి, "ఛీ, నీచుడా! నీ పాడుబుద్ధి పోనిచ్చావుకాదు," అంటూ మానవాస్థికతో అతడి తలమీద బాదింది. వెంటనే భైరవుడు పెద్దగా మూలిగి కపిమంటూ కొయ్యబొమ్మలా అయిపోయి గోడపక్కన కూలబడ్డాడు.

"వాడు నీ సేవకుడేగదా, ఎందుకు అంత కఠినంగా కొట్టావు?" అని అడిగాడు చంద్రవర్మ.

కాపాలిని వికటంగా నవ్వింది. "వాడు నా సేవకుడే, కాని వీలయితే నా రహస్యాలు





తెలుసుకుని, నన్ను తుదముట్టించి శంఖుడి దగ్గిరకు పారిపోవటానికి వెనుదీయని నీచుడు. అసలు యీ తువ్వ ఘాతాలతో వచ్చిన చిక్కే యిది. వాళ్లు సేవచేస్తున్న మాంత్రికులకన్న బలవంతులెవరైనా కని పిస్తే, వారి అండ చేరటానికి ప్రయత్నిస్తారు. అందుకే వాణ్ణి కొయ్యముక్కలా చేసి అక్కడ పడవేసి వుంచుతున్నాను. శంఖుడు నా రహస్యాలు కనుక్కొనేందుకు చాలా మందిని పంపాడు. వాళ్లకు పట్టిన దుస్థితి చూశావుగదా?" అంటూ కాపాలిని ద్వారానికి తోరణంలా వేలాడకట్టిన కపాలాలను చంద్రవర్మకు చూపించింది.



ఆ కపాల తోరణాన్ని చూస్తూనే చంద్ర వర్మ నిలువెల్లా వణికిపోయాడు. ఈ క్షణం వరకూ అతడు వాటికేసి పరీక్షగా చూసి వుండలేదు. శంఖుడు పంపిన దూతలు కాపాలినివల్ల హతమార్చబడి ద్వారానికి తోర ణాలయ్యారు. అదే విధంగా కాపాలిని పంపిన దూతలు శంఖుడిచేత చంపబడి అతడి మెడలో హారాలై వుండవచ్చు!

"కాపాలినీ! నువ్వు పంపిన దూతల కపాలాలనుకూడా శంఖుడు యిదే విధంగా వుపయోగించుకుని వుండవచ్చు," అన్నాడు చంద్రవర్మ అనుమానంగా.

కాపాలిని లేదన్నట్టు తల అడ్డంగా తిప్పింది. "నే నింతవరకూ అతడి దగ్గిరకు ఎవరినీ పంపలేదు. ఆ అపూర్వ శక్తులు గల శంఖాన్ని తస్కరించుకు రావాలంటే, అందుకు సమర్థుడైనవా డెవడో నాకు తెలుసు," అన్నది.

"ఆ సమర్థుడైనవాణ్ణి నేనని నీ అభి ప్రాయం, అంతేనా?" అన్నాడు చంద్రవర్మ ఎంతో ఆశ్చర్యపడుతూ.

"అవును, వర్మా!" అన్నది కాపాలిని వుత్సాహంగా. "నీవు యువకుడివి, అంతే కాక క్షత్రియుడివి, అపైన రాజ్యాన్ని, బంధు మిత్రులనూ....సర్వం కోల్పోయినవాడివి.








అలాంటి నీకన్న సాహసికుడు వాళెవరు దొరుకుతారు? ఈ ప్రయత్నంలో నీవు జయించావంటే, ఆ తరవాత నీవు రాజువే కాదు, మొత్తం దేశానికే చక్రవర్తివి కాగలవు. దానికి మార్గం ఏమిటో ఆ అపూర్వ శక్తులు గల శంఖాన్ని నా దగ్గిరకు తెచ్చినతరవాత చెపుతాను," అన్నది కాపాలిని.

కాపాలిని మాటలు చంద్రవర్మకు ఎంతో వుత్సాహన్ని కలిగించినై. కాని, అతడి హృదయంలో ఎక్కడో సలుసంత అను మానంకూడా లేకపోలేదు. తనచేత ఆ శంఖాన్ని తెప్పించేందుకు కాపాలిని తనకు యీ విధమైన ఆశలు చూపుతూవుండవచ్చు.

"సరే, ఆ మాంత్రికుడుండే చోటుకు వెళ్లవలసిన మార్గం ఏమిటో చెప్పు, బయలు దేరుతాను," అన్నాడు చంద్రవర్మ. అత డిలో ఎక్కడ లేని తెగింపు వచ్చింది.

కాపాలిని ఇంటి బయటికి దారితీసింది. ఆమె వెనకనే చంద్రవర్మ బయటికివచ్చాడు. సూర్యుడు పడమట దిక్కుకు జారు తున్నాడు. కాపాలిని ఉత్తర దిక్కుకేసి తిరిగి, చూపుడు వేలితో అటుకేసి చూపుతూ, "ఈ దిక్కుగా నూరు యోజనాల దూరంలో శంఖుడు వుండే కొండా, దానిమీద ఆతడి మంత్రగృహం వున్నవి. ఆ గృహంలోని పూజామందిరంలో ఆ అపూర్వశక్తులు గల శంఖం ఒక నాగుబాము మెడలో వేలాడుతూ వుంటుంది. ఆ నాగుబాము గోడకు వున్న ఒక మేకుకు వేలాడుతూ వుంటుంది. నువ్వు మాంత్రికుడైన శంఖుడి నుంచి దానిని అత డితో స్నేహంచేసిగాని, లేక మోసంచేసి గాని, ఆఖరుకు ప్రాణం తీసిఅయినాసరే, తేవలసి వుంటుంది," అన్నది.

"అంత గొప్ప మాంత్రికుణ్ణి చంపడం కూడా సాధ్యమేనా?" అన్నాడు చంద్రవర్మ ఆశ్చర్యంగా.

"ఎందుకు కాదు? ఎంత గొప్ప మాంత్రికుడైనా ఏదో ఒకనాడు చావక





తీరదు. శంఖుడు ఇందుకు భిన్నం కాదు. అతణ్ణి హతమార్చటం ఏ విధంగా సాధ్యమో నువ్వే ప్రయత్నించి తెలుసుకోవలసి వుంటుంది," అన్నది కాపాలిని.

"అయితే, యిక నేను బయలుదేరు తాను," అంటూ చంద్రవర్మ తన దుస్తుల కేసీ, ఒరలో వున్న కత్తికేసీ ఓమారు చూసుకుని ముందుకు నడిచాడు.

చంద్రవర్మ రెండు మూడడుగులు వేశాడో లేదో, వెనకనుంచి కాపాలిని ఆత్రంగా ముందుకు వచ్చి, అతడి భుజాన్ని పట్టుకుని ఆపుతూ, "నాయనా, వర్మా! ఒక ముఖ్యమైన సంగతే మరిచిపోయాను. శంఖుడి దగ్గిర ఒక వింతపక్షి వున్నది. దాని బలమూ, వేగమూ చెప్ప నలవి కాదు. దానిపేరు అగ్నిపక్షి. అది ప్రతిరోజూ సూర్యాస్తమయంవేళ ఆహార సంపాదనకు బయలుదేరి, తిరిగి నడిరేయికి మాంత్రికుడిగృహం చేరుతుంది. అది ఆకాశంలో ఎగురుతున్నప్పుడు పెద్ద అగ్నిజ్వాలలా ప్రకాశిస్తుంది. దాని గుర్తుల ఆధారంతో, నీవు దారితప్పకుండా మాంత్రికుడిగృహం చేరవచ్చు. నువ్వు వెళ్ళి రావలసిన దూరం రెండు వందల యోజనాలు. ఎంత కాలంలో పని పూర్తిచేసుకుని తిరిగి రాగలవు?" అని అడిగింది.



కాపాలిని అడిగిన ఈ ప్రశ్న చంద్రవర్మకు వింతగా తోచింది. అడవిమార్గానా, కొండదారులవెంటా పడి నూరుయోజనాలు నడవాలి. ఆ తరవాత మహాశక్తివంతుడైన శంఖుణ్ణి లొబరుచుకుని ఆ శంఖం చేజిక్కించుకోవాలి. తిరిగి వచ్చేందుకు నూరుయోజనాలు నడవాలి. మార్గమధ్యంలో ఎన్ని ప్రమాదాలను ఎదుర్కోవలసి వస్తుందో ఆ దేవుడికే తెలియాలి. అలాంటప్పుడు యింత కాలానికి తిరిగి రాగలనని మాట యివ్వటం ఎలా సాధ్యం అవుతుంది?

చంద్రవర్మ ఆలోచనలను పసికట్టిన దానిలా కాపాలిని వెలవెలపోతూ, "అవును,







వర్మా, నువ్వు చేయబూనిన సాహసం నాకు తెలియందికాదు. కాని, యీనాటినుంచి ఒక్క సంవత్సరంలో నీవు ఆ శంఖం తెచ్చి నా కివ్వగలిగితేనే, దానివల్ల నాకు వుపయోగం వుంది. ఆ గడువుకు ఒక్క రోజు దాటినా అది నాకెందుకూ పనికిరాదు. సరే, ఏ కారణంవల్లనైనా నీవు తిరిగి ఒక సంవత్సరంలో రాలేకపోతే, యిక్కడ నేను వుండను. కాని, నీకు చేస్తానన్న సహాయం మాట మరవను. గాజుగోళం వున్న బల్ల సొరుగులో ఒక తాళపత్రం వుంచి పోతాను. దానిలో ఆ శంఖాన్ని నీ మేలుకు ఎలా వుపయోగించుకోవాలో లిఖించబడి వుంటుంది," అన్నది కాపాలిని.

కాపాలిని అన్న ఈ మాటలతో చంద్రవర్మకు ఆమెమీద ఎక్కడలేని విశ్వాసమూ కలిగింది. మాంత్రికురాలు తనను మోసగించటం లేదని అతడు నమ్మాడు. ఆ కారణంవల్ల చంద్రవర్మ చటుక్కున మాంత్రికురాలి రెండు చేతులూ ఆప్యాయంగా పట్టుకుని, "ఒక్క సంవత్సరంలో ఆ శంఖాన్ని తీసుకుని నేను తిరిగివస్తాను." అంటూ ఆమెచేతులు వదిలి ముందుకు నడిచాడు. ఆ వెంటనే కాపాలిని, "కాలనాగూ!" అంటూ మూడు తలల సర్పాన్ని పిలిచింది. సర్పం బుసలుకొడుతూ దగ్గిరకు రాగానే ఆమె చంద్రవర్మను సర్పానికి చూపుతూ, "అతడికి అడవి దాటేవరకూ రక్షణగా వుండి రా!" అని అజ్ఞాపించింది.

కాలసర్పం ఒక్క దూకున చంద్రవర్మ ముందుకు వెళ్ళి, అతడికి మార్గం చూపుతూ నడవసాగింది. చంద్రవర్మ చెట్లలో కొంత దూరం వెళ్ళింతరవాత వెనుదిరిగి చూశాడు. అతడికి కాపాలిని కనిపించలేదు. కాని, ఇల్లు వుండవలసిన చోట గద్ద తలా, రెక్కలూ—సింహశరీరంతో వున్న ఒక పెద్ద వికృతాకారం కంటబడింది.

—[ఇంకా వుంది]





# కంచుకోట



## 8

[మంత్రగత్తె అయిన కాపాలిని, చంద్రవర్మకు ఆతిథ్యం యిచ్చి, భైరవుడనే తన నౌకరు చేత అతడికి విందుభోజనం పెట్టించింది. తరవాత ఆమె శంఖుడనే మాంత్రికుడివద్ద వున్న అపూర్వశక్తులు గల శంఖాన్ని తీసుకురావలసిందిగా అతణ్ణి కోరింది. కొన్ని మూలికలతో కాచిన కషాయం ఆ శంఖంలో పోసుకుని తాగితే, తను మరి వెయ్యేళ్లు హాయిగా జీవించగలనని చెప్పింది. చంద్రవర్మ సరేనని బయలుదేరాడు. తరవాత—]

ముందు దారి చూపుతూ నడుస్తున్న కాలనాగును వెన్నంటి చంద్రవర్మ నడవసాగాడు. సర్పం తన మూడు తలలనూ అన్ని దిక్కులకూ తిప్పుతూ, మధ్యమధ్య పెద్దగా బుసలుకొడుతూ గుబురు చెట్ల మధ్యగా పోసాగింది. ఆ చెట్ల కింద అనేక క్రూరజంతువులూ, విషసర్పాలూ ఆ యిద్దరికీ ఎదురయినై. కాని, కాలనాగును చూస్తూనే అవి చెల్లాచెదరుగా పరిగెత్తసాగినై.

ఆ విధంగా అడవిలో కొంతదూరం వెళ్లిన తరవాత చంద్రవర్మకు హఠాత్తుగా ఒక అనుమానం వచ్చింది. కాలనాగు మానవ భాషను అర్థంచేసుకుంటున్నది. మాంత్రికురాలు మరో మనిషితో మాట్లాడినట్టే దానితో మాట్లాడి, ఆజ్ఞలు యిచ్చింది. కాని, అది మానవభాషలో మాట్లాడినట్టు తను వినలేదు. తను ప్రయత్నించితే కాలనాగు మాట్లాడగలిగేదీ లేనిదీ తేలిపోతుంది.









చంద్రవర్మ ఆశ్చర్యపోయాడు. అది గ్రహించినదానిలా కాలనాగు తన మూడు తలలనూ అటూయిటూ తిప్పి, వెళుతున్న మార్గంనుంచి పక్కకు తిరిగి మరొక దిక్కుగా పోతూ, అనుసరించి రావలసిందిగా చంద్రవర్మకు సంజ్ఞ చేసింది.

కాలనాగు తనకేదో రహస్యం చెప్ప చూస్తున్నదని చంద్రవర్మ గ్రహించాడు. అందువల్ల అతడేమాత్రం సంశయించకుండా దాన్ని అనుసరించి నడవసాగాడు. కొద్ది సేపటికి ఇద్దరూ చీకటిమయంగా వున్న గుబురుచెట్లలోంచి బయటపడి, సెలయేరు ఒకటి ప్రవహిస్తున్న చోటుకు చేరారు.

కాలనాగు సెలయేటిముందు ఆగి తన తలలతో దాని ఆవతల వున్న ఒక వింత వృక్షంకేసి చూపింది. చంద్రవర్మ అటుకేసి చూసేంతలో వికారమైన నవ్వులూ, కేకలూ కూతలూ వినిపించినై. ఆ విచిత్ర ధ్వనులు వస్తున్న వృక్షంకేసి చూస్తూనే చంద్రవర్మ నిలువెల్లా వణికిపోయాడు.

అది ఒక వింతవృక్షం. నలభై యాభై అడుగుల ఎత్తున గుమ్మటంలా గుబురుగా పెరిగిన ఆ వృక్షానికి రకరకాల జంతువుల తలలూ, పకుల తలలూ వేలాడుతున్నవి. అవి చంద్రవర్మనూ, కాలనాగునూ చూస్తూనే

చంద్రవర్మ యిలా ఆలోచించి, కాలనాగు దగ్గిరగా వెళ్లి, "కాలనాగూ! మనం యీ అడవిని దాటాలంటే యింకా ఎంతదూరం నడవాలి?" అని ప్రశ్నించాడు.

చంద్రవర్మ ప్రశ్న వింటూనే కాలనాగు తక్కున ఆగిపోయింది. దాని మూడు తలలూ ఒకేసారి భూమిమీదినుంచి పైకి లేచి చంద్రవర్మ కళ్లల్లోకి సూటిగా చూసినై. మరుక్షణం అది తన నాలుకలను ముందుకు సాచి చిన్న శబ్దం చేసింది. ఆ ధ్వని మామూలుగా అది కొట్టే బుసలలాగా లేదు. అందులో ఒకదానివెంట ఒకటిగా రెండు మూడు రకాల శబ్దాలు వినిపించినై.









జంతువులలాగా అరవటం, పక్షులలాగా కూయటం ప్రారంభించినై.

చంద్రవర్మ వృక్షం మీదినుంచి తన దృష్టిని కాలనాగుకేసి తిప్పాడు. కాలనాగు అతడికేసే నిశ్శబ్దంగా చూస్తున్నది. చంద్రవర్మ వింతవృక్షానికేసి చేయి చూపుతూ, "అది వృక్షమా? లేక ఆ రూపంలో వున్న ఏదైనా భయంకర రాక్షసా?" అని అడిగాడు.

కాలనాగు నిశ్శబ్దంగా తలలు ఆడించి సెలయేటికేసి నడిచింది. చంద్రవర్మ దాని వెనకనే బయలుదేరాడు. కొద్దిసేపటికల్లా కాలనాగు ఆ వింతవృక్షం దగ్గిరకు వచ్చి ఆగింది. చంద్రవర్మకూడా అక్కడికి వచ్చేంతలో వృక్షం మీదినుంచి మరింత భయంకరంగా అరుపులు రాసాగినై. చంద్రవర్మ గుండె రాయిచేసుకున్నాడు.. ఒకవేళ కాలనాగు తనను మోసగించి హతమార్చ దలిచినా తను చేయగలిగిందేమీ లేదు. ఈ అడవి ప్రవేశిస్తూనే తను మాంత్రికురాలి శక్తికి లోబడిపోయాడు. తన దేహబలంగాని, ఒరలోని కత్తిగాని యీ మంత్ర తంత్రాల బారినుంచి తనను రక్షించలేవు. ఈ నిమిషంలో తనకు మేలుగానీ కీడుగానీ జరగటం సంభవిస్తే అదంతా మాంత్రికురాలి ఆజ్ఞల వల్లనే జరుగుతుంది.



చంద్రవర్మ యిలా ఆలోచిస్తున్నంతలో కాలనాగు అతడికి మరింత దగ్గిరగా వచ్చి, తలలుఎత్తి వృక్షంకేసి సంజ్ఞ చేయసాగింది. సర్పం తనను వృక్షం ఎక్కమంటున్నదని చంద్రవర్మ గ్రహించాడు. అతడు ఒరలోనుంచి కత్తి దూసి నిర్భయంగా చెట్టును సమీపించి దానితో చెట్టుబోదెను ఒక్కసారి గట్టిగా పొడిచాడు. ఆ వెంటనే అడవి దద్దరిల్లేలా హహాకారాలు వినిపించినై. కాలనాగు భయంతో వణికిపోతున్నదానిలా శరీరాన్ని కుంచించి చంద్రవర్మ ముందుకు వచ్చింది. చంద్రవర్మ యివేమీ గమనించే స్థితిలో లేదు. చెట్టున వేలాడుతూ తనను







వికృత ధ్వనులతో భయపెట్ట చూస్తున్న జంతువుల పక్షుల తలలను తన కత్తితో నరికి కింద పడకొట్టటానికి అతడు నిశ్చయించుకున్నాడు.

కాలనాగు చెట్టు బోదెవద్దకు వెళ్ళి, శరీరాన్ని దానికి చుట్టబెట్టి కొమ్మలకేసి ఓమారు చూసింది. అది చెప్పదలిచినదేదో గ్రహించినవాడిలా చంద్రవర్మ చరచరా చెట్టుమీదికి పోకాడు. ఈలోపల వృక్షానికి వేలాడుతున్న తలలనుంచి వికృతమైన అరుపులు ఎడతెరిపి లేకుండా వినపడసాగినై. చంద్రవర్మ నిర్భయంగా కొమ్మలలోకి వెళ్ళి తన కత్తితో పెద్దపులి తలలా వుండి కోరలు సాచి భయపెడుతూన్న ఒక తలను కొమ్మనుంచి నరికాడు. మరుక్షణం అది దభీమంటూ కింద పడిపోయింది. చంద్రవర్మ ఆశ్చర్యానికి అంతులేదు. భూమిమీద పడిన ఆ పెద్దపులి శిరస్సు పండులా మారిపోయింది.

చంద్రవర్మ గబగబా చెట్టు దిగి వచ్చేంతలో, కాలనాగు ఆ పండును నోట కరుచుకుని అతడికేసి తిరిగింది. చంద్రవర్మ ఆ పండును తీసుకుని గట్టిగా కొరికి చూశాడు. మరుక్షణం కాలనాగు పెద్దగా నవ్వుతున్నట్టు అతడికి వినబడింది. చంద్రవర్మ దానికేసి తిరిగి చూశాడు.

"చంద్రవర్మా, యిప్పుడు తెలిసిందా, యీ వృక్షానికి వేలాడుతున్న వింత తలల సంగతి?" అన్నది కాలనాగు.

ఆ మాటలతో చంద్రవర్మకు అంతా అర్థం అయిపోయింది. తను పండును కొరుకుతూవుండగానే తనకు కాలనాగు మాట్లాడే మాటలు తెలిసిపోయినై. ఆ క్షణం వరకూ అది చేసే ధ్వని కేవలం పాము బుసలాగే వుంది.

"ఆ పండును కొరకటంతో నీకు పశుపక్ష్యాదుల భాష అవగతం అయింది. మాంత్రికుడైన శంఖుణ్ణి చేరటానికీ, అతణ్ణించి అపూర్వ శక్తులు గల శంఖాన్ని







తస్కరించటానికి యిది ఎంతగానో తోడ్పడుతుంది. అతడి భృత్యుడైన ఏంత అగ్నిపక్షి నుంచి ప్రమాదం రాకుండా నువు మసులుకో వలసివుంటుంది. ఇప్పుడు నీవు అన్ని జీవరాసుల భాషలనూ అర్థం చేసుకోగలవు గనక, నీ ప్రయత్నంలో విజయం సాధించే అవకాశం వుంది," అన్నది కాలనాగు.

చంద్రవర్మలో ఎక్కడలేని వుత్సాహం వెల్లివిరిసింది. అతడు కాలనాగుకేసి కృతజ్ఞత వుట్టిపడే కళ్లతో చూస్తూ, "కాలనాగూ! నువ్వు నాకు చాలా గొప్ప సహాయం చేశావు. ఇందుకు ప్రతిగా నానుంచి నువ్వు కోరుతున్నదేమిటి?" అని అడిగాడు.

కాలనాగు విచారంగా తలలను కిందికి వాల్చి, "నువ్వు నాకు చేయవలసిన సహాయం ఏమంత పెద్దది కాదు. అయినా, నువ్వు శంఖుణ్ణుంచి ఆ అపూర్వ శక్తులు గల శంఖాన్ని తెచ్చేవరకూ నేను వేచివుండవలసి వుంది," అన్నది.

కాలనాగు యిలా జవాబిచ్చేసరికి, చంద్రవర్మకు అది అడగదలిచిన సహాయం ఏదో యిప్పుడే తెలుసుకోవాలని కోర్కె పుట్టింది. అతడు కాలనాగుకేసి అనుమానంగా చూస్తూ, "కాలనాగూ, నువ్వు నిజంగా సర్పానివా? లేక మానవుడివా?" అన్నాడు.

"నేను ఒకప్పుడు సర్పాన్ని కాదు; మానవుణ్నే. శంఖుడికి శిష్యుడిగా వుండేవాణ్ణి. అతడు పంపగా కాపాలినికి హాని చేయటానికి వచ్చి, ఆమెకు దొరికిపోయి యిలా పామునైపోయాను. ఆ రోజునుంచి నన్ను ఆమె భృత్యుడుగా వుపయోగించుకుంటున్నది. నీవు నీ ప్రయత్నంలో విజయం సాధించి వచ్చినట్టయితే, నన్ను యీ తుచ్ఛజీవితాన్నుంచి కాపాడగలవు," అన్నది కాలనాగు విచారంగా.

"ఈ మాత్రపుదానికి నువ్వు అంతకాలం వేచివుండ నవసరం లేదు. ఇప్పుడే నేను దిరిగి కాపాలిని దగ్గిరకు వెళదాం. ఆమె









"నా మాటను తోసివేయలేదు. నీకు తిరుగా మానవరూపం ప్రసాదించవలసిందిగా ఆమెను కోరతాను," అన్నాడు చంద్రవర్మ.

ఇందుకు కాలనాగు అంగీకరించలేదు. "కాపాలిని సంగతి సాంతంగా నీకు తెలియదు, వర్మా! వట్టి అనుమానం మనిషి. మనిద్దరమూ ఏకమై తనకేదో ద్రోహం తలపెట్టామని ఆమె భావించినా భావించవచ్చు. అలా జరిగితే, నాతోపాటు నీకూ మరింతగా కీడు జరుగుతుంది. ఇంతకాలంగా యీ సర్పజీవితం గడుపుతున్నాను. మరికొద్ది రోజులు వేచివుండటం నాకేమంత కష్టం కాదు," అన్నది కాలనాగు.

చంద్రవర్మకు కాలనాగు మాటల్లో సత్యం ఉన్నట్టు తోచింది. ఈ మాంత్రికులూ, మంత్రగత్తెలూ నమ్మదగినవారు కారు. ఏ క్షణంలో వాళ్లు ఎవరిని గురించి ఎలాంటి అనుమానాలకు గురిఅవుతారో వూహించటం కష్టం. చంద్రవర్మ యిలా ఆలోచించి చెట్టు దగ్గిరనుంచి ముందుకు కదిలాడు. కాలనాగు తిరిగి ఎప్పటిలాగా అతడికి ముందుండి దారి చూపసాగింది.

సరిగా మిట్టమధ్యాహ్నంవేళకు వాళ్లిద్దరూ దట్టంగా వున్న అడవిప్రాంతాన్ని దాటగలిగారు. ఎదురుగా పెద్ద కొండలూ లోయలూ కనిపించినై. ఆ ప్రాంతాలకూడా చెట్లూ పొదలూ వున్నవి గాని, అవి అంత చిట్టడవిలా కనిపించటంలేదు.

"చంద్రవర్మా! ఇక నేను వెనక్కు తిరిగిపోతాను. కాపాలిని ఆజ్ఞప్రకారం నిన్ను యీ అడవి దాటించాను. ఇక ముందుకు నీవు ఒంటరిగా వెళ్లవలసిందే! ఆ కనిపించే కొండలూ, కనుమల్లో నువ్వు అడుగడుగునా ప్రమాదాలను ఎదుర్కోవలసి రావొచ్చు. కాని, నువ్వు దిట్టతనం కోల్పోకపోతే, నీకు వచ్చిన పశుపక్ష్యాదుల భాషవల్ల అన్ని గండాలనూ గడిచి, విజయం సాధించగలవు," అన్నది కాలనాగు.








ఆ తరవాత చంద్రవర్మ దగ్గిర సెలవు తీసుకుని కాలనాగు వచ్చిన మార్గాన బుసలుకొడుతూ బయలుదేరింది. చెట్లలో అది కనబడుతున్నంతవరకూ దానికేసి చూసి, చంద్రవర్మ పెద్దగా నిట్టూరుస్తూ తను పోవలసిన మార్గంకేసి నడిచాడు.

మార్గం అంతా చిన్నా పెద్ద రాళ్లతోనూ, ముళ్లపొదలతోనూ నిండి వున్నది. అక్కడక్కడా ఆకాశాన్నంటుతున్న మహావృక్షాలు వున్నవి. ఆ ప్రాంతాల తిరుగాడే మృగాలూ పక్షులూ చేసే కలకలనాదం చంద్రవర్మకు స్పష్టంగా వినబడుతున్నది. కాని పూర్వంలా కాకుండా యిప్పుడా ధ్వనులలో అతడికి అవి మాట్లాడుకునే మాటలు అర్థం అవుతున్నవి. ఏదో ఒక కొత్తజీవి తమ నివాస ప్రాంతాలలో తిరుగాడుతున్నట్టుగా అవి ఒకదాని నొకటి హెచ్చరించుకుంటున్నవి.

సూర్యుడు నడినెత్తినుంచి పడమటికి వాలేవరకూ చంద్రవర్మ సూటిగా ఉత్తరపు దిక్కుకేసి నడిచాడు. ఆసరికి అతడికి ఆయాసంతోపాటు, ఎక్కడలేని ఆకలీ పుట్టుకొచ్చింది. అతడు ఒక పెద్ద చెట్టునీడకు వెళ్లి దాని బోదెకు నడుంవాల్చి కూర్చుని చుట్టూ కలయచూశాడు. కనుచూపుమేరలో ఎక్కడా ఫలవృక్షాలు వున్న సూచనలులేవు.



ఏవైనా దుంపలూ, కందమూలాలూ తిని కడుపు నింపుకోటానికైనా అక్కడ ముళ్ల పొదలూ, రాళ్లగుట్టలూ తప్ప మరేమీ కనిపించలేదు.

"అక్కడ కాలం వృథాచెయ్యి లాభం లేదు. ఇంకా మరికొంత ముందుకు వెళితే, ఎక్కడైనా ఫలవృక్షాలు కనబడవచ్చు." అనుకుంటూ చంద్రవర్మ చెట్టునీడనుంచి లేచి బయలుదేరాడు. అతడు కొంతదూరం నడిచి ఒక పెద్దరాయి మలుపు తిరిగేసరిగి ఎదురుగా ఫలభారంతో వంగిపోయిన అనేక వృక్షాలు కనిపించాయి. చంద్రవర్మకు ఎక్కడ లేని ఆనందం కలిగింది. అతడు





చిన్నచిన్న రాళ్లనూ, ముళ్లపొదలనూ తప్పుకుంటూ వేగంగా ముందుకు నడిచాడు. ఒకటిరెండు నిమిషాలు గడిచేసరికి శరీరాన్ని ఏవో వేడిగాడ్పులు తాకినట్టయింది. చంద్రవర్మ ఆశ్చర్యపడుతూ మరికొంత ముందుకు వెళ్లాడు. అతడు నిలబడివున్నచోటుకు దిగువగా ఒక పెద్దవాగు కళపెళలాడుతూ వేడి పొగలు వెదలగ్రక్కుతూ ప్రవహిస్తున్నది.

చంద్రవర్మ ఆ వింతవాగును చూస్తూనే నిర్విణ్ణుడయాడు. ఎక్కడో అగ్నిపర్వతం నుంచి ఆ వేడినీరు ప్రవాహం కట్టి వేడిగాడ్పులు వెదజల్లుతూ జాలువారుతున్నదని అతడు గ్రహించాడు. తను ఆకలికి మాడి చావకుండా వుండాలంటే, ఎట్టి పరిస్థితులలోనైనా తను యీ వేడినీటి వాగును దాటక తప్పదు. ఫలభారంతో వంగివున్న వృక్షాలన్నీ వాగుకు అవతలి ఒడ్డున వున్నవి.

ఏమి చేయటమా అని చంద్రవర్మ ఆలోచించేంతలో ఒక మహాసర్పం మిట్టగా వున్న ప్రదేశాన్నుంచి నిలువునా తాడిచెట్టులా లేచి తలభాగం వాగుకు అవతల పడేలా వాలింది. తరవాత తలతో ముందుకు పాకుతూ, తోకను కొంచెం కొంచెంగా కదిలిస్తున్నది. ఆదే సమయంలో నాలుగైదు కోతులు కిచకిచమంటూ చెట్లమీదినుంచి దిగి, వాగుకు అడ్డంగా తాగాడిలా వున్న సర్పంమీదినుంచి నడిచి, అవతలివైపుకు పరిగెత్తినై.

తను ఈ వేడినీటి వాగును దాటాలంటే, ఆ కోతులలాగే సాహసించి, ఆ పెనుపాము వెన్నుమీదుగా అవతలికి పరిగెత్తవలసి వుంటుందని చంద్రవర్మ గ్రహించాడు. ఆ ప్రయత్నంకూడా పాము తన శరీరాన్ని అవతలి ఒడ్డుకు లాక్కోకముందే చేయాలి. ఇలా అనుకుంటూ చంద్రవర్మ వున్నచోటు నుంచి కదిలి ఒక్క వురుకున పాము వున్న చోటుకు వెళ్లి, దాని వెన్నుమీదుగా అవతలి ఒడ్డుకు పరిగెత్తసాగాడు.

—(ఇంకా వుంది)






## 9

[ చంద్రవర్మ, కాపాలిని దగ్గిర సెలవుతీసుకుని ఉత్తరదిక్కుగా బయలుదేరాడు. అడవి దాటేందుకు దారి చూపుతూ కాలసర్పం ముందు నడవసాగింది. ఒక వాగు పక్కన వింతవృక్షం ఒకటి చంద్రవర్మకు కనిపించింది. దానికి వేలాడుతున్న ఒక పండును కోసుకు తినగా అతడికి పశుపక్ష్యాదుల భాషలు తెలిసిపోయినై. మరికొంత ముందుకు వెళ్ళి ఒకానొక వేడినీటి ప్రవాహాన్ని చూసి, దానిని ఆ సమయంలో దాటిపోతున్న ఒక మహా సర్పం వెన్నుమీదుగా చంద్రవర్మ అవతలి ఒడ్డుకు పరిగెత్తసాగాడు. తరవాత—]

చంద్రవర్మ సర్పం వెన్నుమీదుగా పరిగెత్తుతూ ప్రవాహంమధ్యకు చేరేసరికి కళపెళలాడుతున్న నీటినుంచి వెచ్చని ఆవిరి అతణ్ణి చుట్టుముట్టి ఉక్కిరిబిక్కిరి చేసింది. తను ధరించిన దుస్తులు మండుతున్నవా అన్న అనుమానంకూడా అతడికి కలిగింది. ప్రవాహ వేగానికి లేచిన కొన్ని అలల నుంచి వేడినీటి తుంపరలు అతడి మీద పడినై. తను స్పృహ కోల్పోయి కింద నీటిలో పడిపోతున్నానేమో అని చంద్రవర్మ కళవెళపడ్డాడు. కాని, యింత భయంలోనూ, ఆదుర్దాలోనూకూడా అతడు ముందుకు పరిగెత్తుతూనే వున్నాడు. అతడి దృష్టి తనకన్న ముందుగా పరిగెత్తుతున్న కోతులమీదే లగ్నమైవుంది. కొంతసేపటికి అతడి కళ్లకు నేల కనిపించింది. చంద్రవర్మ ఒక్క ఎగురున సర్పం మీదినుంచి కిందికి దూకి చెట్లకేసి పరిగెత్తాడు.









కొద్దిక్షణాల కాలంలో జరిగిపోయిన యీ వింత అనుభవం, చంద్రవర్మను ఆపాదమస్తకం కంపింపచేసింది. అతడు రొప్పుతూ, ఆయాసపడుతూ ఒక చెట్టు బోదెను అనుకుని మహాసర్పం వున్న చోటు కేసి చూశాడు. అది యింకా వాగును దాటుతూనే వున్నది. దానికి తన వెన్నుమీదుగా పరిగెత్తిన కోతులను గురించిగాని చంద్రవర్మను గురించిగాని తెలిసినట్టే లేదు. పది పన్నెండడుగుల వ్యాసం గల దాని నల్లని తల చంద్రవర్మకు చెట్లలో కొంత దూరాన కనిపించింది. ఎర్రగా నిప్పుకణాల్లా వున్న దాని రెండు కళ్లు చూసి చంద్రవర్మ వణికిపోయాడు. ఒకవేళ దాని దృష్టి తనమీద పడటం జరిగితే, తను ప్రాణాలతో బయట పడటం అసంభవమని అతడు నిశ్చయించుకున్నాడు. కాని, అదృష్టవశాత్తూ ఆ మహా సర్పం తన తలను చంద్రవర్మకేసి తిప్ప లేదు. కొద్దిసేపటి తరవాత దాని తల చెట్లలో మరుగుపడిపోయింది. శరీరభాగం మాత్రం మెల్లిగా ముందుకు జరిగిపోతున్నది.

సర్పం దృష్టి యిక తనమీద పడే అవకాశం లేదని తేల్చుకున్న తరవాత చంద్రవర్మ ధైర్యంగా ముందుకు వచ్చి తాటి బొండులా వున్న దాని శరీరాన్ని పరీక్షగా చూడసాగాడు. దాని శరీరం నూనె పూసినట్టుగా నిగనిగలాడుతున్నది. శరీరానికి కవచంలా అరచేతి వెడల్పున పొలుసులు వున్నవి. బహుశా తను కత్తితో బలంగా పొడిచినా, కత్తి మొక్కపోవటం తప్ప, సర్పం శరీరంలోకి అది దిగటం సాధ్యం కాదని అతడు తేల్చుకున్నాడు. కాని, మరుక్షణానే అతడికి అలా కత్తితో దాని శరీరాన్ని పొడిచి చూడాలనిపించింది. చంద్రవర్మ ఒరనుంచి కత్తిని దూసి సర్పాన్ని బలంగా ఒక పోటు పొడిచాడు. ఖంగుమనే శబ్దం వచ్చింది. సర్పానికి ఆ కత్తిదెబ్బ చీమ కుట్టినట్టయినా లేదు.












చంద్రవర్మ మరింతగా ఆశ్చర్యపోతూ చుట్టూ కలయచూశాడు. ఫలభారంతో వంగివున్న చెట్లను చూసేసరికి ఆతడికి తన ఆకలి సంగతి జ్ఞాపకం వచ్చింది. వెంటనే ఆతడు కత్తిని ఒరలో పెట్టి దాపులవున్న ఒక చెట్టుమీదికి గబగబా పాకాడు. ఆతడు చెట్టుకొమ్మనుంచి ఒక మామిడిపండును కోసి నోట పెట్టుకోబోయేంతలో భీతి గొల్పే విధంగా ఒక ఏనుగు ఘీంకరించటం విన బడింది. చంద్రవర్మ చప్పున ఆ ధ్వని వచ్చిన వైపుచూశాడు.

ఆతడి దృష్టికి ఏనుగు కనిపించలేదు. కాని, అల్లంత దూరంలో చెట్లూ పొదలూ పెనుగాలి తాకిడికి అల్లల్లాడుతున్నట్టు వూగిస లాడి పోవటం కనిపించింది. ఆ వెంటనే మరికొన్ని ఏనుగులు ఘీంకార ధ్వని చేయుటం, పెద్ద పెద్ద చెట్టుకొమ్మలు ఫెళ ఫెళా విరిగిన శబ్దం వినపడటం జరిగింది.

చంద్రవర్మ తను వున్న చెట్టుకొమ్మనుంచి చకచకా పాకి చిటారుకొమ్మకు పోయి, ఆ ధ్వనులు వస్తున్న వైపుకు తల తిప్పాడు. ఆతడి కంటబడిన దృశ్యం ఎంత ధైర్యశాలి లోనైనా భీతిని రేకెత్తించేలా వుంది.

వేడినీటి ప్రవాహాన్ని దాటిన మహాసర్పం ఒక ఏనుగును తన శరీరంతో చుట్టబెట్టి దాన్ని మింగేందుకు పెద్దగా నోరు తెరిచి, ఏనుగు తలను ఒడిసి పట్టుకోబోతున్నది. ప్రాణాపాయ స్థితిలో వున్న ఏనుగు సర్పం పట్టునుంచి బయటపడేందుకు ఘీంకారం చేస్తూ పెనుగులాడుతున్నది. దాని చుట్టూ చేరిన కొన్ని ఏనుగులు భీతితో చెవులు రిక్కించి, తొండాలను ఆకాశంకేసి ఎత్తి, అటూయిటూ దిమ్మగా పరిగెత్తుతూ ఘీంకార ధ్వనులు చేస్తున్నవి. వాటి కాళ్లకింద పడి, శరీరాల రాపిడికి విరిగి అనేక వృక్షాలు పెటపెటమంటూ కూలిపడుతున్నవి. మహా సర్పం మాత్రం తన చుట్టూ జరుగుతున్న ఈ భీభత్సాన్ని, రణగొణ ధ్వనులనూ







విన్నట్టే లేదు. అది తన శరీరాన్ని ఏనుగు చుట్టూ మరింత బిగువుగా పెనవేస్తూ, క్రమంగా ఏనుగు తలను గుహలాంటి తన నోటిలోకి లాగుకుంటున్నది.

"ఈశ్వరా, నేను మహా భయంకరమైన మరేలోకంలోనో అడుగుపెట్టాను. ఇక నీవే శరణ్యం," అనుకున్నాడు చంద్రవర్మ మనసులో. ఈ వేడినీటి ప్రవాహానికి చుట్టు పక్కల తను చూస్తున్న వైపరీత్యాలతో పోలిస్తే, కాపాలిని వున్న అడవిప్రాంతం వుద్యానవనంలా వున్నట్టు అతడికి తోచింది. తను యింకా అనేక యోజనాల దూరం నడిచి, మాంత్రికుడైన శంఖుడు వుండే గృహం చేరుకోవాలి. కాని, యీ కొద్దిదూరపు ప్రయాణంలోనే తనకు ఎదురైన వింత అనుభవాలతో చంద్రవర్మ దిగాలుపడిపోయాడు. తనకు ఏ దైవశక్తులో సహాయపడితే తప్ప, లేకపోతే యీ భయంకరారణ్యాల్లో, కొండ కనుమల్లో తను మరణించటం తథ్యమని అతడికి తోచింది.

చంద్రవర్మ యిలాంటి వూహలతో తన ధైర్యసాహసాలనూ, ఉత్సాహాన్ని కోల్పోయి, నీరసంగా చెట్టుకొమ్మల్లోనే సొమ్మసిలిపోయి కళ్లు మూశాడు. అతణ్ణి ఆ క్షణాన ఆకలి దహించటంలేదు. తను నెరవేర్చ పూనిన కార్యం ఎంత దుస్సాధ్యమయిందో అతడికి





తెలిసివచ్చింది. తను మాంత్రికురాలినీ, శంఖుడ్నీ వాళ్ల కర్మకు వదిలి, మరెక్కైనా పోవటం బావుంటుందేమో అనుకున్నాడు. మరుక్షణం ఎక్కడికి పోవటం? అన్న విషమసమస్య తల ఎత్తింది.

చంద్రవర్మ క్రమంగా మగత నిద్రలోకి జారుకున్నాడు. సూర్యుడు అస్తమించటం గాని, ఆ సమయంలో తమ గుహలకూ, గూళ్లకూ, చేరే పశుపక్ష్యాదులు చేసే కల కలారావాలుగాని అతడికి తెలియవు. క్రమంగా చీకటి పడింది. ఆకాశంలో మిల మిల మెరిసే చుక్కలు తప్ప, చంద్రుడు లేడు. గాలి పూర్తిగా స్తంభించిపోయింది.

అలాంటి వాతావరణంలో సరిగా సరి రేయివేళ చంద్రవర్మను హఠాత్తుగా ఝంఝా మారుతం తాకినట్టయి చప్పున కళ్లు తెరవ బోయాడు. కాని, యీలోపలే అతని శరీరం చెట్టుకొమ్మల్లోనుంచి గాలితాకిడికి పైకెగిరి పోవటం అతడు గ్రహించాడు. "నా నూరే ళ్లాయువూ నిండింది!" అని చంద్రవర్మ అనుకునేంతలో అతడు దభీమంటూ గొంగ ళిలా గుచ్చుకుంటున్న ఒకచోట వెల్లికిలా పడిపోయాడు. "రాళ్లమీద పడలేదు, బతికి పోయాను!" అనుకుంటూ చంద్రవర్మ లేవ బోయేంతలో, తను వున్న ప్రదేశం అటూ యిటూ వూగిసలాడటం అతడికి కనిపిం







ఎక్కడ వున్నదీ అర్థమైపోయింది. తను నిద్రిస్తూవుండగా రెండు గండభేరుండపక్షులు తను వున్న చెట్టుదగ్గిరకు వచ్చి వాలినై. వాటి రెక్కల తాకిడికి పుట్టిన గాలివల్ల తను చెట్టు కొమ్మల్లోంచి ఎగిరి ఏ రాళ్లమీదనో పడి చావకుండా అదృష్టవశాత్తూ వచ్చి ఒక గండ భేరుండపక్షి వీపుమీద పడిపోయాడు. ఏనుగు ప్రమాణంలో వున్న ఆ పక్షికి తను బహుశా ఏ చీమగానో దోమగానో తోచి వుండ వచ్చు. కాని, ప్రమాదవశాత్తూ తను ఆ పక్షుల కంటపడటం జరక్కముందే, అక్కడినుంచి మెల్లగా కిందికి దిగి పారిపో వటం మంచిది.

చంద్రవర్మ యిలా ఆలోచించి పక్షి ఈకలలోనుంచి నిశ్శబ్దంగా కిందికి దిగటానికి ప్రయత్నించేంతలో, ఆకాశం మెరిసినట్ల యింది. అతడు తల పైకెత్తాడు. ఆకాశంలో భగభగ మండిపోతూ కాంతులు వెదజల్లే ఒక పక్షి రివ్వుమంటూ తను వున్నచోటుకే దిగుతూండటం అతడి కంటబడింది. తక్షణం అతడికి మాంత్రికురాలు చెప్పిన అగ్నిపక్షి సంగతి గుర్తుకొచ్చింది. ఆ అగ్ని పక్షి మాంత్రికుడైన శంఖుడిది.

అగ్నిపక్షి దిగిరావటం చూస్తూనే, గండ భేరుండ పక్షులు ముక్కులు పైకెత్తి దానికి

చింది. అతడు ఆశ్చర్యపడుతూ పక్కకు చూశాడు. అతడి దృష్టిని రెల్లుదుబ్బుల్లా వత్తుగా వున్న ఏదో ఆటంకపరిచింది. చంద్ర వర్మ తన కళ్లకు అడ్డం వున్నవాటిని చేతితో తాకి చూడబోయేంతలో అతడికి పక్షి ఒకటి మాట్లాడటం వినిపించింది.

"మనం యీరాత్రికి యిక్కడే కాలం గడపటం మంచిది. దగ్గిర్లో వున్న వేడినీట ప్రవాహంనుంచి వచ్చే గాలులు నాకెంతో సంతోషం కలిగిస్తున్నవి," అన్నది పక్షి.

ఆ వెంటనే కొంచెం దాపులనుంచి మరో పక్షి అవునన్నట్టు ధ్వని చేయటం వినిపిం చింది. చంద్రవర్మకు తృటికాలంలో తను







స్వాగతం చెప్పినై. అగ్నిపక్షి నూటిగా కిందికి దిగుతూనే, "మీకోసమే చాలా సేపటినుంచి వెతుకుతున్నాను," అన్నది.

"అలాగా, ఏమిటా పని?" అన్నదొక గండభేరుండ పక్షి.

అగ్నిపక్షి కిందికి దిగి ముక్కుతో రెక్కల నొకసారి సవరించుకుని, "నా యజమాని శంఖుడు నాకొపని ఒప్పచెప్పాడు. అది ఏమంత కష్టమయింది కాదు. జరాభారంతో కుంగి కృశించిపోతున్న ఒకానొక మాంత్రికురాలిని తనవద్దకు తీసుకు రమ్మన్నాడు. కాని, ఆ పని నావల్ల సాధ్యం కావటంలేదు. నేను పగలు చూడలేను. రాత్రివేళ నా వెలుగు చూస్తూనే, నన్ను గుర్తించి ఆ మాంత్రికురాలు ముందుజాగ్రతలు తీసుకుంటున్నది. కనుక, మీరు చడీ చప్పుడూ లేకుండా యీరాత్రి ఆ మాంత్రికురాలిని ముక్కున కరుచుకుని, నా యజమాని దగ్గిరకు తీసుకువస్తే, నేను మీకు సర్వదా కృతజ్ఞురాలినై వుంటాను," అన్నది.

ఆ మాటలు వింటూనే గండభేరుండ పక్షులు ఉస్సురస్సురన్నవి. "మేము యీ రాత్రికి ఒక్క యోజన దూరంకూడా ఎగరలేం. సూర్యాస్తమయం మొదలు యిప్పటి వరకూ సముద్రాల్లోని ఎన్నోదీవులు తిరిగి




పొట్ట నింపుకుని, రెక్కల నొప్పులు పోయేందుకు యీ ఉష్ణప్రవాహపు వాయువులదగ్గిర చేరి కునికిపాట్లు పడుతున్నాం. రేపురాత్రికి నీవు కోరిన సహాయం చెయ్యగలం," అన్నవి.

అగ్నిపక్షి సంతోషంగా రెక్కలు రెపరెపలాడించి, ఆ ప్రాంతమంతా మార్మోగేలా పెద్ద కేక పెట్టింది.

"పట్టపగలు ఆ మాంత్రికురాలిని దొరకపుచ్చుకోవటం సాధ్యమయే పనికాదు. అది మహా జిత్తులమారి. పైగా దానిదగ్గిర మహా బలవంతులైన సేవకులుకూడా కొందరున్నారు. ఎన్నో ఏళ్లుగా ఆ మాంత్రికురాలు రాత్రివేళ కూడా కన్ను మూయకుండా







బతుకుతూ వచ్చింది. కాని, ఆ మధ్య దానికి దేహారోగ్యం చెడటంతో, లోగడ వున్నంత మెలకువగా వుండటం లేదు. మీరు చీకటిమాటున పొంచివుండి, హఠాత్తుగా మీదపడి ముక్కుతో దాని కంఠాన్ని అడకత్తెరలోలాగా పట్టుకోగలిగారంటే, అది మంత్రోచ్చారణ చేయలేదు గనక, మీకు ఎలాంటి హాని కలిగించలేదు. ఆ తరవాత మీరు సరాసరి నా యజమాని శంఖుడు వుండే కొండదగ్గిరకు వచ్చి, ఆ మాంత్రికురాలిని ఆతడి పాదాల ముందు పడవేస్తే— దానికి తగిన శిక్ష, మీ యిద్దరికీ తగిన ప్రతిఫలం ఆతడు తప్పక యిచ్చుకుంటాడు," అన్నది అగ్నిపక్షి.

"నాకు నీ యజమాని మరేమంత పెద్ద ప్రతిఫలం ముట్టచెప్పనవసరం లేదు. ఇచ్ఛామాత్రాన సప్తసముద్రాల్లోని అన్ని దీవులకూ పోగలిగే శక్తినిస్తే చాలు," అన్నది ఒక గండభేరుండపక్షి.

"నాకు అంత పెద్ద ఆశ లేదు. చావనేది లేకుండా చేయగలిగిన మంత్రం ఏదైనా వుపదేశిస్తే చాలు," అన్నది రెండవ పక్షి.

"ఈ పిచ్చిపక్షులు రెండూ మాంత్రికుడైన శంఖుణ్ణి దేవుడనుకుంటున్నట్టుంది!" అనుకుని చంద్రవర్మ నవ్వుకున్నాడు.

గండభేరుండపక్షులు అడిగినదానికి అగ్నిపక్షి అవుననీ కాదనకుండా తలాడించి, "రేపు పగటివేళ నా నివాసానికి ఒకసారి రాగలరా? వీలయితే నా యజమానినికూడా మీకు చూపెడతాను," అన్నది.

గండభేరుండపక్షులు సరేనన్న సూచనగా తలలాడించినై. మరుక్షణం అగ్నిపక్షి రివ్వుమంటూ ఆకాశంలోకి ఎగిరి మహావేగంతో ఉత్తరదిక్కుకేసి వెళ్ళిపోయింది. గండభేరుండపక్షులు కొంచెంసేపు ఆ సంగతీ యీ సంగతీ మాట్లాడుకుని ముక్కులను భూమికానించి నిద్రలోకి జారుకున్నవి.

—(ఇంకా వుంది)








## 10

[వేడినీటి ప్రవాహాన్ని దాటుతూన్న మహాసర్పం వెన్నుమీదుగా నడిచివెళ్ళి చంద్రవర్మ పండ్లతోటను చేరుకున్నాడు. చీకటి పడిన తరవాత చెట్టుకొమ్మల్లో నిద్రిస్తున్న అతడు గండభేరుండ పక్షులు రేపిన గాలికి, అక్కడినుంచి ఎగిరివచ్చి, ఒక పక్షి వెన్నుమీద పడిపోయాడు. ఒక రాత్రివేళ అగ్నిపక్షి అక్కడికి వచ్చి, గండభేరుండ పక్షులను, మంత్రగత్తె కాపాలినిని శంఖుడి దగ్గిరకు తేవలసిందిగా కోరింది. అవి అంగీకరించాయి. —తరవాత]

అగ్నిపక్షి గండభేరుండపక్షులతో జరిపిన సంభాషణ అంతా అతి శ్రద్ధగా విన్న చంద్రవర్మకు ఎక్కడలేని ఆనందమూ కలిగింది. కాలనాగు సహాయంవల్ల తను వింతవృక్షం నుంచి పండు కోసుకుతినటంవల్లనే, తన కీనాడు పక్షుల భాష తెలియటం సంభవించింది. అందువల్ల తను నూరు యోజనాల దూరంలో వున్న శంఖుడిని చేరటానికి కాలి నడకను బయలుదేరి నానా ప్రమాదాలకూ లోనుకాకుండా, యీ గండభేరుండపక్షి ఈకలలో దాక్కుని సునాయాసంగా అక్కడికి చేరవచ్చు.

అనుకోకుండా తనకు పట్టిన యీ అదృష్టాన్ని తలుచుకుని చంద్రవర్మ ఎంతో పొంగిపోయాడు. ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు గండభేరుండ పక్షులతోపాటు తాను కూడా నూరు యోజనాల దూరం ఎగిరి శంఖుడు వుండే కొండ చూస్తానా అని అతడు







ఆత్రపడసాగారు. కాపాలినిని చేజిక్కించుకునేందుకు శంఖుడు ప్రయోగించనున్న కపటోపాయం తప్పక వమ్ము కాగలదని అతడు భావించాడు. కాపాలిని అంత అమాయకురాలు కాదు. బహుశా ఆమె తనను పట్టవచ్చిన గండభేరుండ పక్షులను కాలసర్పానికి ఆహారంగా వేసితీరుతుంది.

చంద్రవర్మ యిలాంటి ఆలోచనలతో సతమతమవుతూండగానే భళ్ళున తెల్లవారింది. గండభేరుండ పక్షులు సూర్యకిరణాలు మీద పడగానే కళ్ళుతెరిచి, రెక్కలల్లల్లాడించి గాలిలోకి లేచినై. పక్షి వెన్నుమీది ఈకలలో దాగివున్న చంద్రవర్మ అవి ఉత్తరదిక్కుకేసి పోతున్నట్టు గ్రహించి చాలా ఆనంద పడ్డాడు. చూస్తూండగానే కొండలూ, నదులూ, అడవులూ దాటి గండభేరుండ పక్షులు ఒకానొక కొండను సమీపిస్తున్నవి. వాటి సంభాషణనుపట్టి ఆ కొండ శంఖుడు వుండేదని చంద్రవర్మ గ్రహించాడు.

హఠాత్తుగా చంద్రవర్మ దాగివున్న గండభేరుండపక్షి కిందికి చూసి, రెండవ పక్షితో, "మిత్రమా, ఈ సరస్సు చూశావా? అదుగో! ఏనుగంత లావున్న మొసలి! మొసలి మాంసం తిని చాలా రోజులైంది!" అంటూ చటుక్కున సూటిగా కిందికి తిరిగి బాణంలా నిలువునా సరస్సుకేసి దూకింది.








ఇంత హఠాత్తుగా తను వున్న గండభేరుండపక్షి కిందికి వాలేసరికి చంద్రవర్మ తబ్బిబ్బయిపోయి తను పట్టుకున్న ఈకలను వదిలివేశాడు. మరుక్షణం ఆతడు పక్షి మీదినుంచి పక్కకు దొర్లి, తలకిందులుగా గాలిలో తేలిపోతూ వేగంగా సరస్సులోకి పడసాగాడు.

చంద్రవర్మ తన వీపుమీదినుంచి జారి సరస్సులోకి పడిపోతూండటం గండభేరుండ పక్షికి తెలియదు. అది తన దృష్టిని నీటి మీద తేలుతూన్న పెద్ద మొసలి వైపుకు కేంద్రీకరించింది. చంద్రవర్మ దృష్టికూడా ఆ మొసలికేసే ప్రసరించింది. తను గండభేరుండపక్షికో లేక సరస్సులోని మొసలికో ఆహారం అయిపోతానని ఆతడు నిశ్చయించుకుని ఆపాదమస్తకం వణికిపోసాగాడు. ఇంతలో సరస్సులోనుంచి పెద్ద జలధార ఒకటి తాడిచెట్టు ప్రమాణంలో ఆకాశంకేసి లేచింది. దభీమంటూ నీట పడిపోతూన్న చంద్రవర్మ తల పక్కకు తిప్పి అటుకేసి చూశాడు. గండభేరుండపక్షి దిక్కులు పిక్కటిల్లేలా పెద్దగా కేకవేస్తూ పైకి ఎగిరిపోతున్నది. దాని గోళ్లమధ్య మొసలి విలవిలా తన్నుకుంటున్నది.

చంద్రవర్మ యీ దృశ్యాన్ని కనురెప్పపాటు కాలం మాత్రమే చూడగలిగాడు.










చంద్రవర్మ ప్రాణాపాయంనుంచి బయట పడ్డాననే ధైర్యంతో గబగబా యీదుకుంటూ సరస్సు ఒడ్డుకేసి పోసాగాడు. ఆ సరస్సు ఒడ్డున గుబురుగా పెరిగిన చెట్లు వున్నవి. ఒకసారి తను ఆ ప్రాంతాన్ని చేరుకుంటే, మాంత్రికుడైన శంఖుడి భృత్యుల కంట పడకుండా దాక్కోవచ్చునని అతడు భావించాడు.

ఇంకా ఒడ్డు అరవై మూడైదు గజాల దూరం వుండగా, చంద్రవర్మకు అల్లంత దూరంలో నీరు అల్లకల్లోలం అవటం కనబడింది. ఆ వెంటనే పెద్దగా నోరు తెరిచిన ఒక మొసలి తోకతో నీటని చిందరవందర చేస్తూ వేగంగా అతడికేసి రాసాగింది.

చంద్రవర్మ ఒక్క తృటికాలం స్తంభించి పోయాడు. శరీరం రాయికట్టినట్టు నీట అడుగుకు గుంజుకుపోసాగింది. మరుక్షణం అతడు భీతితో కెవ్వుమని కేకపెట్టి ఎక్కడ లేని సత్తువా తెచ్చుకుని, ఒడిసెల నుంచి విసిరిన రాయిలా దూసుకుంటూ పోయి ఒడ్డుమీద పడ్డాడు.

అతణ్ణి అప్పడంముక్కలా నమిలి మింగ దలచిన మొసలి కొంచెం ఆలస్యంగా ఒడ్డు చేరింది. కాని, యీలోపలే చంద్రవర్మ నీటిలోనుంచి లేచి గుబురుచెట్లలోకి పరి

మరుక్షణం అతడు సరస్సులో బుడుంగు మంటూ మునిగిపోయాడు. కొద్దిసేపటి తర వాత అతడు తెప్పరిల్లి నీటిపైకి లేస్తూ, సరస్సుకేసి చూసేసరికి చిన్నా పెద్ద మొసళ్లు కొన్ని చెల్లాచెదరుగా యీదుకుంటూ పారి పోవటం కనిపించింది.

అదీ ఒకవిధంగా నా మేలుకే జరిగింది, అనుకున్నాడు చంద్రవర్మ. గండభేరుండ పక్షులను చూసిన భయంలో మొసళ్లు ఆ ప్రాంతాన్నుంచి పారిపోతున్నవి. అలా కాక పోతే యీసరికి అవి తనను చుట్టుముట్టి, చెయ్యా, కాలూ, తలా దొరకపుచ్చుకుని తన శరీరాన్ని ఛిన్నాభిన్నం చేసివుండేవి.











గెత్తాడు. మొసలి ఆతడు పరిగెత్తిన వైపుకే కోరలు చాస్తూ కొంచెంసేపు చూసి, నిరాశతో తలను నీట ముంచి యీదుకుంటూ సరస్సు మధ్యకు వెళ్లిపోయింది.

చంద్రవర్మ ఆయాసంతో రొప్పుతూ ఒక చెట్టుబోదెకు ఆనుకుని కొంచెంసేపు విశ్రమించాడు. తరవాత ఆతడికి తన కత్తి సంగతి గుర్తుకొచ్చింది. గండభేరుండపక్షి మీదినుంచి సరస్సులోకి పడిపోయినప్పుడు, తను దానిని పోగొట్టుకున్నానేమో అని ఆతడు భయపడ్డాడు. ఆవెంటనే ఆతడు తన ఒరకేసి చూసుకున్నాడు. ఒరనుంచి కత్తి కొంచెం బయటికి వచ్చివున్నది. చంద్రవర్మ కత్తిని బయటికి లాగి ఒరలో చేరిన నీటిని కింద పారపోసి, తృప్తిగా కత్తిని తిరిగి ఒరలో పెట్టాడు.

"ఇంతవరకూ నేను అదృష్టవంతుణ్ణే. నూరు యోజనాల దూరం మార్గప్రయాస లేకుండా అధిగమించగలిగాను. సరస్సులో పడి మొసళ్లకు ఆహారం కాకుండా బయటపడ్డాను. ఆత్మరక్షణకు ఉపకరించే ఒకే ఒక ఆయుధం—నా కత్తిని జారవిడుచుకోలేదు. ఇక యిప్పుడు కర్తవ్యం?" అనుకుంటూ చంద్రవర్మ లేచి నిలబడి కొంచెం దూరం నడిచి గుబురుచెట్లను జాగ్రత్తగా పక్కకు వత్తిగించి దృష్టిని ముందుకు సారించాడు. ఎదురుగా—బహుసమీపంలో ఒక ఎత్తయిన కొండ. ఆ కొండశిఖరం మొన తేలినట్టు, బొంగరం ముక్కులా వున్నది. అది అక్కడినుంచి దిగువకు కొంచెం కొంచెమే పరుచుకుపోతూ, సమతలాన్ని చేరేసరికి చాలా వెడల్పుగా తయారైంది. దూరంనుంచి చూస్తే ఆ కొండ తలకిందులుగా పెట్టిన బొంగరంలా కనబడుతున్నది.

"ఇది మాంత్రికుడైన శంఖుడు వుండే కొండ. నేను దాని దాపులకు చేరాను. నాక్కావలసింది ఆ మాంత్రికుడి పూజాగృహంలో వున్న అపూర్వశక్తులు గల











శంఖం. ఆ శంఖం ఒక నాగుబాము మెడలో వేలాడుతూ వుంటుంది. ఆ నాగుబాము గోడకు వున్న ఒక మేకుకు వేలాడుతూ వుంటుంది. నేను ఆ శంఖాన్ని తస్కరించి కాపాలినికి యివ్వాలి. భేష్, యింతవరకూ అంతా సవ్యంగానే వున్నది. ఆ శంఖాన్ని చేజిక్కించుకోవటం ఎలా?"

చంద్రవర్మ యీవిధంగా లోలో కొంత సేపు మథనపడి పెద్దగా నిట్టూర్చాడు. కాపాలినికి మాట యిచ్చి అతడు శంఖుడు వుండే కొండప్రాంతానికి బయలుదేరినప్పుడు, అతణ్ణి బాధించిన సమస్య ఒక్కటే — అది నూరు యోజనాలు నడిచి ఆ కొండను చేరటం ఎలానా అని. కాని, తీరా యిప్పుడు ఆ కొండను చేరింతరవాత, ఆ శంఖాన్ని చేజిక్కించుకోవటం ఎలా సాధ్యమవుతుందా అన్న సమస్య అతణ్ణి బాగా కలవరపరచసాగింది.

చంద్రవర్మ యిలాంటి తెగని సమస్యలతో కిందుమీదవుతూండగా హఠాత్తుగా అతడి కర్ణపుటాలు బద్దలయేలా పెద్ద కేక వినబడింది. చంద్రవర్మ ఉలిక్కిపడ్డాడు. అంతలో భీతి కొల్పే ఆ కేక మరోసారి వినిపించింది. ఈసారి చంద్రవర్మ ఆ కేక ఎవరిదో గుర్తించాడు. ఆ చుట్టుపక్కల వున్న చెట్లగుంపుల్లోనుంచే ఆ కేక వినవస్తున్నది. అది అగ్నిపక్షి వేసే కేక. గత రాత్రి అది గండభేరుండ పక్షులతో మంతనాలాడి తీరా ఎగిరిపోయే ముందు అలాగే కేకపెట్టింది.

ఇప్పుడు తను మాంత్రికుడైన శంఖుడి నివాసప్రాంతాల వున్నానని, అతడి సేవకుల నుంచిగాని, లేక అతడి నుంచిగాని తనకు కీడు కలిగే అవకాశం వున్నదని చంద్రవర్మ గ్రహించాడు. ఆవెంటనే అతడికి అగ్నిపక్షికి పగటివేళ కళ్లు కనబడవన్న సంగతి గుర్తుకొచ్చింది. అందువల్ల తనకు దాని నుంచి ప్రమాదం వచ్చే అవకాశం







లేదు. కాని, శంఖుడి యితర భృత్యుల మాటేమిటి?

చంద్రవర్మ యిలాంటి భయాలతో కొంచెంసేపు బాధపడి, చివరకు మొండి ధైర్యం తెచ్చుకున్నాడు. తను తగిన జాగరూకతతో వుండటం తప్ప, ఎప్పుడో రానున్న ప్రమాదాన్ని గురించి యిప్పటినుంచే దిగులుపడటం వృథా అని తేల్చుకున్నాడు. ఆవెంటనే అతడి మనసులో ఎక్కడలేని ధీమా, శరీరంలో ఎక్కడలేని సత్తువా పరవళ్లు తీసింది.

చంద్రవర్మ తను వున్న తోటలో అక్కడా యిక్కడా వెతికి తనకు నచ్చిన పండ్లూ ఫలాలూ కోసుకు తిని, సరస్సులోకి ప్రవహిస్తున్న ఒక సెలయేటిలో తియ్యని నీరు తాగాడు. తరవాత అతడు గుబురుగా వున్న ఒక చెట్టుమీదికి ఎక్కి ఆ కొమ్మలా రెమ్మల చాటున తృప్తిగా పడుకుని, ఎప్పుడు చీకటి పడుతుందా అని ఆదుర్దాగా ఎదురుచూడసాగాడు. చీకటి పడిన తరవాత మాత్రమే తను శంఖుడు వుండే కొండ ఎక్కటం క్షేమకరమని అతడు నిర్ణయించుకున్నాడు.

ప్రయాణ బడలికవల్లా, మితిలేని ఆదుర్దావల్లా చంద్రవర్మకు కొద్దిసేపటికే చెట్టు కొమ్మల్లో నిద్ర పట్టిపోయింది. సూర్యుడు ఆకాశం మధ్యకు వచ్చినప్పుడు



కూడా వత్తుగా వున్న చెట్టు ఆకుల చాటున వుండటంవల్ల ఆతడిమీద ఎండ పొడ పడ లేదు. ఆ కారణంవల్ల సూర్యాస్తమయమై క్రమంగా చీకటి కమ్ముకున్నా, ఆతడు యింకా మైమరచి నిద్ర పోతూనేవున్నాడు.

హఠాత్తుగా ఒక రాత్రివేళ చంద్రవర్మ ఉలిక్కిపడి కళ్లు తెరిచాడు. చుట్టూ కటిక చీకటి. సమీపంలోని సరస్సునుంచి చిన్న చిన్న ధ్వనులు వినిపిస్తున్నవి. గాలితాకిడికి తోటలోని చెట్లకొమ్మలు ఒకదాని కొకటి ఒరుసుకుని కిర్రుకిర్రుమంటూ శబ్దిస్తున్నవి. ఎక్కడా మనుష్య సంచారం లేదు.

"బాగా పొద్దు పోయినట్టున్నది. అదే మంచి అదను. కొండ ఎక్కి శంఖుడి మంత్రగృహం సంగతేమిటో తేల్చుకుంటాను," అనుకుంటూ చంద్రవర్మ చెట్టు మీదినుంచి దిగి ఒకసారి వొళ్లు విరుచుకుని, ఒరలోని కత్తికేసి ఓమారు చూసుకుని బయలుదేరాడు.

చంద్రవర్మ చీకటిలో నేలబారుగా వున్న చెట్లకొమ్మలనూ, చిన్నచిన్న పొదలనూ జాగ్రత్తగా తప్పుకుంటూ కొండకేసి కొంత దూరం నడిచాడు. ఆతడి కళ్లు ఆ గాఢాంధ కారంలో అగ్నిపక్షి కోసం వెతుకుతున్నవి. తనకు ముందుగా రానున్న ప్రమాదం దాని నుంచే అని ఆతడికెందుకనో అనుమానంగా వున్నది. ఆ పక్షిగాని ఈసమయంలో, ఆ చాయల లేకుండావుంటే, తను సురక్షితంగా శంఖుడి మంత్రగృహంలో ప్రవేశించగల నన్న నమ్మకం ఆతడికి కలిగింది.

చంద్రవర్మ కొండ అడుగును సమీపించ బోతున్నంతలో, ఆతడికి దాపులనే వున్న ఒక ప్రదేశంనుంచి చిన్న మూలుగూ, ఆ వెంటనే, "వర్మా!" అన్న సన్నని పిలుపూ వినిపించినై. చంద్రవర్మ ఆ గొంతు ఎవరిదో చప్పున గ్రహించాడు. ఆతడు, "కాపాలినీ!" అంటూ ఆ పిలుపు వచ్చిన వైపుకు వేగంగా నడిచాడు. —(ఇంకా వుంది)








## 11

[గండభేరుండపక్షి రెక్కలలో దాగివున్న చంద్రవర్మ, పట్టుతప్పి సరస్సులో పడిపోయాడు. తరవాత అక్కడ మొసళ్ల బారినుంచి తప్పుకుని, సరస్సు ఒడ్డునే వున్న తోటలోకి చేరాడు. ఒక రాత్రివేళ, మాంత్రికుడైన శంఖుడు వున్న కొండ ఎక్కబోతున్న చంద్రవర్మకు, కొండ దిగువ వున్న రాళ్లగుట్టల్లో మాంత్రికురాలైన కాపాలిని కనిపించింది. తరవాత—]

రెండు కొండరాళ్ల నడుమ మూలుగుతూ, నీరసంగా పడివున్న కాపాలినిని చూస్తూనే, చంద్రవర్మ నివ్వెరపోయాడు. అగ్నిపక్షి, గండభేరుండ పక్షులతో మాట్లాడిన సంగతి వెంటనే అతడికి గుర్తుకొచ్చింది. కాపాలిని గండభేరుండ పక్షులకు చిక్కి, వాటివల్ల ఈ శంఖుడి కొండప్రాంతానికి తేబడిందని అతడు గ్రహించాడు.

"కాపాలినీ, నీకు ప్రాణాపాయం కలిగించే దెబ్బలేమీ తగులలేదుకదా? ఆ గండభేరుండపక్షులెక్కడ?" అని అడిగాడు చంద్రవర్మ ఆదుర్దాగా.

కాపాలిని చిన్నగొంతుతో, "వర్మా! అంత పెద్దగా మాట్లాడకు. మనం యీ దాపుల వున్న ఏదైనా గుహ చేరటం మంచిది. అక్కడ అన్ని విషయాలూ చెపుతాను. నాకు ప్రాణాపాయమేమీ లేదు. కొంచెం చేయి సాయం యిస్తే లేచి నడవగలను," అన్నది.

చంద్రవర్మ, కాపాలిని పక్కన వంగి కుడిచేతితో ఆమె భుజం పట్టుకుని, ఆమె








లేచి నిలబడేందుకు సాయపడ్డారు. తర వాత కాపాలిని చంద్రవర్మ చేతిని ఆసరాగా పట్టుకుని నడుస్తూ, "వర్మా! ఆ వెదురు పొదల చాటున ఏదో గుహలా కనిపిస్తున్నది. అక్కడికి వెళదాం పద," అన్నది.

చంద్రవర్మా, కాపాలినీ చిన్న చిన్న రాళ్లను ఎక్కి దిగుతూ కొద్దిసేపటికల్లా, కొండపాదంలో వున్న ఒక చీకటి గుహను చేరారు. ఆ గుహద్వారం చాలా యిరుకైనది. దానిని అన్నివైపులా కప్పుతూ వెదురు పొదలూ, అడవిమొక్కలూ దట్టంగా పెరిగి వున్నవి. గుహ లోపలమాత్రం విశాలంగా వున్నది. గుహ పైభాగంలో వున్న రాతి పగుళ్లనుంచి సన్నని గుడ్డివెలుగు అక్కడా యిక్కడా ప్రసరిస్తున్నది.

కాపాలిని గుహకు ఒక మూలగా చేరగిల బడి కూర్చోగానే, చంద్రవర్మ ఆమెతో, "కాపాలినీ! నువ్వు యీ కొండప్రాంతాలకు తేబడినట్టు మాంత్రికుడైన శంఖుడికి తెలుసా?" అని అడిగాడు.

కాపాలిని చిరునవ్వు నవ్వింది. ఆమెలో ప్రాణభీతి ఏ కోశానా వున్నట్టు లేదు.

"వర్మా! నేను యీ కొండప్రాంతాన వున్నట్టు తెలిస్తే, శంఖుడు నన్నీసరికే హతమార్చి వుండేవాడు. నేను నిన్న తెల్ల వారు జామునుంచి, యీ రాళ్లగుట్టల మధ్య పడివున్నాను. హఠాత్తుగా మీద పడి నన్ను పట్టుకున్న గండభేరుండ పక్షులు రెండూ, కాలనాగుకు చిక్కి దుర్మరణం పాలయినై," అన్నది కాపాలిని.

"అలా అయితే యిక మనం భయపడ వలసిన పనిలేదు. నేను యీ చీకటిమాటున శంఖుడి మంత్రగృహం సంగతేమిటో తేల్చు కుంటాను," అంటూ చంద్రవర్మ లేచాడు.

కాపాలిని చంద్రవర్మను వారిస్తూ, "వర్మా, ఆ అగ్నిపక్షి సంగతి మరిచిపోకు. రాత్రివేళ మనం భయపడవలసింది ఆ అగ్నిపక్షిని గురించి; పగటివేళ శంఖుడి









మంచి ప్రమాదం శంకించవచ్చు. ఈ రాత్రితో అగ్నిపక్షి బెడద వదిలితే తప్ప, మనకు క్షేమం లేదు. దాని అంతు తెలుసుకునేందుకు కాలనాగు ప్రయత్నిస్తున్నది," అన్నది.

"కాలనాగు యిక్కడికి వచ్చిందా?" అన్నాడు చంద్రవర్మ ఆశ్చర్యంగా.

చంద్రవర్మ మాటలకు కాపాలిని నవ్వింది. "వర్మా! కాలనాగుకు నామీద కన్న నీమీద భక్తివిశ్వాసాలు ఎక్కువని తెలుసుకున్నాను. హఠాత్తుగా నువ్విక్కడ కనిపించినప్పుడు నేనేమీ ఆశ్చర్యపడలేదు. ఇంత త్వరలో యిక్కడికి ఎలా చేరావని కూడా నిన్నడగలేదు. దానికి కారణం: కాలనాగు నీగురించి సర్వం నాకు చెప్పింది. అడవిలోని వింతవృక్షాన్నుంచి పండు కోసుకుతిన్నావని తెలుసుకున్నప్పుడే, నీవు క్షేమంగా యిక్కడికి చేరగలవని నేను భావించాను," అన్నది కాపాలిని.

కాపాలిని మాట ముగించీ ముగించక ముందే, పెద్దగా మెరిసినట్టయి ఆ ప్రాంతమంతా వెలుగుతో నిండిపోయింది. చంద్రవర్మ ఆశ్చర్యపడుతూ గుహద్వారం దగ్గిరకు వచ్చి బయటికి తొంగిచూశాడు. సమీపంలో వున్న వెదురుపొదల వెనకభాగంలో అగ్నిపక్షి కనిపించింది. ఆ వెంటనే కోరలు సాచిన కాలనాగు దానిమీదికి లంఘించటం అతడి కంట బడింది.

"కాపాలినీ! అగ్నిపక్షిమీద కాలనాగు కలియబడుతున్నది. నేను వెళ్ళి కాలనాగుకు సహాయంచేస్తాను," అన్నాడు చంద్రవర్మ.

"వద్దు వర్మా, వద్దు!" అంటూ కాపాలిని వున్నచోటునుంచి గుహాముఖద్వారం దగ్గిరకు వచ్చి బయటికి చూస్తూ, "ఆ శంఖుడి భృత్యుణ్ణి కాలనాగు హతమార్చగలదని నాకు విశ్వాసం వున్నది. అలా కానినాడు నీకూ, నాకూకూడా ఆతణ్ణుంచి ప్రమాదం తప్పదు. గండభేరుండ పక్షులు నన్ను యీ కొండప్రాంతాలకు తెచ్చినవని







అగ్నిపక్షి పసికట్టివుంటుంది. ఆ సంగతి అది తన యజమానితో చెప్పకముందే దాన్ని తుదముట్టించటం క్షేమం," అన్నది.

ఈలోపల అగ్నిపక్షి, కాలనాగూ ఒకళ్ల నొకళ్లు హతమార్చుకునేందుకు చేసే పోరాటం మహా భయంకరంగా వున్నది. అగ్నిపక్షి తన వాడిముక్కుతో కాలనాగు మూడు తలలను చిన్నాభిన్నం చేసేందుకు ప్రయత్నిస్తున్నది. అగ్నిపక్షి వాడిగోళ్లనుంచి చర్రున జారుతూ, దాని పట్టునుంచి బయట పడగానే, తన కోరలతో అగ్నిపక్షి కంఠాన్ని కాటువేసేందుకు కాలనాగు ప్రయత్నిస్తున్నది. అగ్నిపక్షి శరీరం నుంచి వెలువడే మంటలు కాలనాగు శరీరానికి ఉడుకులెత్తిస్తున్నవి. కాలనాగు నోటనుంచి విడిచే విషవాయువుల తాకిడికి అగ్నిపక్షి కళ్లు తేలవేసి అటూ యిటూ పడిలేస్తూ, తిరిగి పోరాటానికి తలపడుతున్నది.

"ఈ అలజడి శంఖుడి చెవులబడితే, మనం అతడి చేతిలో చిక్కిపోయినట్టే," అన్నాడు చంద్రవర్మ.

"అలాజరిగే అవకాశంలేదు. తన భృత్యుడైన అగ్నిపక్షి రాత్రివేళ కాపలా కాస్తూండగా, తన కెలాంటి ప్రమాదమూ వాటిల్లదని శంఖుడి నమ్మకం. ఆ కారణంవల్ల ఆతడు చీకటిపడగానే నిద్రకు వుపక్రమిస్తాడు. తిరిగి సూర్యోదయానికి కొంచెం ముందుగా మాత్రమే ఆతడు నిద్రనుంచి మేల్కొనటం జరుగుతుంది. ఆతడి అలవాట్లన్నీ నాకు తెలియనివి కావు," అన్నది కాపాలిని.

ఇంతలో అగ్నిపక్షి పెద్దగా అరవబోయి కీచుమంటూ శబ్దంచేసి తల వేలాడవేసింది. తన మూడు తలలతో కాలనాగు దాని గొంతు బిగించి, అది తల వేలాడవేయగానే, తన పట్టువదిలి పక్కకువాలింది.

"జై, కాలనాగూ....వీరనాగూ!" అంటూ చప్పట్లు చరచబోయి, అంతలోనే నాలుక కొరుక్కుని, అమితోత్సాహంగా చంద్రవర్మ

గుహనుంచి బయటికి దూకాడు. కాపాలిని కూడా ఎక్కడలేని ఓపికా తెచ్చుకుని, చంద్రవర్మతోపాటు బయటికి నడిచింది.

చంద్రవర్మ, కాపాలినీ తనను సమీపించే సరికి కాలనాగు సొమ్మసిల్లి నేలను కరుచుకు పడుకునివున్నది. ఆ యిద్దరూ దగ్గిరకు రావటం చూస్తూనే అది చప్పున తన తలలను పైకెత్తి గౌరవసూచకంగా ఆడించింది.

చంద్రవర్మ, కాలనాగును సమీపించి ఆప్యాయంగా దాని శరీరాన్ని నిమిరాడు. అగ్నిపక్షి రెక్కలనుంచి వెలువడే మంటలకు కాలనాగు శరీరం నల్లగా కాలి, కొన్నిచోట్ల చర్మం వూడిపోయింది. తన సేవకుడి దుస్థితి చూస్తూనే కాపాలిని నివ్వెరపోయి, ప్రేమగా దాని తలలను తాకుతూ, "కాలనాగూ! ఈనాటితో నీ బాధలు తీరిపోయినై. శంఖుడి మంత్రగృహం నుంచి అపూర్వశక్తులు గల శంఖాన్ని చేజిక్కించుకోగానే, నీకు మానవ రూపం ప్రసాదిస్తాను. ఆ తరవాత నీయిష్టం వచ్చిన చోటుకు వెళ్లవచ్చు," అన్నది.

శంఖుడి మంత్రగృహం పేరు వింటూనే చంద్రవర్మ ఆదిరిపడ్డాడు. అతడు దృష్టిని తూర్పుదిక్కుకేసి పారించి, "కాపాలినీ, సూర్యోదయానికి అట్టే వేళ లేనట్టున్నది. యిక నేను ఆ మాంత్రికుడి పూజామందిరం సంగతేమిటో చూస్తాను," అన్నాడు.







కాపాలినికూడా తూర్పుదిక్కుకేసి ఓ క్షణకాలం చూసి, "వర్మా! నీవు యీవేళలో అతడి మంత్రగృహానికి వెళ్లటం క్షేమం కాదు. అతణ్ణి తుదముట్టించటానికి నేనొక ఉపాయం ఆలోచించాను," అన్నది.

"ఏమిటది?" అన్నాడు చంద్రవర్మ.

"శంఖుడు ప్రతిరోజూ సూర్యోదయం వేళ, తూర్పుదిక్కున వున్న కొండ అంచు మీదికి వెళ్లి, అక్కడ వున్న ఒక రాయిమీద నిలబడి గిర్రున అన్ని దిక్కులకూ తిరుగుతూ మంత్రోచ్చారణ చేస్తాడు. ఆ రాయి అడుగు వెడల్పూ, అడుగుఎత్తూ మాత్రం వుంటుంది. ఆ రాతికి అవల దాదాపు వెయ్యి అడుగుల



లోతుగల పెద్ద అగాధం వున్నది. నేను చెప్పినట్టు చేయగలిగితే, శంఖుణ్ణి ఆ రాతి మీదనుంచి, కిందవున్న అగాధంలోకి తోసి అతడి శరీరం అక్కడవున్న కరకు రాళ్లమీద పడి ముక్కలూ చెక్కలూ అయేట్టు చేయ వచ్చు," అన్నది కాపాలిని.

"ఏమిటా ఉపాయం కాపాలినీ?" అని అడిగాడు చంద్రవర్మ వుత్సాహంగా.

"అదేమిటో చెపుతాను, దగ్గిరకు రా!" అంటూ కాపాలిని, చంద్రవర్మ దగ్గిరకు రాగానే అతడి చెవిలో రహస్యం ఏదో చెప్పి, "ఇది ఎంతో గోప్యంగా నెరవేర్చవలసిన కార్యం. ఏమాత్రం పొరబాటు జరిగినా, సర్వనాశనం తప్పదు," అన్నది.

చంద్రవర్మ ఓ తృటికాలం ఆలోచిస్తూ నిలబడి, తరవాత దాపులవున్న ఒక ఎత్తయిన చెట్టు ఎక్కి తూర్పుదిక్కుకేసి కొంచెంసేపు పరికించి చూసి దిగివచ్చి, కాపాలినితో, "కాపాలినీ! సూర్యోదయానికి మరెంతో కాలం లేదు. నా పనిమీద నేనుంటాను. నువ్వూ, కాలనాగూ ఆ గుహలో విశ్రాంతి తీసుకోండి," అంటూ చరచర ఒరలోనుంచి కత్తి దూసి, చెట్ల గుంపుల్లోకి వెళ్లాడు.

చూస్తూండగానే చంద్రవర్మ కత్తి వేటు లకు చెట్ల ఊడలు ఒకదానివెంట ఒకటి











తెగి, గుట్టలు గుట్టలుగా కిందపడసాగినై. ఆ ఊడ లన్నిటిని ఒకచోట చేర్చి, వాటిని ఒక దాని కొకటి ముడివేసి కొద్ది సేపటిలోనే చాలా పొడవైన మోకులా తయారుచేశాడు చంద్రవర్మ. అలా తయారైన మోకుకొనను భుజాన వేసుకుని చకచకా కొండ ఎక్కి, దాని తూర్పువైపు అంచున వున్న అడుగు చదరం గల రాతికి దానిని ముడివేశాడు. మాంత్రికుడైన శంఖుడు ప్రతిరోజూ సూర్యోదయానికి కొంచెం ముందుగా ఆ రాతిమీదనే నిలబడి, అన్ని దిక్కులకూ తిరుగుతూ మంత్రోచ్చారణ చేస్తాడు.

తన పని ముగియగానే చంద్రవర్మ కొండ దిగి కాపాలిని వున్న గుహదగ్గిరకు వచ్చాడు. అతన్ని గుహముందు చూస్తూనే కాపాలిని బయటికి వచ్చి, "వర్మా! పని విజయవంతంగా నెరవేర్చావా?" అని అడిగింది.

"అప్పుడే విజయం సంగతి ఎలా చెప్పగలను? ఊడ ఒక చివరికొనను ఆ రాతికి బిగించాను. రెండవ కొన కొండ దిగువ వున్నది. కాని, నన్నొక సందేహం బాధిస్తున్నది. మనం ఆ రాతిని తూర్పు దిక్కుకు గుంజినప్పుడుగదా, అది శంఖుణ్ణి అగాధంలోకి యీడ్చి ముక్కలు ముక్కలు చేసేది?" అని అడిగాడు.

"అదా నీ అనుమానం!" అంటూ కాపాలిని చిరునవ్వు నవ్వి, "సరే, శంఖుడు ఆ రాతిమీదకు ఎక్కగానే నువ్వు గుంజవలసిన ఊడకొన ఎక్కడున్నదో నాకు చూపించు. నీ అనుమానాలన్నీ నివారణ చేస్తాను," అన్నది.

చంద్రవర్మ, కాపాలిని వెంటరాగా కొండ పార్శ్వానికి వెళ్ళి, అక్కడ వున్న ఊడకొనను ఆమెకు చూపించాడు. కాపాలిని దానిని తాకి, తరవాత తూర్పువైపున వున్న కొండ అంచు కేసి చూస్తూ, "వర్మా! శంఖుడు మంత్రోచ్చారణ చేసేందుకు ఎక్కి నిలబడే ఆ రాతిని ఏమాత్రం పక్కకు కదిలించినా, అది







కొండ అంచుమీద వున్నది గనక, తప్పని సరిగా ఆ దిగువ గల అగాధంలోకే పడిపోతుంది. ఆ విషయంలో ఎలాంటి అనుమానానికీ అస్కారంలేదు," అంటూ హఠాత్తుగా కళ్లు పెద్దవి చేసి, చంద్రవర్మకేసి తల వంచి, "అదుగో శంఖుడు! చేతిలో తళతళ మెరిసే మంత్రదండం కనబడుతున్నదా? అతడు రాయిమీదికి ఎక్కి నిలబడి నిలబడటంతోనే, నువ్వు ఊడను లాగాలి," అన్నది కంఠస్వరం తగ్గించి.

చంద్రవర్మ కొండపైకి చూశాడు. అప్పుడే తెలతెల్ల నవుతున్న తూర్పుదిక్కు లేత వెలుగులో మాంత్రికుడైన శంఖుడి వికృతాకారం అతడికి కనిపించింది. ఒక్క క్షణకాలం చంద్రవర్మ నిలువెల్లా వణికిపోయి, అంతలోనే గుండె నిబ్బరం తెచ్చుకుని, ఊడకొసను రెండు చేతులతోటి గట్టిగా పట్టుకున్నాడు. అంతలో శంఖుడు కొండ అంచున వున్న రాతిని సమీపించి దానిమీదికి ఎక్కి నిలబడి, మంత్రదండాన్ని ఉదయిస్తున్న సూర్యుడికేసి ఎత్తాడు.

"వర్మా, యిదే మంచి సమయం. ఊడను ఒక్కసారి గుంజి, చప్పున వదిలిపెట్టు," అన్నది కాపాలిని ఆత్రుతగా.

చంద్రవర్మ తన చేతులలో వున్న ఊడను బలంగా ఒకసారి గుంజి తక్కున వదిలేశాడు. ఆ తక్షణం శంఖుడు చేతులు రెంటినీ పైకెత్తి వూపుతూ, కాళ్లతో గాలిని మధిస్తూ, "మోసం! ద్రోహం!" అంటూ భీకరంగా అరిచాడు. అతడి చేతిలో వున్న మంత్రదండం మెరుపులా పోయి, మంత్రగృహాన్ని తాకింది. మంత్రగృహం వున్నదున్నట్టు పునాదులతోకూడా గాలిలోకి లేచి, పెద్ద ధ్వనిచేస్తూ సరస్సుమధ్యన పడిపోయింది. ఈలోపల శంఖుడు కొండదిగువనున్న అగాధంలోని బండరాళ్లమీద తలకిందులుగా పడిపోయాడు.

—(ఇంకా వుంది)








# 12

[శంఖుడు వుండే కొండప్రాంతాన చంద్రవర్మ, కాపాలినిని కలుసుకున్న తరవాత వాళ్లిద్దరూ కలిసి శంఖుణ్ణి హతమార్చేందుకు వ్యూహం పన్నారు. సూర్యోదయంవేళ కొండ చివరికి వచ్చిన శంఖుణ్ణి, చంద్రవర్మ కొండకింది అగాదంలోకి జారి పడేలా చేశాడు. కాలనాగు, అగ్నిపక్షిని తుదముట్టించింది. అగాధంలోకి పడిపోయే ముందు శంఖుడు తన మంత్రదండం విసిరి, మంత్రగృహాన్ని సరస్సులో కూలేటట్టు చేశాడు. తరవాత—]

మాంత్రికుడైన శంఖుడు, 'మోసం! ద్రోహం!' అంటూ ఎలుగెత్తి కేకపెట్టి, చేతిలో గల మంత్రదండాన్ని, మంత్రగృహంకేసి విసరటం చూస్తూనే, కాపాలిని కుప్పలా కూలిపోయింది. ఇంతలో శంఖుడి మంత్ర గృహం పెళపెళారావాలతో పునాదులనుంచి కదిలి, గాలిలోకి లేవటం చూసి చంద్ర వర్మ నివ్వెరపోయాడు. అతడు తన నివ్వెర పాటు నుంచి కోలుకొనే లోపలే మంత్రగృహం దభీమంటూ సరస్సులో పడిపోయింది. భయాశ్చర్యాలతో నిలువెల్లా వణికిపోయిన చంద్రవర్మ, కాపాలిని తన పక్కన నిష్ప్రాణంగా కూలబడటం చూడలేదు.

"వర్మా!" అన్న సన్నని పిలుపు వింటూనే చంద్రవర్మ ఏదో మైకంనుంచి బయటపడిన వాడిలా అయి, కాపాలినికేసి చూశాడు. కాపాలిని తన పక్కన వున్న బండరాళ్లలో ఒకదాన్ని ఆసరాగా పట్టుకుని లేచేందుకు









ప్రయత్నిస్తున్నది. చంద్రవర్మ ఆమెకు చేయి అందించి సాయపడ్డాడు.

"వర్మా, నన్ను పట్టి పీడిస్తున్న దురదృష్ట దేవత నిన్నూ పట్టినట్టున్నది. శంఖుడు ఆఖరి క్షణంలో మన ప్రయత్నానికి విఘాతం కలిగించాడు. ఇప్పుడు నీవూ నేనూకూడా పూర్వపు నిస్సహాయ స్థితిలోనే వున్నాం. ఉన్నచోటు వదిలి, అనేక ప్రమాదాలకు లోనై ఈ శంఖుడి కొండను చేరిన నీకూ నాకూ కూడా చివరకు మిగిలింది, నిరాశా నిస్పృహలే," అన్నది కాపాలిని.

కాపాలిని అలా మాట్లాడేసరికి చంద్ర వర్మ తన ప్రయత్నం విఫలమయిందని గుర్తించాడు. ఆతడు మంత్రగృహం పడటం వల్ల సరస్సులో ఉవ్వెత్తుగా లేచిన అలం కేసి నిట్టూరుస్తూ చూసి, "కాపాలినీ! మంత్రగృహంతోపాటు అపూర్వ శక్తులు గల శంఖంకూడా సరస్సులో పడిపోయిందనేనా నీ అనుమానం?" అని అడిగాడు.

"అనుమానం కాదు, వర్మా! జరిగిందే అది. శంఖుడి మంత్రగృహంలో ఆ అపూర్వ శక్తులు గల శంఖం ఒకటే కాదు....ఇంకా అనేక మహాశక్తివంతమయిన వస్తువు లున్నవి. నేను కోరిందల్లా ఆ ఒక్క శంఖమే. కాని, నీకు నీ రాజ్యాన్ని శత్రువులనుంచి సునాయాసంగా గెలిచిపెట్టగలిగిన అపూర్వ వస్తువులెన్నో, మంత్రగృహంతోపాటు సరస్సు పాలయినై. ఇప్పుడు మన యిద్దరమూ గొంగళి సామెతగా, వేసిన చోటనే వున్నాం," అన్నది కాపాలిని.

చంద్రవర్మ, ఆఖరి క్షణంలో చేజారి పోయిన అపూర్వ వస్తువుల్ని తలుచుకుని ఓ క్షణకాలం నిశ్చేష్టుడై, అంతలోనే గుండె దిటవు చేసుకుని, "కాపాలినీ, గతించి పోయినదానికి యిప్పుడు విచారించి లాభం లేదు. క్రూరకర్ముడైన మాంత్రికుణ్ణొకణ్ణి యమపురికి పంపాం, అంతేచాలు," అంటూ అప్పుడే ఏదో గుర్తుకు వచ్చినవాడిలా కళ్లింత











చేసుకుని ఆమెకేసి చూస్తూ, "ఆ శంఖం నీటి పాలయిందిగదా ? ఇప్పుడు నీ వృద్ధాప్యాన్ని పోగొట్టి, నీకు తిరిగి జవసత్వా లిచ్చే వస్తువు కోసం ఎక్కడ వెతకటం ?" అన్నాడు.

"ఎక్కడ వెతికినా ఆ శంఖంలాంటిది మరొకటి దొరికే అవకాశం లేదు, వర్మా !" అన్నది కాపాలిని నిస్పృహగా. "నేను యిప్పటికే మామూలు మానవు లెవరూ జీవించనంత కాలం జీవించాను. యిదే విధంగా బతుకుతూ పోవాలన్న ఆశకూడా నాలో నశిస్తున్నది. యింకా ఎంతకాలం బతికితేమాత్రం కొత్తగా నేను అనుభవించబోయే సుఖాలు ఏమున్నవి గనక ? ఇప్పుడు నా విచారమంతా నిన్ను గురించే. నాకోసం నీవు చాలా శ్రమపడ్డావు. ప్రాణాపాయానిక్కూడా గురయావు. అటువంటి నీకు ప్రతిగా నేను ఎలాంటి సహాయమూ చేయలేని నిర్భాగ్య స్థితిలో వున్నాను," అన్నది.

ఈ మాటలు చంద్రవర్మలో ఆమెపై ఎంతో జాలినీ, గౌరవాన్నీ కలిగించినై. ఆమె శంఖుడి నుంచి అపూర్వశక్తులు గల శంఖాన్ని సంపాయించేందుకు ఎన్నేళ్లగానో ప్రయత్నించి, అది విఫలం అయిందని గుర్తించికూడా అంత విచారపడటం లేదు. ఆమెను యిప్పుడు పట్టి బాధిస్తున్నదల్లా తనకు తిరిగి రాజ్యం సంపాయించుకునేందుకు సహాయపడ లేకపోయానన్నదే.

"కాపాలినీ ! నీవు నాకు చేసిన సహాయం కూడా చాలా వున్నది. నేను నదిలో పడి, నీవున్న అడవిప్రాంతాలకు చేరినప్పుడు, నాకు మరణం తథ్యం అనిపించింది. కాని, నీవు నీ గృహంలో నాకు ఆశ్రయం యిచ్చి, ఎంతగానో తోడ్పడ్డావు. నీకు నేను కలకాలం కృతజ్ఞుడనై వుండేందుకు ఆ సహాయం చాలు. సరే, యిప్పుడు మనం చేయవలసిన దేమిటి ?" అన్నాడు చంద్రవర్మ.

కాపాలిని, కొండమీదికేసి దృష్టిని సారించి, "వర్మా ! ఇక మనిద్దరి మార్గాలూ వేరు









వెనకగా కాపాలినీ, కాలనాగు రాసాగారు. చంద్రవర్మ తను శంఖుణ్ణి అగాధంలోకి పడేలా చేసిన తూర్పువైపున గల కొండ అంచుదగ్గిరకు రాగానే, అక్కడ ఆగి, కిందికి తొంగి చూశారు. అతడి దృష్టికి అగాధం అడుగున బండరాళ్లమీద బోర్లా పడివున్న శంఖుడు కనిపించాడు. ఓ క్షణ కాలం చంద్రవర్మ దృష్టిని మరల్చకుండా అతడికేసి చూసేంతలో, శంఖుడి చేయి ఒకటి కొంచెంగా కదిలినట్టు అతడికి అను మానం కలిగింది. ఆ వెంటనే చంద్రవర్మలో ఆ క్రూరమాంత్రికుడిమీద ఎక్కడ లేని ద్వేషం పుట్టుకొచ్చింది.

చంద్రవర్మ తనను సమీపిస్తున్న కాపాలినికేసి తిరిగి, "కాపాలినీ! ఆ పాపి శరీరంలో యింకేపాటో జీవం వున్నట్టు నా కను మానంగా వున్నది. ఒకవేళ వాడు తిరిగి బతకటం జరిగితే, మనకు ముప్పు తప్పదు. ఇదుగో, యీ రాతితో ఆ మాంత్రికుడి తలను చిన్నాభిన్నం చేస్తాను," అంటూ పక్కన వున్న ఒక పెద్ద రాతిని ఎత్తి గురిగా అగాధం లోకి వదిలాడు.

తరవాత చంద్రవర్మా, కాపాలినీ కొంత దూరం నడిచి ఒకప్పుడు శంఖుడి మంత్ర గృహం వున్న ప్రదేశానికి వచ్చారు. ఆ ప్రదే

కాక తప్పదనుకుంటాను. నేను మిగిలివున్న కొద్దికాలాన్నీ యీ కొండపైనే గడుపుతాను. జీవితపు ఆఖరిదశలోనైనా స్థిమితంగా ఒక చోట వెళ్లబుచ్చటం మేలని భావిస్తున్నాను." అన్నది విచారంగా.

"అలా అయితే, యీ కొండమీద ఒక మంచి చోటుగా చూసి, అక్కడ నీకోసం గృహం నిర్మించేందుకు నేనూ, కాలనాగూ ప్రయత్నిస్తాం. కొండమీదికి వెళదామా?" అన్నాడు చంద్రవర్మ.

కాపాలిని సరేనన్నట్టుగా తల వూపింది. చంద్రవర్మ రాళ్లమధ్యన వున్న కాలిబాట వెంట కొండమీదికి బయలుదేరాడు. అతడికి











శంలో యిప్పుడు ఆ గృహం వుండవలసిన చోట నిలువు లోతు పునాదులు మాత్రమే వున్నవి. చంద్రవర్మ వాటిని కాపాలినికి చూపుతూ, "నీకు కావలసిన గృహాన్ని యీ పునాదులమీదే నిర్మించవచ్చు. నీకు సమ్మతమేనా?" అని అడిగాడు.

కాపాలిని అందుకు అంగీకరించింది. అప్పటికి సూర్యుడు తూర్పున రెండు మూడు బారలు పాకాడు. చంద్రవర్మ తూర్పు దిక్కుకేసి ఓమారు చూసి, "ఆకలి దహించుతున్నది. ఇంత ఆహారం తిని పని ప్రారంభించితే ఎంత బావుండును. పండ్లూ ఫలాలకోసం తిరిగి కొండ దిగాలి," అన్నాడు నిట్టూరుస్తూ.

చంద్రవర్మ బాగా అలసిపోయాడని గ్రహించిన కాపాలిని, కాలనాగుకేసి తిరిగి, "కాలనాగూ! ఇదుగో నీకు తిరిగి నీ పూర్వ మానవరూపం యిస్తున్నాను. ఈనాటినుంచి నీవు స్వేచ్ఛాజీవివి. నీ యిచ్చవచ్చిన చోటికి పోవచ్చు," అని ఏదో మంత్రం జపిస్తూ తన చేత గల మానవాస్తికతో కాలనాగు తలలను తాకింది. వెంటనే ఆరడుగుల ఎత్తూ, దృఢంగా చెట్టుబోదెల ప్రమాణంలో వున్న కాళ్లూ, బలమైన చేతులూ గల ఒక యువకుడు అక్కడ ప్రత్యక్షమయాడు.

"కాపాలినీ, నీ దయకు కృతజ్ఞుణ్ణి!" అన్నాడా యువకుడు. తరవాత చంద్రవర్మ కేసి తిరిగి, "అయ్యా, మీ మేలు మరిచి పోలేను," అంటూ నమస్కరించాడు.

"లోగడ మానవరూపంలో వుండగా నీవు ఏపేరున పిల్వబడేవాడివో నాకు తెలి యదు. నాకు సర్పకేతుడనే శత్రు వొక డున్నాడు. నీవు నామిత్రుడివి గనక, నీకు కాలకేతుడనే పేరు పెట్టదలిచాను," అన్నాడు చంద్రవర్మ.

"అవును, నన్ను కాలకేతుడనే పిల వండి! ఏనాటికైనా నేను మీ శత్రువైన ఆ సర్పకేతుణ్ణి బలి పుచ్చుకుని, కాలకేతుడనే





నామం సార్థకం చేసుకుంటాను," అన్నాడు యువకుడు.

తరవాత కాలకేతుడు కొండ దిగి వెళ్ళి, సరస్సు ఒడ్డున గల పండ్లతోటలో వివిధ రకాల పండ్లు కోసుకుని వాటితో చంద్రవర్మ, కాపాలిని దగ్గిరకు తిరిగి వచ్చాడు. ముగ్గురూ ఆ పండ్లు తిని దాపులనే వున్న సెలఏరులో నీరు తాగారు. కొంచెంసేపు విశ్రమించిన తరవాత చంద్రవర్మా, కాలకేతుడూ కలిసి శంఖుడి మంత్రగృహపు పునాదులమీదే కాపాలిని కోసం రాళ్లతో గృహం నిర్మించసాగారు. ఆ పని సూర్యాస్తమయ సమయానికల్లా పూర్తయింది.

ఆ రాత్రికి ముగ్గురూ ఆ గృహంలోనే పడుకున్నారు. చంద్రవర్మకు నడిరేయి అయినా కునుకు పట్టలేదు. అతడు తన భావి కార్యక్రమాన్నిగురించి ఆలోచించసాగాడు. తను కాపాలిని సహాయంవల్ల అపూర్వ శక్తులు సంపాయించి తిరిగి తన రాజ్యాన్ని జయించుకోవాలన్న ప్రయత్నం విఫలమయింది. తన తండ్రిని మోసగించి అతి క్రూరంగా హత్య చేసిన సర్పకేతుడు, యిప్పుడు మొత్తం మాహిష్మతిరాజ్యానికే రాజైవుంటాడు. అటువంటివాణ్ణి జయించాలంటే తనకు ఎంతో సైన్యం కావాలి. సైన్యాన్ని పోగుచేయటానికి ధనం ముఖ్యం. అంత ధనం తనకెక్కడ లభించేటట్టు?

చంద్రవర్మ యిలాంటి ఆలోచనలతో నిద్ర పట్టక ఒక రాత్రివేళ బయటికి పోయి వెన్నెలలో అటూ యిటూ తిరగసాగాడు. కొంచెంసేపటికల్లా కాలకేతుడు అతడి దగ్గిరకు వచ్చి, "అయ్యా, యింత రాత్రివేళ యిక్కడ వున్నారేమిటి? ఏ సమస్యను గురించి మీరింతగా ఆలోచిస్తున్నారు?" అని అడిగాడు.

"కాలకేతూ, నాకు అన్నీ సమస్యలే!" అన్నాడు చంద్రవర్మ. "నేను రాజ్యం పోగొట్టుకుని అడవుల పాలయానని నీకు











తెలుసుగదా? కాపాలినివల్ల సహాయం పొందగలననుకున్నాను. కాని, ఆఖరి నిమిషంలో శంఖుడు తన మంత్రగృహాన్ని సరస్సులో కూల్చటం ద్వారా, అందరికీ ఆశాభంగం కలిగించాడు. నేను తిరిగి ఎక్కడికి పోయి, ఎవరినుంచి సహాయం కోరాలో తెలీక మథనపడుతున్నాను. ఈ చుట్టుపక్కల ఎంత దూరంలో మానవ నివాసాలున్నవో నీకు ఏమయినా తెలుసునా?" అని అడిగాడు.

"ఈ కొండల్లో, అడవుల్లో ఉత్తరదిక్కుగా ఒక్క నూరు యోజనాలు ప్రయాణిస్తే, మీరు తిరిగి జనపదాలను చూడగలుగుతారు. నేను మీవెంట రావాలనుకున్నాను. కాని, కాపాలినిని నిస్సహాయంగా యీ కొండమీద ఒంటరిగా వదలటం నాకు మనస్కరించటం లేదు. ఆమె మరి ఎంతోకాలం బతకదు. ఆ తరవాత ఆమె తన పాతఇంట వదిలి వచ్చిన, భూతవర్తమాన కాలాలను ప్రతిఫలించే గాజుగోళం సహాయంతో మీదగ్గిరకు తప్పక వస్తాను. ఆ గాజుగోళం మీకూ ఉపకరించవచ్చు!" అన్నాడు కాలకేతుడు.

కాలకేతుడి మాటలు చంద్రవర్మకు ఏమాత్రం వుత్సాహం కలిగించలేదు. ఈ చుట్టుపక్కల వున్న కొండలూ అడవుల్లో నూరు యోజనాలు ప్రయాణం చేయగలిగితే అప్పుడు తను మనుషులు నివసిస్తున్న ప్రాంతాలకు చేరగలుగుతాడు. ఈ నూరు యోజనాల ప్రయాణంలో తను ఎన్ని భయంకర ప్రమాదాలకు గురి కావలసి వున్నదో ఆ ఈశ్వరుడికే ఎరుక!

చంద్రవర్మ సూర్యోదయం వరకూ యిలాంటి ఆలోచనలతోనే కాలం గడిపాడు. సూర్యోదయం కాగానే అతడు సరస్సులో స్నానంచేసి, కాపాలిని దగ్గిరకు వెళ్లి తన ప్రయాణాన్ని గురించి చెప్పాడు. కాపాలిని అతణ్ణి దీవించి, "వర్మా, నీవు ఎన్ని కష్టాలు ఎదుర్కొన్నప్పటికీ చివరకు శత్రుసంహారం





చేసి నీ రాజ్యాన్ని గెలుచుకొనగలవని నా దృఢవిశ్వాసం," అన్నది.

తరవాత చంద్రవర్మ కాపాలికినీ, కాలకేతుడికీ సెలవు చెప్పి కొండ దిగి, ఉత్తర దిక్కుగా మహారణ్యంలో నడవసాగాడు. అతడు ఆవిధంగా పొద్దు నడినెత్తికొచ్చే వరకూ నడిచి, బడలిక తీర్చుకునేందుకు ఒక మహావృక్షం కిందికి వెళ్లాడు. ఆ వృక్షం కింద పడుకునేందుకు చదునైన స్థలంకోసం గాలిస్తున్న చంద్రవర్మకు, వృక్షపాదంలో దాదాపు నాలుగడుగుల పొడవున్న ఒక ఇనపగొలుసు కనిపించింది. ఈ మహారణ్యంలో అలాంటి వస్తువు తన కంటబడినందుకు అతడు ఆశ్చర్యపోతూ, ఆ గొలుసును చేతికి తీసుకుని పరికించి చూశాడు. అది వాడుక లేనందున బాగా తుప్పుపట్టి వున్నది. ఆ ఇనపగొలుసు ఈ ఆరణ్యం మధ్యకు ఎలా వచ్చివుంటుంది? అని చంద్రవర్మ మథనపడుతున్నంతలో, దూరంగా మహా భయంకరమైన మొరుగు ఒకటి వినిపించింది.

ఆ మొరుగు వింటూనే చంద్రవర్మ ఒర నుంచి కత్తి దూసి లేచి నిలబడ్డాడు. దూరంగా కొండరాళ్లమీద కుప్పించి దూకుతూ, కోరలు చాచి తనకేసి వస్తున్న పెద్ద కుక్క ఒకటి అతడి కంటబడింది. "ఇది మామూలు కుక్క అయివుండదు, ఆ రూపంలో వున్న భయంకర రక్కసుడెవడో అయివుండాలి!" అనుకుంటూ చంద్రవర్మ కుడిచేతితో కత్తిని బిగించి పట్టుకుని, ఎడమచేతితో తనకు దొరికిన ఇనప గొలుసును పైకెత్తాడు. ఆ క్షణంలో ఆ ఇనప గొలుసుకూడా ఆత్మరక్షణకు ఉపకరించవచ్చునని అతడికి తోచింది. ఇంతలో దయ్యపు కుక్క, ఎదురుగా వున్న పొదల్లోంచి మరోసారి కర్ణకఠోరంగా మొరిగి, నోరు తెరిచి చంద్రవర్మ మీదికి శరవేగంతో రాసాగింది. —(ఇంకా వుంది)








## 13

[చంద్రవర్మా, కాపాలిని శంఖుడి మంత్రగృహం వున్న కొండమీదికి ఎక్కారు. అక్కడ కాపాలినికోసం చంద్రవర్మా, కాలకేతుడూ కలిసి చిన్న ఇల్లు కట్టారు. చంద్రవర్మ మర్నాటి వుదయం కాపాలినీ, కాలకేతుల దగ్గిర సెలవుతీసుకుని అరణ్యంలో ప్రవేసించాడు. అతడికి ఒక మహావృక్షం కింద ఒక ఇనపగొలుసు దొరికింది. ఆ వెంటనే భయంకరాకృతిలో వున్న ఒక దయ్యపుకుక్క మొరుగుతూ అతడిమీదికి రాసాగింది. తరవాత—]

దయ్యపు కుక్క భయంకరంగా నోరు తెరిచి, తన కంఠాన్ని ఒడిసిపట్టేందుకు చెంగున మీదికి వురికేంతలో, చంద్రవర్మ తన కత్తి మొనతో దాని గుండెలమీద పొడిచేందుకు తల వంచి ముందుకొక అడుగు వేశాడు. అదే సమయంలో అతడి ఎడమచేత గల ఇనపగొలుసు ఛెళ్లుమని దయ్యపుకుక్క తలమీద గట్టిగా తగిలింది. కుక్క ఎగిరి అల్లంత దూరాన వెల్లకిలా పడిపోయింది.

చంద్రవర్మ మెరుపులా గిరున వెనుదిరిగి భీకరంగా అరుస్తూ, దయ్యపుకుక్కను సమీపించ బోయేంతలో, అది లేచి నిలబడి ఒక్క త్రుటికాలం చంద్రవర్మ చేతులో వున్న ఇనపగొలుసుకేసి చూసి, చప్పున వెనుదిరిగి పాదలదగ్గిరకు పరిగెత్తి, అక్కడ తోక ఆడిస్తూ నిలబడింది.

దయ్యపుకుక్కలో వచ్చిన యీ వింత మార్పు చూస్తూనే చంద్రవర్మ చాలా ఆశ్చర్య







పడ్డాడు. అతడు తన చేతులో వున్న ఇనప గొలుసుకేసి ఓమారు చూసుకుని దాన్ని దయ్యపుకుక్క నిలబడివున్న చోట పడేలా విసిరివేశాడు. దయ్యపుకుక్క ఆ గొలుసును ఒకసారి వాసన చూసి, దాన్ని నోట కరుచుకుని చంద్రవర్మ దగ్గిరకు వచ్చి, తోక ఊపుతూ నిలబడింది. ఈ సంఘటనతో చంద్రవర్మకు ఆ ఇనపగొలుసులో ఏదో ప్రభావం వున్నట్టు అర్థమైంది. అతడు ఆ గొలుసును కుక్క నోటనుంచి తీసుకుని ఒక కొసను దాని మెడకు బిగించాడు.

కుక్క ఒకమారు చుట్టూ కలయ చూసి, పెద్దగా మొరుగుతూ చంద్రవర్మను



పొదలకేసి గుంజసాగింది. అది తనను ఎక్కడికో తీసుకు పోదలచిందని గ్రహించిన చంద్రవర్మ, ధైర్యంగా దాని వెనక నడవ సాగాడు. ఆసరికి చంద్రవర్మకు అది శునక రూపంలో వున్న ఏ రాక్షసుడో కాదని, నిజ మైన శునకమే అయివుండవచ్చని తోచింది.

కుక్క ముళ్లపొదల మధ్యగా కొంత దూరం నడిచి, చంద్రవర్మను ఒకానొక కొండగుట్టమీదికి తీసుకువచ్చింది. ఆ గుట్ట దిగువగా వున్న పల్లంలో, ఒక సెలయేటి పక్కన చిన్న గుడిసె ఒకటి చంద్రవర్మ కంటబడింది. బహుశా, ఆ గుడిసెలో కుక్క యజమాని నివసిస్తూ వుంటాడనీ, తనను కుక్క అతడిదగ్గిరకు తీసుకుపోతున్నదనీ చంద్రవర్మ వూహించాడు. ఆ వెంటనే అతడు తన చేత గల గొలుసునుకూడా కుక్క మెడకు చుట్టి దాని వెనకగా కొండ గుట్టమీది నుంచి దిగి సెలయేటి అంచునే నడుస్తూ గుడిసెను సమీపించాడు.

గుడిసెలోనుంచి ఎవరూ బయటికి రాలేదు. కుక్క పెద్దగా మొరుగుతూ గుడిసె లోకి పోయి, అంతలోనే బయటికి వచ్చి చుట్టూ కలయచూడసాగింది. ఈ గుడిసెలో ఎలాంటి వ్యక్తి నివసిస్తున్నాడో, అనుకుంటూ చంద్రవర్మ జాగ్రత్తగా గుడిసెలోకి వెళ్లాడు.









లోపల ఎవరూ లేరు. ఒక మూలగా ఒక కుక్కిమంచం వున్నది. మరోవైపున గోడ నానుకుని చిన్నపొయ్యీ, దాని ముందు రెండు మూడు కుండలూ, చిన్న మట్టి పాత్రలు కొన్నీ వున్నవి. ఇంటి వాసాలకు వేలాడుతున్న ఒక తాడుమీద ఒక గొంగళీ, చినిగిపోయిన కొన్ని బట్టలూ వున్నవి.

ఈ గుడిశెలో ఎవరో బీదవాడు నివసిస్తున్నాడని చంద్రవర్మ భావించాడు. కాని, అంతలోనే అతడికొక అనుమానం కలిగింది. ఇంత భయంకరారణ్యం మధ్య ఆ బీదవాడు కాలం గడపవలసిన అవసరం ఏం కలిగింది? వీడెవడైనా మరొక మాంత్రికుడా?

చంద్రవర్మకు యీ అనుమానం కలగ్గానే, అతడు చప్పున ముందుకు నడిచి, పొయ్యి దగ్గిర వున్న కుండలను సమీపించి, వాటిని పరీక్షించి చూడసాగాడు. వీడెవడైనా నరమాంస భక్షకుడైతే, ఆ కుండల్లో మానవాస్థికలు దొరకవచ్చునని అతడి వూహ.

చంద్రవర్మ తన పనిలో నిమగ్నుడై వుండగా హఠాత్తుగా వెనకనుంచి హెచ్చరిక వినబడింది. "ఉన్న చోటునుంచి కదలకు. కదిలేందుకు ప్రయత్నించావో.... వెన్నులో ఈటెపోటు పడుతుంది! వెనుతిరిగి చూడకుండా, నా ప్రశ్నలకు జవాబు లివ్వాలి."

చంద్రవర్మకు ముచ్చెమటలు పోసినై. ఎలాంటి శత్రువునుంచి తనకు ప్రమాదం రానున్నదో చూసేందుకైనా అవకాశం లేదు. బహుశా, తన వీపువెనక నిలబడివున్న ఆ శత్రువు, ఈటెను వెన్నుమీదికి గురిచేసి వుంటాడు. కనుక, వెనుదిరిగేందుకు ప్రయత్నించటం వృథా.

"నేను నీకు శత్రువునుకాదు, మిత్రుణ్ణి! నా ముఖం చూస్తే ఆ సంగతి గ్రహించగలవు," అన్నాడు చంద్రవర్మ భయాన్ని కప్పిపుచ్చుతూ.

"నువ్వా? నాకు మిత్రుడివా...ఛీ," అన్నాడు వెనక నిలబడివున్న వ్యక్తి. తరవాత







ఓ క్షణకాలం ఆగి, "నీతోపాటు వచ్చిన రాజభటు లెక్కడ ?" అని ప్రశ్నించాడు.

"రాజభటులా ?" అంటూ చంద్రవర్మ ఆశ్చర్యపోయి, "నేను యీ అరణ్యంలో ఒంటరిగానే తిరుగుతున్నాను. దైవకృపవల్ల నీ దయ్యాన్ని కుక్కకు ఆహారంకాకుండా నన్ను ఒక ఇనపగొలుసు కాపాడింది. ఆ కుక్క దారిచూపగా, నేనిక్కడికి వచ్చాను," అన్నాడు చంద్రవర్మ.

"ఆ ఇనపగొలుసు నీ ప్రాణాన్ని కాపాడిందనేదాంట్లో సందేహం ఏమీలేదు. ఆ గొలుసునే నా కొడుకు కుక్క మెడకు కట్టి దానిని వెంటపెట్టుకుని అరణ్యంలో తిరుగుతుండేవాడు. వాణ్ణి రాజభటులు పట్టుకుపోయినప్పుడు, ఆ గొలుసు అరణ్యంలో ఎక్కడో పడిపోయింది. ఆది నీ చేతిలో వుండటం పసిగట్టి, నీవు తన యజమానికి మిత్రుడివని భావించి కుక్క నిన్ను చంపకుండా వదిలింది. ఇంతకీ నా కొడుకు బతికే వున్నాడా ? లేక రాజు వాణ్ణి చంపించాడా ?" అన్నాడావ్యక్తి.

చంద్రవర్మకు అంతా అయోమయంగా వున్నది. వీడెవడో తనను రాజభటు డనుకుంటున్నాడు. తన కొడుకుకు పట్టిన దుర్గతికి కారకులైనవారిలో తను ఒకడని అతడు భావిస్తుండబట్టే, తన వెన్నుమీద ఈటెను



గురిచేసి వుంచారు. ఈ ప్రమాదం నుంచి బయటపడటం ఎలా?

చంద్రవర్మకు ఆ ప్రమాద పరిస్థితుల్లో చప్పున ఒక ఉపాయం తోచింది. అతడు తన నడుమునుంచి వేలాడుతున్న కత్తిని చూపుతూ, "అయ్యా, మీరెవరోగాని, నన్ను గురించి అపోహపడుతున్నట్టున్నది. నేను మీ కొడుకును పట్టుకుపోయిన రాజభటుల్లో వాణ్ణికాదు. మీరు చెప్పే రాజెవరోకూడా నాకు తెలియదు. నా నడుముకు వేలాడుతున్న యీ కత్తిని మీరు తీసుకోండి. మనం యిద్దరం అన్ని సంగతులూ నిదానంగా మాట్లాడుకోవచ్చు," అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ మాట ముగించీ ముగించక ముందే, అతడి వెనక నిలబడివున్న వ్యక్తి, కత్తిని చంద్రవర్మనుంచి తీసుకుని, "ఇప్పుడు, వెనుదిరగవచ్చు. ఏదైనా మోసం చేసేందుకు ప్రయత్నించావో, నీకు చావు తప్పదు," అన్నాడు కఠినంగా.

చంద్రవర్మ బతుకుజీవుడా అనుకుని ఒక నిట్టూర్పు విడిచి, వెనక్కు తిరిగిచూశాడు. అతడికి దాదాపు డెబ్భైఏళ్ల వయసు గల వృద్ధు డొకడు కనిపించాడు. అతడి తలా, గడ్డం బాగా తెల్లబడివున్నవి. ముఖం అంతా ముడతలు పడివున్నది. అతడు ఒక చేతులో పెద్ద ఈటె, రెండవ చేతిలో కత్తీ పట్టుకుని







నిలబడివున్నాడు. అతడి కళ్లు ఎర్రగా వేవురించివున్నవి.

"నేను రాజభటుణ్ణి కాను. రాజ్యం పోగొట్టుకుని అడవులపాలైన ఒకానొక దేశపు రాజును. మీ కుమారుణ్ణి బంధించి తీసుకుపోయిన రాజెవరు?" అని అడిగాడు చంద్రవర్మ.

"నువ్వు ఏరాజ్యపు ఎల్లల్లో వున్నావో కూడా నీకు తెలియదా?" అని అడిగాడు ముసలివాడు అనుమానం కనబరుస్తూ.

చంద్రవర్మ తెలియదన్నట్టు తల అడ్డంగా తిప్పాడు. ముసలివాడు చంద్రవర్మకేసి ఓ నిమిషకాలం గుచ్చిగుచ్చి పరీక్షిస్తున్నట్టు చూసి, "నీ మాట తీరూ, నీ దుస్తులూ చూస్తే, నువ్వీ ప్రాంతాలకు కొత్తవాడివిలా కనబడుతున్నావు. నిజంగానే నువ్వు రాజ్యం పోగొట్టుకుని అడవులపాలైనవాడివైతే, నేను నీకు సహాయంచేస్తాను. నువ్వు దానికి ప్రతిగా నాకు సహాయం చేస్తానని వాగ్దానం యివ్వగలవా?" అని అడిగాడు.

"నానుంచి మీకు ఎలాంటి సహాయం కావాలి?" అన్నాడు చంద్రవర్మ.

"నా కొడుకును రుద్రపురం రాజైన శివసింహుడు బంధించి తీసుకుపోయాడు. నేను అతడి భటుల బారి పడకుండా తప్పించుకుంటూ, ఈ అరణ్యంలో తిరుగుతున్నాను. రాజుతో విరోధం పెట్టుకుని, ఈ విధంగా మరెంతో కాలం బతకగలనన్న ఆశ యిక నాకు లేదు. ఈసరికే నా కొడుకును రాజు చంపించివుంటే చేయగలిగిందేమీ లేదు! అలా కాక అతడు బతికివుంటే, నేను రాజుతో రాజీపడి అతడికి "కంచుకోట" ప్రాంతంవున్న చోటుకు వెళ్లే మార్గాన్ని తెలిపే పటం యివ్వదలుచుకున్నాను," అన్నాడు ముసలివాడు.

"కంచుకోటా?" అంటూ చంద్రవర్మ ఎక్కడలేని ఆశ్చర్యం కనబరిచి, "మీరనే కంచుకోట సంగతి నా చిన్నప్పుడు, పెద్ద









వాళ్లు చెప్పుకుంటూవుండగా వినేవాణ్ని. ఆ కంచుకోట పడమటి సముద్రతీరప్రాంతాన ఎక్కడో వున్నదనీ, దానికి వెళ్లే మార్గం తెలిసినవాళ్లెవరూ బతికిలేరనీ వాళ్లను కుంటూ వుండేవాళ్లు. ఆ చోటుకు చేరేందుకు మార్గం సూచించే పటం మీదగ్గిర వున్నదని వినటం నాకెంతో ఆశ్చర్యం కలిగిస్తున్నది!" అన్నాడు చంద్రవర్మ.

"అవును, ఆశ్చర్యమే!" అంటూ ముసలివాడు తల వంచుకుని ఓ క్షణకాలం ఆలోచిస్తూ వూరుకుని, తరవాత తల ఎత్తి, చంద్రవర్మ ముఖంలోకి సూటిగా చూస్తూ, "ఆ కంచుకోట ఎక్కడ వున్నదో తెలుసుకునేందుకు ప్రయత్నించి, చాలామంది ప్రాణాలు కోల్పోయారు. ఆ సంగతి నీకు తెలుసుగదా?" అన్నాడు.

"అలా అని, పెద్దవాళ్లు చెప్పుకుంటూ వుండగా విన్నాను," అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ జవాబు వింటూనే ముసలివాడు నవ్వి, "నీకు కంచుకోటను గురించి సర్వం తెలుసునని నాకు అనుమానం కలుగుతున్నది. నాదగ్గిర ఆ కంచుకోటకు వెళ్లే మార్గం చిత్రించిన పటం ఒకటి వున్నది. దాన్ని మా పూర్వుల్లో ఒకరు సంపాయించారు. దాని సంగతి రుద్రపురం రాజైన శివసింహుడివరకూ పోయింది. అతడు తన భటులను పంపగా నేను పారిపోయి యిటువచ్చాను. నాకొడుకు దేవలుడు అతడికి చిక్కిపోయాడు. కంచుకోటలో లభ్యమయే వెలలేని రత్నరాసుల్లో నాకూ కొంత భాగం యిచ్చేటట్టయితే, ఆ పటాన్ని నేను రాజుగారికి యివ్వగలను. ఇందుకు నువ్వు మధ్యవర్తిగా వుండాలి. దేవలుణ్ణి విడిపించాలి. ఇందుకు సహాయపడేట్టయితే, నాకువచ్చే భాగంలో కొంత నీకిస్తాను. ఆ ధనంతో నువ్వు కావలసిన సైన్యాలను సమకూర్చుకుని, నీ దేశాన్ని తిరిగి జయించుకోవచ్చు," అన్నాడు ముసలివాడు.







మునలివాడు చెప్పినదంతా శ్రద్ధగా విన్న చంద్రవర్మకు అతడు సామాన్యుడు కాడని తెలిసిపోయింది. ఎత్తులు వేయుటంలో, వ్యూహాలు పన్నటంలో అతడు అందెవేసిన చేయి అని చంద్రవర్మ గ్రహించాడు.

"మీరు పెట్టిన నియమాలు నాకు అంగీకారమే. కంచుకోటకు వెళ్లే మార్గాన్ని సూచించే ఆ పటం ఏదో నాకు చూపండి," అన్నాడు చంద్రవర్మ.

మునలివాడు తృప్తిగా చంద్రవర్మకేసి ఓమారు చూసి, ఏదో జవాబివ్వబోయేంతలో బయట కలకలం వినబడింది. మునలివాడు ఎగిరి గంతేసి వాకిలిదగ్గిరకు పోయి బయటికి తొంగి చూస్తూ, "అదుగో, రాజుగారి భటులు యిటే వస్తున్నారు! నాకూ, నా కొడుక్కి ఎటువంటి హానీ కలగదని వాళ్లు మాట యిస్తే, నేను వాళ్లను కలుసుకుంటాను. కంచుకోటలో దొరికే ధనంలో నాకివ్వవలసిన భాగం సంగతికూడా నువ్వు వాళ్లతో మాట్లాడి వాగ్దానం తీసుకో!" అంటూ గుడిసె నుంచి బయటికి పరిగెత్తి, అడవిచెట్లలో మాయమయాడు.

త్రుటికాలంలో జరిగిపోయిన యీ సంఘటన చంద్రవర్మకు నివ్వెరపాటు కలిగించింది. మునలివాడు అసాధ్యుడు. తనను సునాయాసంగా ప్రమాదంలో తగుల్కొనేట్టు చేసి, అడవిలోకి పారిపోయాడు. ఇప్పుడు తనేం చేయాలి?

చంద్రవర్మ తను ఏం చేయాలో నిశ్చయించుకునే లోపలే, అతడున్న గుడిసెను కత్తులూ, కటార్లూ ధరించిన రాజభటులు చుట్టుముట్టారు.

"లోపల వున్నవాళ్లెవరో బయటికి రండి. పారిపోయేందుకు ప్రయత్నిస్తే....ఈ టెకు గుచ్చి పైకెత్తుతాం!" అంటూ భటులు కేక పెట్టారు. చంద్రవర్మ దేనికైనా తెగించినవాడిలా, నిర్భయంగా గుడిసెలోంచి బయటికి వచ్చాడు. —(ఇంకా వుంది)








## 14

[చంద్రవర్మ కొంత దిగువనున్న ఒక పూరిగుడిసె దగ్గిరకు వెళ్లాడు. అక్కడ ఒక ముసలివాడు తటస్థపడి, మొదట చంద్రవర్మను రాజభటుడుగా అనుమానించి, తరవాత నిజం తెలుసుకుని, తనదగ్గిర కంచుకోటకు వెళ్లే మార్గాన్ని తెలిపే పటం వున్నదని ఆతనితో చెప్పాడు. అంతలో రాజభటులు వచ్చారు. ముసలివాడు పారిపోయాడు. గుడిసెలో చిక్కుకుపోయిన చంద్రవర్మను వాళ్లు బయటికి రమ్మన్నారు. తరవాత—]

చంద్రవర్మ గుడిసెలోంచి బయటికి రావటం చూస్తూనే, రాజభటులు నివ్వెరపోయారు. వాళ్లు ముసలివాణ్ణి ఎరుగుదురు. ఇంత కాలానికి ఆతడు తమ చేతిలో చిక్కిపోయాడనీ, వాణ్ణి రాజుదగ్గిరకు పెడరెక్కలు విరిచి కట్టి లాక్కుపోతే, తమకు ఆయన గొప్ప బహుమానం యిస్తాడనీ వాళ్లు ఆశించారు. కాని, అక్కడ చంద్రవర్మ కనిపించేసరికి, "నువ్వెవరు? ముసలివాడెక్కడ?" అంటూ భటుల నాయకుడు కత్తి దూసి కళ్లెర్రచేస్తూ ఆతడిమీదికి వచ్చాడు.

"మీరు అనే ముసలివాడెవడో నాకు తెలియదు. పోతే, నేనెవరో మీకు చెప్పే ముందు, మీరెవరో నాకు తెలియాలి," అన్నాడు చంద్రవర్మ కత్తిదూస్తూ.

చంద్రవర్మ నిర్భయంగా నిలబడిన తీరూ, కత్తి దూయటంలో ఆతడు కనబరిచిన ఒడుపూ చూస్తూనే, భటుల నాయకుడు







ఒక క్షణకాలం నిశ్చేష్టుడయాడు. అది అదనుగా తీసుకుని చంద్రవర్మ, "మీరెవరో, ఏరాజు సేవకులో నాకు తక్షణం తెలియ పరచాలి. నన్ను చుట్టుముట్టి హతమార్చే ప్రయత్నం చేయదలిస్తే, అది మీ నాశనానికి దారి తీస్తుంది. నాకు వెనక రక్షణగా గుడిసె గోడ అడ్డం వున్నది. ఆ వైపునుంచి నన్ను మీరు ఎదుర్కోలేరు. కనుక, నాతో మీరు ఒక్కరొక్కరుగానే పోరాడవలసివుంటుంది. ఇదుగో, కత్తిదెబ్బ కాచుకోండి!" అంటూ చంద్రవర్మ ఒక అడుగు ముందుకు వేశాడు.

చంద్రవర్మ చెప్పినదంతా యదార్థమని ఒక్క త్రుటికాలంలో భటుల నాయకుడు



గ్రహించాడు. అతణ్ణి చుట్టుముట్టే ప్రయత్నం వృథా. అలా కాక ముఖాముఖి యుద్ధానికి తలపడితే తమలో ఒక్కొకరినే అతడు యమపురికి పంపగలడు. అతడి వాలకం చూస్తే, ఆరితేరిన యోధుడులా కనిపిస్తున్నాడు.

"అయ్యా, తమరెవరో మహాయోధుల్లా వున్నారు. అలాటి మీకూ, తోటి యోధుడనైన నాకూ అనవసరంగా ఈ కలహం ఎందుకు? నేను రాజాజ్ఞ పొంది ఒకానొక ముసలివాడి కోసం ఈ అడవినంతా గాలిస్తున్నాను. హఠాత్తుగా మీరు తటస్థపడ్డారు. జరిగిందేదో జరిగింది; యిప్పుడు ఎవరి మార్గాన వాళ్లం పోదాం," అన్నాడు భటుల నాయకుడు రాజీమార్గంగా.

తన ఎత్తుగడ పారినందుకు చంద్రవర్మ లోలోపల చాలా సంతోషించాడు. కాని, బయటికి ఎక్కడ లేని కరుకుదనం కన బరుస్తూ, "మీ రాజెవరు?" అని అడిగాడు.

"మా రాజెవరో మీకు తెలియదా? మీరు ఏ రాజ్యపు హద్దుల్లో వున్నారో, ఆ రాజ్యపు పాలకుడి పేరు తెలియదనటం ఆశ్చర్యంగా వున్నది!" అన్నాడు భటుల నాయకుడు.

చంద్రవర్మ ఆ మాటలకు నవ్వి, "రాజ్యాలూ, వాటి సరిహద్దులూ గుర్తిం









చటం నేనేనాడో మరిచిపోయాను. మా గురువు మరణించే ముందు నన్ను ఒక రాజును చూడవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఆ రాజు పేరు శివసింహుడు. ఆయనను కలుసుకునేందుకు నేను భరతఖండం ఆ చివరినుంచి యీచివరకూ, యీచివరి నుంచి ఆ చివరకూ తిరుగుతున్నాను. ఆ సందర్భంలో నేనిక్కడ మీకంట బడటం జరిగింది. ఇక మీదారిన మీరు వెళ్ల వచ్చు!" అంటూ గిరుక్కున వెను దిరగబోయాడు.

చంద్రవర్మ మాటలు వింటూనే రాజభటులూ, వారి నాయకుడూ ఆశ్చర్యచకితులయారు. వెనుదిరిగి గుడిసెలోకి వెళ్లబోతున్నట్టు నటించిన చంద్రవర్మను, భటుల నాయకుడు వారిస్తూ. "అయ్యా! మీరెవరో అపూర్వ పురుషుల్లా వున్నారు! మీ గురువుగారు ఏ రాజునైతే కలుసుకోమన్నారో—ఆ రాజు శివసింహుడే, యీ ప్రాంతాలకు పరిపాలకుడు," అన్నాడు.

చంద్రవర్మ ఎక్కడ లేని ఆశ్చర్యం కనబరుస్తూ, "ధన్యుణ్ణి, ధన్యుణ్ణి! ఆహా, ఎంత కాలానికి నాప్రయాస ఫలించింది. గురువాజ్ఞ నెరవేరదని భయపడ్డాను. పదండి, పదండి! తక్షణం శివసింహ మహారాజులుంవారి దర్శనం చేసుకోవాలి!" అన్నాడు భటులను వేగిరపరుస్తూ.

భటుల నాయకుడు తన అనుచరులకేసి ఓమారు చూసి, తరవాత అనుమానంగా చంద్రవర్మకేసి చూస్తూ, "అయ్యా, మీ గురువుగారు మిమ్మల్ని, మా రాజుగారి దర్శనం చేయుమని ఎందుకు చెప్పారు?" అని అడిగాడు.

"అది పరమ రహస్యం, దేవరహస్యం కన్నకూడా నిగూఢమైంది," అంటూ చంద్రవర్మ ఆకాశంకేసి తల ఎత్తి, "ఆహా, కంచుకోటా! నా గుప్పెట చిక్కావుగదా?" అన్నాడు బిగ్గరగా.







'కంచుకోట' అన్న వాక్యం వింటూనే భటుల నాయకుడు తుళ్లిపడి, "అయ్యా, మీకా కంచుకోట సంగతి ఎలా తెలుసు?" అని అడిగాడు.

"ఆ కంచుకోటగురించి నాకూ, నా గురువుకుమాత్రమే తెలుసు. కాని, నువ్వు ప్రశ్నించిన తీరుచూస్తూంటే, నీకూ దాన్ని గురించి కొద్దో గొప్పో తెలిసినట్టు కనబడుతున్నది. వింత! ఆశ్చర్యం!" అంటూ చంద్రవర్మ విస్తుపోయాడు.

"ఇందులో ఆశ్చర్యం ఏం వున్నది! ఆ కంచుకోటను గురించిన ఒకానొక రహస్యం తెలుసుకునేందుకే, మేమీ అడవిలో ఒక



జిత్తులమారి ముసలివాడికోసం గాలిస్తున్నాం," అన్నాడు భటుల నాయకుడు.

చంద్రవర్మ చప్పున తన కుడి అరిచేతికేసి ఒకక్షణకాలం కళ్లార్పకుండా చూసి, "ఆఁ, యిప్పుడు అంతా తెలిసింది! ఆ ముసలివాడి దగ్గిర కంచుకోటకు వెళ్లే మార్గాన్ని సూచించే పటం వున్నదని మీరాజు అనుమానిస్తున్నారు. ఆ ముసలివాడి కొడుకు దేవలుడనేవాణ్ణి కారాగారంలో బంధించాడు. అవునా? మీ రాజెంత అమాయకుడు!" అన్నాడు.

భటుల నాయకుడు చంద్రవర్మ చేతికేసి పరీక్షగా చూసి, "అయ్యా, మీరు సర్వజ్ఞుల్లా వున్నారు! మీ అరిచేతిలో యీ వివరాలన్నీ కనబడటం ఆశ్చర్యంగా వున్నది," అన్నాడు.

"ఎవరి కాశ్చర్యం? నీకా, నాకా?" అంటూ చంద్రవర్మ కోపంగా భటుల నాయకుడికేసి చూసి, "మీరు తక్షణం యిక్కణ్ణించి కదిలి, ఆ రాళ్లగుట్ట వెనక వున్న పల్లంలో నాకోసం వేచివుండండి. నేను కొద్ది క్షణాల్లో అక్కడికి వస్తాను. తరవాత అందరం కలిసి మీ రాజుదగ్గిరకు పోదాం. తెలిసిందా?" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

చంద్రవర్మదగ్గిర ఏవో అపూర్వ శక్తులున్నవని భ్రమపడిన భటుల నాయకుడు,







'చిత్రం, చిత్రం!' అంటూ తన అనుచరులతో గుట్టవెనక వున్న ప్రదేశానికి వెళ్ళిపోయారు. వాళ్లు గుట్టవెనక కనపడకుండా పోగానే, చంద్రవర్మ బయలుదేరి అల్లంత దూరంలో వున్న చెట్లల్లోకి పోయి, "అంతా మాట్లాడాను! దేవలుడికి ప్రమాదం లేదు. ఎక్కడున్నావు జాంబవంతా?" అంటూ కేకపెట్టాడు.

ఆ కేక వింటూనే ముసలివాడు చెట్లలోంచి బయటికి వచ్చి, చంద్రవర్మను సమీపిస్తూ "జాంబవంతు డెవరు?" అని అడిగాడు.

"నువ్వే జాంబవంతుడివి! ముసలివాడా, అని కేకవెయ్యటం బావుండదని అలా పిలిచాను. నేను శివసింహుడి దగ్గిరకు వెళుతున్నాను. నీ కొడుకు దేవలుణ్ణి చెర నుంచి విడిపించటమే గాక, నీకు కంచు కోటలో దొరికే ధనరాసుల్లో భాగంకూడా యిప్పిస్తాను. అక్కడికి వెళ్లేమార్గాన్ని తెలిపే పటం ఎక్కడ?" అన్నాడు చంద్రవర్మ.

"నీ మాటలు నమ్మవచ్చునా?" అన్నాడు ముసలివాడు అనుమానంగా.

"నమ్మక నువ్వు చేయగలిగిందేమిటి? నమ్మితే నీకూ, నీకొడుకుక్కూ క్షేమం కలుగుతుంది. పడమటి సముద్రతీరంలో కంచుకోట వున్నదని తెలిసింతరవాత అక్కడికి చేరటం ఒక సమస్య కాదు. సముద్రతీరం



వెంట వెళితే ఎప్పుడో ఒకప్పుడు అక్కడికి చేరకపోను. పోతే, నీదగ్గిరవున్న పటం చూసినందువల్ల, అక్కడికి వెళ్లేందుకు దగ్గిర మార్గంగాని, సులభమార్గంగాని కనబడవచ్చునని ఆశపడుతున్నాను," అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ యిలా అనేసరికి ముసలివాడు కిక్కురుమనకుండా తన దుస్తుల్లో దాచివున్న ఒక పెద్ద తాళపత్రపు కవిలె బయటికి తీసి, దాన్ని విసనకర్రలా గుండ్రంగా విప్పుతూ చంద్రవర్మతో, "ఇదుగో, కంచుకోటకు వెళ్లే మార్గాన్ని తెలిపే పటం!" అన్నాడు.







చంద్రవర్మ ఆ పటాన్ని ఎంతో శ్రద్ధగా పరిశీలించి చూశాడు. అందులో కొండలూ, అడవులూ, నదులూ, ఎడారులూ స్పష్టంగా చిత్రించబడివున్నవి. సముద్రం చిత్రించబడిన చోటుకు అనుకుని ఎత్తయిన గోడలతో ఒక కోట కనబడుతున్నది. ఆ కోట గోడలమీదుగా కనిపిస్తున్న పెద్ద భవనాలను పొగలాటిదేదో కమ్ముకుని వున్నది.

చంద్రవర్మ తనలో రేకెత్తిన భయాందోళనలను తొక్కిపడుతూ. "ఈ అడవులూ, నదులూ, ఎడారులూ దాటి మానవమాత్రుడెవడైనా అక్కడికి చేరటం సాధ్యమేనా?" అని తనను తాను ప్రశ్నించుకున్నాడు.



"ఈ కంచుకోటను మా పూర్వుల్లో ఒకరు చూశారు. నేను ముసలివాణ్ణయాను కాని, లేకపోతే నేను ఒంటరిగానే అక్కడికి వెళ్లివుండును," అన్నాడు ముసలివాడు.

ముసలివాడి మాటలకు చంద్రవర్మ నవ్వి, "సరే, యీ పటం నాకిచ్చెయ్యి. నేనే స్వయంగా యీ కంచుకోటను వెతుక్కుంటూ వెళతాను. నీ కొడుకు దేవలుణ్ణి కూడా వెంట తీసుకుపోతాను. నువ్వు ఆ గుడిసెలో క్షేమంగా వుండవచ్చును. రుద్రపురంరాజైన శివసింహుడితో అన్ని సంగతులూ మాట్లాడి, నేనూ, నీ కుమారుడూ తిరిగి వచ్చేవరకూ, నీకు అన్ని వసతులూ సరిగా వుండే ఏర్పాటు చేస్తాను," అన్నాడు.

ముసలివాడు అయిష్టంగా తన చేతిలోని పటాన్ని చంద్రవర్మకు యిస్తూ, "ఇందులో మోసం ఏమీ లేదుగదా? ముసలివాణ్ణి మోసగించటం మహాపాపం!" అన్నాడు.

"నిన్నూ, నీ కొడుకునూ నేను మోసగించను. రాజు శివసింహుణ్ణికూడా....ఆతడు సన్మార్గవర్తి అయితే నేను మోసగించబోవటంలేదు. అలాకాక......"

చంద్రవర్మ మాట ముగించకముందే ఆతడికి పెద్దగా గుర్రం సకిలించిన ధ్వని వినబడింది. ఆతడు చెట్లలోంచి గుట్టకేసి









తొంగిచూశాడు. రాజభటుల నాయకుడు తన గుర్రాన్ని గుట్టమీదుగా ఎక్కించి, గుడిసె వున్న చోటుకు వస్తున్నాడు. అది చూస్తూనే చంద్రవర్మ, ముసలివాడికేసి తిరిగి, "నేను రాజభటుల్ని వెంటపెట్టుకుని రుద్రపురం వెళ్ళి రాజును కలుసుకుంటాను. నువ్వు ప్రస్తుతానికి నీ గుడిసెలో వుండవచ్చు. నేను త్వరలోనే నీకోసం కబురు చేస్తాను. అప్పుడు నువ్వు నగరానికి వచ్చి, అక్కడే హాయిగా జీవించవచ్చు," అంటూ భటుల నాయకుడికి ఎదురు వెళ్ళాడు.

చంద్రవర్మ తనను సమీపిస్తుండటం చూసి భటుల నాయకుడు గుర్రాన్ని దిగుతూ, "అయ్యా, తమరు ఎంతకూ రాకపోయేసరికి, నేనే బయలుదేరి వస్తున్నాను. ఈ గుర్రం తమకోసమే! మీరు నగరానికి వస్తున్నట్టు రాజుగారికి వార్త పంపాను," అన్నాడు.

"నేను కొన్ని శక్తులను ఆవాహన చేసేందుకు అడవిలోకి వెళ్ళాను. మీరాజును గురించి వాటిలో ఏ ఒకటీ ఒక్క మంచి మాట చెప్పకపోవటం నాకు ఆశ్చర్యంగా వున్నది. మీరాజు అంత దుష్టుడా?" అని అడిగాడు చంద్రవర్మ.

"అయ్యా, రాజు దుష్టుడో మంచివాడో అతడి సేవకులకెలా తెలుస్తుంది? ఆ సంగతి ప్రజలకూ, పొరుగు రాజులకూ తెలియాలి. మాకు కావలసిందల్లా నెలనెలా భత్యాలు సరిగా ముట్టటం. అవి ముట్టచెప్పినవాడు మంచిరాజు; ముట్టచెప్పనివాడు చెడ్డరాజు!" అన్నాడు భటుల నాయకుడు.

ఆ మాటలతో చంద్రవర్మకు తను శివసింహుడి దగ్గిర ఎంతో మెలకువతో మెలగవలసివుంటుందని అర్థమైపోయింది. కంచుకోటను చేరాలంటే తనకు కొంత బలగం కావాలి. అది శివసింహుడిలాంటి రాజువల్లనే తనకు లభ్యమవుతుంది. ఒంటరిగా కంచుకోటను చేరాలని చూడటం ఆత్మహత్యతో సమానం. మార్గంలో అనేక ఘోరప్రమా









దాలను ఎదుర్కొనవలసి వుంటుంది గనకనే, అక్కడికి వెళ్ళేందుకు ఎవరూ ప్రయత్నించటం లేదని చంద్రవర్మ గ్రహించాడు. పోతే, శివసింహుడికి తనను గురించిన నిజం చెప్పుకోవటం మహాప్రమాదం కావచ్చు. రాజభటులను నమ్మించినట్టే, అతడినీ తను గొప్ప మంత్రశక్తులు గల వాడినని నమ్మించాలి!

"అయ్యా, ఇక మనం నగరానికి బయలు దేరదామా ?" అంటూ భటుల నాయకుడు గుర్రాన్ని చంద్రవర్మ పక్కకు అదిలించాడు. చంద్రవర్మ కళ్ళెం అందుకుని గుర్రంమీద ఎక్కి కూచున్నాడు.

కొంతదూరం అడవిలోనూ, కొంతదూరం కొండ కనుమలవెంటా ప్రయాణించి చంద్రవర్మా, రాజభటులూ రెండుగంటల తరవాత రుద్రపురం చేరారు. నగరద్వారాలూ, వీథులూ తోరణాలతో అలంకరింపబడి వున్నవి. రాజమార్గానికి యిరువైపులా సాలువులుగా నగరవాసులు నిలబడి వున్నారు. రాజభటులతో కలిసి, చంద్రవర్మ రాజమార్గంమీదికి వచ్చేసరికి ప్రజల్లోనుంచి కరతాళధ్వనులూ, మహా మాంత్రికుడికి జై! అన్న కేకలూ వినిపించినై.

ఆ జేజేలు వింటూనే చంద్రవర్మ తికమక పడిపోయాడు. తను మహామాంత్రికుడా ? ఇది చాలా వింతగా వున్నదే అనుకున్నాడతడు. అంతలో అతడికి భటులనాయకుడు చెప్పిన మాటలు గుర్తుకొచ్చినై. తను అరచేతిని పరీక్షగా చూసుకుని, ముసలివాణ్ణి గురించీ, కంచుకోటకు వెళ్ళేమార్గాన్ని తెలిపే పటాన్ని గురించీ అన్నమాటలు, భటులనాయకుడికి అద్భుతంగా కనిపించివుంటవి. ఆ కారణంగా అతడు రాజుకు తను గొప్ప మాంత్రికుడని వార్త పంపివుంటాడు. తనను యిలాంటి మర్యాదలతో, ముఖస్తుతులతో లోబరుచుకునేందుకు రాజు ఈ ఆర్భాటాలన్నీ ఏర్పాటుచేశాడు! —(ఇంకా వుంది)








## 15

[చంద్రవర్మను చూసి రాజభటులు గొప్ప మాంత్రికుడని భ్రమపడ్డారు. మునలివాడి దగ్గిర నుంచి, చంద్రవర్మ కంచుకోటకు వెళ్ళే మార్గాన్ని తెలిపే పటం తీసుకున్నాడు. తరవాత భటులతో కలిసి, అతడు రుద్రపురం చేరాడు. పురవాసులు చంద్రవర్మను చూస్తూనే 'మహా మాంత్రికుడికి జై!' అంటూ కేకలు పెట్టి గొప్పగా స్వాగతం చెప్పారు. తరవాత—]

చంద్రవర్మ రాజప్రాసాదాన్ని సమీపించే సరికి, ముఖద్వారం దగ్గిర రాజు శివసింహుడూ, మంత్రులూ, రాజోద్యోగులూ అతడికి ఎదురువచ్చి ఘనంగా స్వాగతం యిచ్చారు. చంద్రవర్మ గుర్రం దిగగానే రాజు అతడి దగ్గిరకు వచ్చి, ఎంతో ఆప్యాయంగా అతడి భుజం మీద చెయివేసి, "చంద్రవర్మా, ఇంత చిన్న వయసులో, నీ అంత గొప్ప మంత్రవేత్త లయినవాళ్ళు ఏ కాలంలోనూ లేరను కుంటాను. నా రాజ్యపు సరిహద్దుల్లో నివాసం ఏర్పరచుకుని, మహా కంటకుడుగా తయారైన శంఖుణ్ణి నీవు హతమార్చటం చూసి, నేనూ నా ప్రజలూ చాలా ఆనందపడ్డాం," అన్నాడు.

రాజు శివసింహుడు యిలా అనగానే చంద్రవర్మ ఎంతో ఆశ్చర్యపోయాడు. కాని, అతడు తన ఆశ్చర్యాన్ని బయటికి



కనబరచకుండా చిరునవ్వు నవ్వి. "ఆ శంఖుడు పరమ దుష్టుడు, మహాపాపి. అందుకే వాణ్ణి యమపురికి పంపాను." అన్నాడు.

"ఆ శంఖుడి కొండపై ప్రస్తుతం వుంటున్న నీ స్నేహితుడు కాలకేతుడి ద్వారా నిన్ను గురించి సర్వం తెలుసుకున్నాను. అతడి సలహాను పాటించే నిన్ను కంచుకోటకు వెళ్ళిరావలసిందిగా కోరేందుకు, నా భటులచేత యిక్కడికి ఆహ్వానించటం జరిగింది." అన్నాడు శివసింహుడు.

"కంచుకోట! అదెంతపని!" అంటూ చంద్రవర్మ చిరునవ్వు నవ్వాడు.

అంతలో మంత్రి రాజు చెవిలో ఏదో చెప్పగానే, రాజు ప్రాసాదం కేసి నడుస్తూ, "చంద్రవర్మా! నువ్వు ప్రయాణ బడలికలో వుండి వుంటావు. భోజనం చేసి విశ్రాంతి తీసుకున్న తరవాత అన్ని సంగతులూ వివరంగా మాట్లాడుకుందాం." అన్నాడు.

చంద్రవర్మకు రాజగృహంలో చక్కని విడిది ఏర్పాటు చేయబడింది. అతడు స్నానం ముగించి రాగానే, రకరకాల పిండివంటలతో భోజనం పెట్టారు. తరవాత చంద్రవర్మ పట్టుపరుపులూ, బాలీశులూ పరచివున్న మంచం మీద పడుకుని నిద్రపోయేందుకు ప్రయత్నించాడు. కాని, అతడికి ఎంతకీ నిద్రపట్టలేదు. శంఖుడి కొండ మీద వుంటున్న కాపాలినీ, కాలకేతుల ద్వారా శివసింహుడు తనను గురించి కొంత తెలుసుకున్నాడు. కంచుకోటను చేరగలవాడు తనొక్కడే అని కాలకేతుడు శివసింహుడితో చెప్పటంలో వున్న రహస్యం ఏమిటి?

ఈ విషయాన్ని గురించి కొంచెం సేపు తీవ్రంగా ఆలోచించేసరికి, చంద్రవర్మకు కాలకేతుడి ఎత్తుగడ ఏమిటో తెలిసిపోయింది. తను తిరిగి రాజ్యం జయించుకునేందుకు డబ్బూ, బలగమూ కావాలి. వాటిని సంపాయించటానికి కంచుకోటలో

వున్నవని చెప్పబడే ధనరాసులు ఎంతో సహాయపడగలవు.

చంద్రవర్మ యిలాంటి ఆలోచనల్లో వుండగా సేవకుడొకడు వచ్చి, రాజుగారూ, ప్రధానమంత్రీ ఆతడికోసం సమాలోచన మందిరంలో వేచివున్నట్టుగా వర్తమానం చెప్పిపోయాడు. చంద్రవర్మ కొద్దిసేపటి కల్లా సమాలోచన మందిరానికి వెళ్ళాడు.

"చంద్రవర్మా, నేను కంచుకోటలో వున్న ధనరాసులకోసం ఆశించటం లేదు. ఆ సంగతి ముందుగానే నీతో చెప్పటం మంచిదని చెపుతున్నాను," అన్నాడు రాజు శివసింహుడు. చంద్రవర్మ తల డించి వూరుకున్నాడు.

"అయితే, ఆ కంచుకోటను గురించి నాకింత ఆసక్తి ఎందుకన్న ప్రశ్న వస్తుంది. దానికి నే నివ్వబోయే సమాధానం కొంత చిత్రంగా వుండవచ్చు. కాని, అది ముమ్మాటికీ సత్యం. ఆ కంచుకోట సముద్రతీరాన వున్నదని తెలుసుగదా?" అన్నాడు రాజు.

"అవును. పడమటి సముద్రతీరం. వెయ్యి సంవత్సరాల ఈ మధ్య దానిని చూసిన మానవ మాత్రుడెవడూ లేడు," అన్నాడు చంద్రవర్మ.

ఈ మాటలు వింటూనే మంత్రి ఆశ్చర్యంగా రాజుకేసి చూశాడు. రాజు



తల పంకించి, "కావచ్చు. ఆ కంచుకోట గోడలను ఒకపక్క సముద్రజలం తాకుతూ వుంటుందని చాలామంది నమ్మకం, అవునా?" అన్నాడు.

"అలా అనే నేనూ విన్నాను." అన్నాడు చంద్రవర్మ.

"ఆ గోడపక్కన వున్న సముద్రజలంలో, ఒక మాంత్రికుడివల్ల కంచు కుండల్లో బంధించబడిన కొన్ని అపురూప ప్రాణులు వున్నవని మా పూర్వీకుల నమ్మకం. మా తండ్రిగారు వాటికోసం ఎంతో ప్రయత్నించారు. కాని ఫలితం కలగలేదు. ఇచ్ఛామాత్రంగా మానవ రూపాన్ని, అంతలోనే మహా కాలనాగు

రూపాన్ని ధరించగల నీ స్నేహితుడు కాలకేతుడి ద్వారా, ఆ కంచుకుండలను నువ్వు తేగలవన్న ఆశ నాకు కలిగింది.'' అన్నాడు రాజు శివసింహుడు.

రాజు మాటలు వింటూనే చంద్రవర్మ యిందులో పెద్ద మోసం వున్నదని గ్రహించాడు. అపురూపప్రాణులున్నవని చెప్పబడే కంచుకుండలకోసం ఎవరూ యింత శ్రమపడరు. శివసింహుడికి కావలసింది కంచుకోటలో వున్నదనబడే ధనం. దానిని సాధించటం అతడివల్ల కాక, మంత్రశక్తులున్నవని భ్రమపడి తన సహాయం కోరుతున్నాడు. నిజంగానే కంచుకోటలో ధనరాసులు దొరికితే, వాటిని శివసింహుడిపాల పడకుండా, మోసానికి ప్రతిగా మరింత మోసాన్ని ప్రయోగించి తనవిగా చేసుకోగలనన్న ధైర్యం చంద్రవర్మకు కలిగింది.

''నాబోటి మంత్రవేత్తలకు కావలసింది, యిటువంటి కష్టసాధ్యమైన కార్యాలను సాధించటమే. నేను కంచుకోటకు వెళతాను. నా వెంట కొద్ది సిబ్బందిని పంపండి. వాళ్ళల్లో దేవలుడనే యువకుడు కూడా వుండటం అవసరం!'' అంటూ చంద్రవర్మ తన అరచేతికేసి పరీక్షగా చూసుకున్నాడు.

రాజు శివసింహుడూ, మంత్రి ముఖముఖాలు చూసుకున్నారు. ఓ క్షణకాలం ఆగి రాజు చంద్రవర్మతో, ''ఆ దేవలుడి తండ్రి అయిన ముసలివాడు అరణ్యంలో



తిరుగుతున్నాడు. వాణ్ణి నువ్వు కలుసుకున్నావా?'' అన్నారు.

''ఎవడా ముసలివాడు? ఓహో....'' అంటూ చంద్రవర్మ తన అరచేతికేసి మరింత తీవ్రంగా చూసి, ''అతడు అడవిలోనే ఒక పూరిగుడిసెలో వున్నాడు. అతడికి అవసరమైన సౌకర్యాలన్నీ కలిగించండి. ఒకవేళ అతడు నగరానికి వచ్చి వుంటానంటే, అందుకు ఆవసరం అయిన ఏర్పాట్లు చేయండి. నేను కంచుకోటను చేరగలగటం, ఆ ముసలివాడి మీదా, అతడి కొడుకు దేవలుడి మీదా ఆధారపడి వున్నది.'' అన్నాడు.

చంద్రవర్మ చెప్పినదానికి రాజుగాని మంత్రిగాని కిక్కురుమనలేదు. ''అలాగే. అలాగే! నువ్వు చెప్పినట్టే చేస్తాను. దేవలుణ్ణి నువ్వు వెంటపెట్టుకుపోవచ్చు. నీకు రక్షణగా ఒక వెయ్యిమంది సైనికులు వుంటే సరిపోతుందా?'' అన్నాడు రాజు.

ఆ మాటలకు చంద్రవర్మ బిగ్గరగా నవ్వి, ''నేను వెళుతున్నది ఎవరి మీదా యుద్ధానికి కాదు. ఒకవేళ యుద్ధమే చేయవలసివస్తే ...అది అదృశ్యంగా వుండి నా మార్గాన్ని ఆటకాయించే దుష్టశక్తుల మీద చేయవలసి వస్తుంది. దానికి నా మంత్రశక్తి తప్ప, మీ సైనికులు ఏమాత్రం సహాయకారులు కారు. నాకు కావలసిందల్లా ఆహారపదార్థాలు మోసేందుకు కొన్ని గాడిదలూ, వాటిని తోలేవాళ్ళూ, నా వెంట ఓ పదిమంది అనుచరులుంటే





పేరు గుర్తుకొచ్చింది. అతడూ, తనకు విశ్వాసపాత్రుడైన సేవకుడు సుబాహుడూ ఏమైపోయూరో అని చంద్రవర్మ విచారంగా ఒక నిట్టూర్పు విడిచాడు.

"మహారాజా, మీకు తోచిన విధంగా చేయండి. రేపు సూర్యోదయం వేళ నా ప్రయాణం. కంచుకోటకు వెళ్ళే లోపల నేను మహారణ్యాలనూ, కొండలనూ, ఎడారులనూ దాటవలసి వుంటుంది. ఆహారపదార్థాలను మోసే జంతువులను, ఏ ప్రాంతానికి తగినవాటిని ఆ ప్రాంతంలో నేను ఉపయోగించవలసి వుంటుంది. అందువల్ల ఎడారుల్లో ప్రయాణించే టప్పుడు నాకు ఒంటెల అవసరం కూడా కలగవచ్చు. ఆ ఏర్పాట్లన్నీ సరిహద్దుల్లో వున్న మీ మండలాధిపతి వీరమల్లుడు చూసేలా తగిన ఏర్పాటు చేయండి." అన్నాడు చంద్రవర్మ.

"అవన్నీ నేను చూస్తాను. నువ్వేమీ ఆదుర్దాపడనవసరం లేదు." అన్నాడు రాజు శివసింహుడు.

మర్నాటి ఉదయం కంచుకోటదిక్కుగా చంద్రవర్మ ప్రయాణం ప్రారంభమైంది. శివపురం పొలిమేరలవరకూ రాజూ, మంత్రులూ, ప్రజలూ వెంట వచ్చి, చంద్రవర్మను సాగనంపారు. అతడి వెంట ముఖ్యానుచరుడుగా మునలివాడి కొడుకు

సరిపోతుంది. వాళ్ళు సైనికులే కానవసరం లేదు." అన్నాడు.

"అలా కాదు. నా ఉద్యోగుల్లో నమ్మకస్థులూ, ధైర్య సాహసాలు కలవాళ్ళుగా చూసి నలుగురైదుగురిని నీ వెంట పంపుతాను. వారి వెంట ఓ యాభైమంది సైనికు లుంటారు. నా రాజ్యపు ఎల్లలు దాటి నువ్వు పడమటి కనుమలు ప్రవేశించే ముందు, ఆ ప్రాంతాలకు మండలాధీశుడుగా వున్న వీరమల్లుడు, నీకు కావలసిన యితర సహాయమేదైనా వుంటే, అది చేస్తాడు." అన్నాడు రాజు.

వీరమల్లుడన్న పేరు వింటూనే చంద్రవర్మకు తన సేనానాయకుడు ధీరమల్లుడి

దేవపలుడున్నాడు. అతణ్ణి ఆ కిందటి రాత్రే కారాగారం నుంచి విడుదల చేశారు.

అడవులగుండా చంద్రవర్మ కొన్ని యోజనాల దూరం ప్రయాణం చేశాడు. అతడికి ముసలివాడు యిచ్చిన పటం మార్గాన్ని తెలుసుకునేందుకు అంతగా ఉపయోగించలేదు. కీకారణ్యాలూ, ఎత్తయిన కొండలూ తప్ప చంద్రవర్మకు ఎక్కడా మానవ సంచారం కనిపించలేదు. తను పడమటి దిక్కుగా పోతున్నదీ, లేక మార్గం తప్పినదీ-తెలుసుకునేందుకు అతడికి సూర్యోదయం, సూర్యాస్తమయాలే గుర్తులు.



ఇలా కొన్ని దినాలు ప్రయాణించిన తరవాత ఒకనాటి సూర్యోదయం వేళ దేవపలుడు ఒక ఎత్తయిన రాతి మీద నుంచి పెద్దగా చప్పట్లుచరుస్తూ, "అదుగో, మనం ఏదో శిథిలనగరాన్ని చేరాం. ఇదే కంచుకోట కావచ్చు!" అని కేకలు పెట్టాడు.

ఆ కేకలు వింటూనే, చంద్రవర్మా అతడి వెంట వున్న రాజోద్యోగులూ పరిగెత్తుకుంటూ దేవపలుడున్న చోటుకు వెళ్ళి, అతడు చెప్పిన దిక్కుగా దృష్టి సారించారు. ఎదురుగా కొండ దిగువను శిథిలావస్థలో వున్న ఒక మహానగరం వారి కంట బడింది. పడిపోయిన గోడలూ, ఒక పక్కకు ఒరిగి కూలటానికి సిద్ధంగా వున్న ఇంటి కప్పులూ, వాటి మధ్య చిత్తవెత్తుగా పెరిగిన చెట్టు చేమలూ—ఆ ప్రదేశమంతా భీతి కొల్పేలా వున్నది.

"ఇది కంచుకోట కాదు. అయినా మనం ఒకసారి ఆ శిథిలగృహాలను పరీక్షించి చూడటం మంచిది. నా వెంట రండి!" అంటూ చంద్రవర్మ రాతి మీది నుంచి దిగి శిథిల గృహాలకేసి బయలుదేరాడు.

అందరూ కలిసి వాటిని సమీపించే సరికి ఒకానొక పాడుబడ్డ ఇంటిముందు ఆడుకుంటూ వున్న మూడు పులిపిల్లలు వారికి కనిపించినై. అవి చంద్రవర్మనూ,

అతడి వెంట వున్నవారినీ చూస్తూనే బుసలుకొట్టి ఒక్క గంతులో రాళ్ల వెనకకు పారిపోయినై. ఆ మరుక్షణం పులి పెద్దగా గాండ్రించిన చప్పుడు వినబడింది.

ఆ ధ్వని వింటూనే చంద్రవర్మ ఠక్కున అక్కడే ఆగి, "మనం ఈ ఇంటిని సమీపించటం క్షేమం కాదు. మరో వైపుగా వెళదాం," అంటూ ఇంకో దిక్కుగా దారి తీశాడు.

దాదాపు అయిదారు ఆమడల వైశాల్యం వున్న ఆ శిథిలనగరంలో వారి కెక్కడా మానవమాత్రుడున్న సూచనలు కనిపించ లేదు. అక్కడ వున్న ప్రతి గృహం శిథిలావస్థలోనే వున్నది. కొన్ని కాలిపోయి నల్లగా మసిపూసినట్టున్నవి. ఒకప్పుడు మానవులు నివసించిన ఆ గృహాల్లో యిప్పుడు అడవి పందులూ, చిరుతపులులూ లాంటి అడవి మృగాలు స్థావరం ఏర్పరుచుకున్నవి.

చంద్రవర్మ నగరం మధ్యకు వచ్చేసరికి అక్కడ ఎత్తయిన ఒక శిలాఫలకం కనిపించింది. దాని మీద కనిపించి కనిపించనట్టుగా కొన్ని అక్షరాలు చెక్కబడి వున్నవి. చంద్రవర్మ శిలాఫలకాన్ని సమీపించి అక్షరం అక్షరాన్ని కూడబలుక్కుంటూ మొత్తం శాసనాన్ని చదివాడు. అందులో వున్న ముఖ్య విషయం ఇది:

ఇది కరవీరపురము. వెయ్యి సంవత్సరాలు సర్వసంపదలతో తులతూగిన ఈ నగరాన్ని ఉత్తర దిశ నుంచి వచ్చిన బర్బరులనబడే జాతివారు కొల్లగొట్టి, ఆ ధనాన్ని తమ రాజధాని కంచుకోటకు చేరవేశారు.

చంద్రవర్మ శాసనాన్ని చదివి తన అనుచరులకేసి తిరిగి, "ఇక మనం యిక్కడ కాలాన్ని వృథాపుచ్చటం మంచిది కాదు. ఈ శిథిల నగరంలో రాళ్ళూ రప్పలూ తప్ప మరేం లేవు. ఇది కంచుకోట కాదు. బయలుదేరండి." అన్నాడు.

అందరూ తిరిగి పడమటి దిక్కుగా ప్రయాణమయారు. —(ఇంకావుంది)






## 16

[కంచుకోటకు వెళ్లేందుకు రుద్రపురం రాజైన శివసింహుడు చంద్రవర్మకు సహాయ పడ్డాడు. చంద్రవర్మ నలుగురు రాజోద్యోగులనూ, కొందరు సైనికులనూ వెంటబెట్టుకుని పడమటిదిక్కుగా బయలుదేరాడు. మార్గంలో వారికి ఒక శిథిలనగరం కనబడింది. అక్కడ వున్న శాసనంద్వారా అది కరవీరపురం అని చంద్రవర్మ తెలుసుకున్నాడు. తరవాత—]

కరవీరపురం శిథిలాలను దాటి పడమటి దిక్కుగా కొంతదూరం ప్రయాణించిన తరవాత హఠాత్తుగా, చంద్రవర్మ మార్గాన ఎత్తయిన పర్వతాలు కనిపించినై. ఆ పర్వతాలను దాటి అవతలి వైపుకు చేరటం కఠిన సమస్యగా పరిణమించింది. పర్వత ప్రాంతమంతా ఎగుడుదిగుడు రాళ్ల మయం. ఆహార పదార్థాలను మోసుకువస్తున్న కంచరగాడిదలు కాలూని పర్వత పైభాగాన్ని చేరేందుకు ఏమాత్రం అవకాశం లేదు.

"ఎవరు మోయగలిగినన్ని ఆహార ధాన్యాలు వాళ్లు భుజాన వేసుకుని పర్వతం ఎక్కటం ఒకటే మన కున్న మార్గాంతరం. కంచరగాడిదలను ఈ అడవిలో వదలవలసిందే," అన్నాడు చంద్రవర్మ.

దీనికి మొదట్లో శివసింహుడు పంపిన నలుగురు రాజోద్యోగులూ అభ్యంతరం చెప్పారు. "కొండ అవతల ఏమున్నదో మనకు తెలియదు. బహుశా అక్కడ ఆహార పదార్థాలు లభ్యం కాకపోవచ్చు. అలాం










టప్పుడు కంచరగాడిదలమీద వున్న ఆహార ధాన్యాల్లో ఎక్కువ భాగం అడవిలో వదిలి పెట్టి, మనిషి మోయగలిగినన్ని మాత్రమే తీసుకుని, కొండ అవతలికి వెళ్లటం ప్రమాదకరం," అన్నారు వాళ్లు.

"ఈ కొండ ఎక్కేందుకు ఎక్కడా కాలిబాటకూడా వున్నట్టు లేదు. మనమే తాళ్లు పట్టుకుని వాటి ఆసరాతో కొండ ఎక్కవలసి వుంటుంది. అలాంటప్పుడు కంచరగాడిదలనుకూడా మనం కొండపైకి తాళ్లతో ఎలా లాగగలం? కనుక కొంత ఆహార ధాన్యాన్నీ, కంచరగాడిదలనూ ఈ అడవి పాలు చేయవలసిందే, తప్పదు!" అన్నాడు చంద్రవర్మ. ఈ చెప్పినదానికి ఆ నలుగురు రాజోద్యోగులూ తప్ప తతిమ్మావాళ్లు ఆమోదం తెలిపారు. ఆ వెంటనే గాడిదల మీదనుంచి బరువులు దించి, వాటిలో ఎవరు మోయగలిగినన్ని వాళ్లు మూటలు కట్టుకుని, వాటిని తలమీదా, భుజాలమీదా ఎత్తుకుని అందరూ కొండ ఎక్కటం ప్రారంభించారు.

ఈ కొండ ఎక్కే ప్రయత్నం సూర్యోదయంవేళ ప్రారంభమయింది. సరిగా మిట్టమధ్యాన్నం వేళకు వాళ్లు కొండమీద ఒకానొక చదునుప్రదేశాన్ని చేరారు. అక్కడ అన్నాలు వండుకు తిని, కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్న తరవాత, తిరిగి కొండ ఎక్కే పని ప్రారంభమయింది. సాయంకాలమై, సూర్యాస్తమయం ఒకటి రెండు ఘడియల్లో అవుతుందనగా వాళ్లు కొండ శిఖరాన్ని చేరారు.

అందరికన్న ముందుగా శిఖరాన్ని చేరిన చంద్రవర్మా, దేవలుడూ తమ కంట బడిన అద్భుతదృశ్యం చూసి మహదానందం పొందారు. కొండకు దిగువగా వారికి ఒక మహనగరం కనిపించింది. ఆ నగరంలోని ఎత్తయిన భవనాలమీద సూర్యకాంతి పడి కళ్లకు మిరుమిట్లు గొలుపుతున్నది. నగరా











నికీ, కొండకూ మధ్యనున్న ప్రదేశంలో పండ్ల తోటలూ, పంటపొలాలూ సమృద్ధిగా వున్నవి.

ఈ నగరం ఎవరిది? దీని పేరేమిటి? అని చంద్రవర్మ ఆశ్చర్యపడుతున్నంతలో రాజోద్యోగుల్లో ఒకడు వారిని సమీపించి, దిగువనున్న నగరంకేసి చూసి, సంతోషంతో ఉక్కిరిబిక్కిరైపోతూ, "శివపురం, శివపురం" అని కేకలుపెట్టాడు.

"ఇది శివపురం అని నీకెలా తెలుసు? ఈ పట్టణానికి లోగడ ఎప్పుడైనా వెళ్లావా?" అని చంద్రవర్మ అతణ్ణి అడిగాడు.

"అయ్యా, ఈ శివపురంలో కొంతకాలం కిందట ఓ నెలరోజులపాటు వున్నాను. ఇది రుద్రపుర రాజ్యానికి పడమటి సరిహద్దు మీద వున్న పట్టణం. ఆ తరవాత అంతా పెద్ద ఎడారి. ఈ శివపుర నగరానికి రాజ ప్రతినిధిగా వుంటున్న వీరమల్లుడు అనబడే ఆయనకూడా నాకు తెలుసు," అన్నాడు రాజోద్యోగి.

"అయితే, నీకు రుద్రపురాన్నుంచి, ఈ పట్టణానికి వెళ్లే మార్గం బాగా తెలుసునన్న మాట! ఆ మాట నాతో ఎన్నడూ అనలేదే!" అన్నాడు చంద్రవర్మ అనుమానంగా.

ఆ ప్రశ్న వింటూనే రాజోద్యోగి కొంచెం బెదురుకుని, "అయ్యా, నేను క్రితంలో ఈ పట్టణానికి వచ్చిన మార్గం యిది కాదు. రాజధానీనగరం రుద్రపురంనుంచి, ఈ శివపురానికి మరేదో మార్గంకూడా ఒకటి వున్నది. అది ఇప్పుడు నాకు బాగా గుర్తు లేదు," అన్నాడు.

చంద్రవర్మ, రాజోద్యోగితో యిలా మాట్లాడుతున్నంతలో కొండకిందినుంచి భేరీ మోగిన ధ్వని వినబడింది. ఆవెంటనే దానికి ప్రత్యుత్తరంగా పట్టణప్రాకారంలోని ఒక బురుజుమీదినుంచి భీకరమైన ఢంకా నినాదం మార్మోగింది. ఆ క్షణంలోనే విల్లంబులూ, ఈటెలూ ధరించిన కొందరు సైనికులు బురుజుమీదికి వచ్చారు.








తమను శత్రువులుగా భావించి నగర రక్షకులు ఈ సంకేతాలతో హెచ్చరికలు చేసుకుంటున్నారని చంద్రవర్మ గ్రహించాడు. బురుజుమీద వున్న సైనికులు తమ మీద బాణాలు ప్రయోగించకముందే తాము మిత్రులమని వాళ్లకు తెలియచెప్పటం అవసరం అని అతడికి తోచింది. వెంటనే చంద్రవర్మ ఒక తెల్లగుడ్డను తన కత్తిమొనతో పైకెత్తి గాలిలో వూపాడు.

బురుజుమీదికి వచ్చిన సైనికులు ఒక క్షణకాలం కొండశిఖరానికేసి చూస్తూ నిలబడిపోయారు. అంతలో ఆజానుబాహుడైన ఒక వ్యక్తి సైనికులను తొలగతోసుకుంటూ ముందుకు వచ్చి, విల్లు ఎక్కుపెట్టి, చంద్రవర్మకేసి బాణం వదిలాడు. రివ్వుమనే శబ్దంతో బాణం వచ్చి చంద్రవర్మకు కొద్ది దూరాన భూమిలో గుచ్చుకుపోయింది. దానికి ఒక కాయితం కట్టబడి వున్నది.

చంద్రవర్మ ఆత్రంగా బాణం అందుకుని, దానికి కట్టివున్న కాయితాన్ని విప్పి చదివాడు. శివపురం కోటబురుజుల రక్షకదళ నాయకుడు, తమ పేరూ, ఊరూ, ఆ ప్రాంతాలకు ఏం పనిమీద వచ్చిందీ తెలపవలసిందిగా అడుగుతున్నాడు. వెంటనే జవాబు రాకపోతే, శత్రువులుగా భావించి సర్వనాశనం చేయగలనని హెచ్చరించాడు.







చంద్రవర్మ, రుద్రపురం రాజు శివ సింహుడు తనకు యిచ్చిన ఆజ్ఞాపత్రాన్ని బాణానికి కట్టి, దానిని కోటబురుజుమీద పడేలా వదిలాడు. కొద్దిసేపటికల్లా బురుజు మీద కోలాహలం బయలుదేరింది. చంద్రవర్మనూ, అతడి అనుచరులనూ ఆహ్వానిస్తున్న సూచనగా సైనికులు జయజయ ధ్వానాలు చేశారు.

కొండమీదినుంచి నగరంవైపుకు వున్న రాతిమెట్లమీదుగా చంద్రవర్మా, అతడివెంట వున్నవారూ నడిచి, కొద్దిసేపటికల్లా, కోట చుట్టూ వున్న అగడ్తను చేరారు. అసరికి అక్కడికి కొందరు సైనికులు వచ్చి గుమిగూడారు. చంద్రవర్మ వారిని చూస్తూనే, ఆశ్చర్యానందాలతో ఉక్కిరిబిక్కిరై పోయాడు. అందుకు కారణం: సైనికులకు ముందుగా సేనానాయకుడి దుస్తుల్లో సుబాహుడు అతడికంట బడటం.

సుబాహుడుకూడా తమ యువరాజైన చంద్రవర్మను త్రుటిలో గుర్తించ గలిగాడు. ఆ వెంటనే అతడు చంద్రవర్మకు హెచ్చరికగా చేయి వూపాడు. దాని భావం: తాము ఒకరినొకరు గుర్తించినట్టు యితరులకు తెలియనివ్వకూడదని. చంద్రవర్మ ఆ సూచనను గ్రహించి, చకచకా ముందుకు నడిచి, సుబాహుణ్ణి సమీపిస్తూ, సగౌరవంగా అతడికి







నమస్కరించి, "మీరు శివపుర సేనానాయకులా? నేను రాజప్రతినిధి వీరమల్లుగారిని కలుసుకోవలసి వుంది. వారితో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలి," అన్నాడు.

"అదెంత పని. ముందుగా మీకూ మీ అనుచరులకూ విడిదీ, భోజన సదుపాయాలూ ఏర్పాటు చేయనివ్వండి. విశ్రాంతి తీసుకున్న తరవాత మీరు రాజప్రతినిధిని చూడవచ్చు," అంటూ సుబాహుడు తన వెంటవున్న సైనికులకు చంద్రవర్మ పరివారాన్ని ఒప్పగించాడు.

సైనికులూ, చంద్రవర్మ అనుచరులూ కోటలోకి వెళ్ళిపోగానే, సుబాహుడు ఎంతో



భక్తిగా చంద్రవర్మకు నమస్కరించి, "మహారాజా! నేను చాలా అదృష్టవంతుణ్ణి. ఈ జన్మలో తిరిగి మీ దర్శనభాగ్యం లభిస్తుందని అనుకోలేదు. ఇంటికి వెళ్ళి అన్ని సంగతులూ మాట్లాడుకుందాం, రండి," అంటూ కోటలోకి దారితీశాడు.

చంద్రవర్మ సుబాహుడి ఇంటికి వెళ్ళిన కొద్దిసేపటికల్లా, ఆతణ్ణిగురించి సర్వం తెలుసుకున్నాడు. ఆనాడు సర్పకేతుడి సైనికుల బారి పడకుండా తప్పించుకునేందుకు చంద్రవర్మతోపాటు నదిలోకి దూకిన తరవాత, సుబాహుడు ఒకానొక కొండలోయలో ఒడ్డుకు చేరి, కొన్నాళ్ళతరవాత ధీరమల్లుణ్ణి ఆ కొండల్లోనే కలుసుకున్నాడు. సర్పకేతుడితో జరిగిన ఆఖరి పోరాటంలో ధీరమల్లుడు పూర్తిగా ఓడిపోయి, మిగిలిన కొద్దిమంది అనుచరులతో కొండల్లో, అడవుల్లో తల దాచుకోవలసి వచ్చింది. కొన్నాళ్ళకు అందరూ కలిసి రుద్రపురం రాజైన శివసింహుడి కొలువులో చేరి, ఆయన పంపగా శివపురానికి వచ్చారు. శివసింహుడి కొలువులో చేరేప్పుడే ధీరమల్లుడు, తన పేరు వీరమల్లుడని చెప్పుకున్నాడు. ప్రమాదవశాన తన ఉనికి సర్పకేతుడికి తెలియకుండా వుండగలందులకే ఆతడీ పని చేశాడు.











చంద్రవర్మ కూడా సుబాహుడితోపాటు తను నదిలో దూకిన తరవాత, జరిగిన సంఘటనలన్నీ ఆతడికి వివరంగా చెప్పాడు. అంతా చెప్పినతరవాత చంద్రవర్మ తను ప్రస్తుతం బయలుదేరిన పనినిగురించి చెపుతూ, కంచుకోట పేరు తేగానే, సుబాహుడు నివ్వెరపోయాడు.

"మహారాజా! మనకు కష్టకాలం పోయి, అదృష్టకాలం సమీపిస్తున్నది. అసలు సంగతి సేనాని ధీరమల్లుడు పట్టణంలో లేడు. ఈ సంగతి మరెవరికీ తెలియకుండా రహస్యంగా వుంచాము. సర్పకేతుడు సైన్యాన్ని వెంటబెట్టుకుని కంచుకోట ప్రాంతానికి వెళుతున్నట్టు మాకు తెలిసింది. ఆతడి బలాబలాలేమిటో తెలుసుకుని, సాధ్యమైతే, ఆతణ్ణి మార్గమధ్యంలో నాశనం చేసేందుకు సేనాని ధీరమల్లుడు రహస్యంగా కొంత సైన్యాన్ని వెంటపెట్టుకుని రెండు రోజులక్రితం నగరాన్నుంచి బయలుదేరిపోయాడు," అన్నాడు సుబాహుడు.

సర్పకేతుడి పేరు వింటూనే చంద్రవర్మ ఉద్రేకంతో వూగిపోయాడు. అది గ్రహించిన సుబాహుడు, "మహారాజా! ఈనాడు సర్పకేతుడు మన వీరపురానికే గాక, మొత్తం మాహిష్మతీరాజ్యానికే చక్రవర్తి. యశోవర్ధన చక్రవర్తి మరణించాడు. ఆయన పెద్ద కుమారుడు తపోవర్ధనుడు విరాగియై అడవులు పట్టి పోయాడు. తను సహాయం చేస్తానని నమ్మించి, గుణవర్ధనుడితో తన అవసరం తీరిపోగానే, సర్పకేతుడు ఆతణ్ణి చంపి, మాహిష్మతీ రాజ్యానికి పట్టాభిషేకం చేసుకున్నాడు," అన్నాడు.

"ఇంత రాజ్యం వుండీ ఆ దుష్టుడికి యింకా ధనదాహం తీరలేదన్నమాట. కంచుకోటలో వున్న సంపదలకోసం బయలుదేరాడు!" అన్నాడు చంద్రవర్మ కటువుగా.

"సర్పకేతుడి ఈ జైత్రయాత్రకు ఒక్క ధనదాహమే కాక, రాజ్యకాంక్ష కూడా









కారణం అయివుంటుంది. ఏది ఏమైనా వాడు హఠాత్తుగా ఈ శివపురంమీద దాడి చేయకపోవటం అదృష్టం అనుకోవాలి. చారులద్వారా మాకే ముందుగా, వాడే మార్గాన పోతున్నదీ తెలిసింది," అన్నాడు సుబాహుడు.

సుబాహుడు యిలా మాట్లాడుతున్నంతలో దూత ఒకడు వచ్చి అతడి చేతికి ఒక పత్రం యిచ్చాడు. సుబాహుడు దాన్ని విప్పి చదువుతూనే వెలవెలపోయి, పూర్తిగా చదివింతరవాత పత్రాన్ని చంద్రవర్మ చేతికి అందించాడు.

చంద్రవర్మ ఆ పత్రాన్ని చదివాడు. అది సేనాని ధీరమల్లుడు సుబాహుడికి రాసింది. అందులో వున్న విషయం యిది. ధీరమల్లుడు తన కొద్ది సైన్యంతో, సర్పకేతుడి గొప్ప సైన్యసమూహాన్ని శివపురానికి ఉత్తరంగా వున్న ఎడారిప్రదేశంలో కలుసుకున్నాడు. సర్పకేతుడివెంట వున్న అన్ని వేలమంది సైనికులతో, తను ముఖాముఖిని పోరాడటం ప్రమాదకరం అని అతడు వెనుతిరగబోయేంతలో, సర్పకేతుడికి ఈ సంగతి కాస్తా తెలిసిపోయింది. అతడు కొంత సైన్యాన్ని వెంటపెట్టుకుని ధీరమల్లుడివెంట బడ్డాడు. ధీరమల్లుడు తన కొద్దిపాటి సైన్యంతో శివపురంకేసి పారిపోయి వస్తున్నాడు. ఆ కారణంవల్ల సుబాహుణ్ణి నగరంలో కొద్దిపాటి సైన్యాన్ని వుంచి, మిగిలిన సేనతో తనకు సహాయం రావలసిందిగా అతడు కోరాడు.

"ఇది అనుకోని దుర్ఘటన, మహారాజా! సేనాని ధీరమల్లుడు ఈ నగర రక్షణలను చేరుకోకముందే, సర్పకేతుడితో అతడికి యుద్ధం తప్పకపోతే, అది మొదట ధీరమల్లుడి ఓటమికీ, తరవాత ఈ నగర నాశనానికీ దారితీస్తుంది. మనం సేనతో అతడికి రక్షణగా వెళ్ళటం మంచిది," అన్నాడు సుబాహుడు. —(ఇంకా వుంది)








## 17

[ చంద్రవర్మకు శివపురం అనే పట్టణంలో సుబాహుడు కనిపించాడు. అతడిద్వారా చంద్రవర్మకు సేనాని ధీరమల్లుణ్ణి గురించి తెలిసింది. ఆ సమయంలో ఒక దూత వచ్చి, సేనాని ధీరమల్లుణ్ణి, సర్పకేతుడు పెద్ద సైన్యంతో వెంటబడి తరుముతున్నట్టు వార్త చెప్పాడు. సుబాహుడు ధీరమల్లుడికి సహాయంగా వెళ్ళటం మంచిదన్నాడు. తరవాత—]

చంద్రవర్మకుకూడా ఆ పరిస్థితుల్లో సుబాహుడు చెప్పిందే ఉత్తమ మార్గంగా తోచింది. క్షణాలమీద నగరంలోని సైనికులంతా ఒక చోటికి చేర్చబడ్డారు.

కొద్దిసేపటిలో సైన్యమంతా నగర ప్రాకారాలు దాటి ఉత్తర దిక్కుకేసి కదిలింది. చంద్రవర్మా, సుబాహుడూ సైన్యానికి ముందుభాగాన వున్న అశ్వసైనికుల వెంట వున్నారు. రాత్రంతా సైన్యం ఆగకుండా ముందుకు కదులుతూనే వున్నది. ఇంకా సూర్యోదయం కావటానికి ఒకటి రెండు ఘడియలుండనగా ఒక కొండమలుపు నుంచి పరిగెత్తుకు వస్తున్న గుర్రాల గిట్టల చప్పుడు వినిపించింది. ఆ వచ్చేది మిత్రులో, శత్రువులో తెలుసుకునేందుకు సుబాహుడూ, చంద్రవర్మా పదిమంది రౌతులతో సైన్యాన్నుంచి వేరుపడి, అతి వేగంగా ముందుకు వెళ్ళారు. సరిగా కొండమలుపులో నలుగురు అశ్వికులు వారికి ఎదురయారు. మసక చీకటిలో సుభాహుణ్ణి చూస్తూనే వాళ్లు తమ







గుర్రాలను ఆపి, "సేనానీ, రాజప్రతినిధి వీరమల్లు మమ్మల్ని పంపాడు. సర్పకేతు డనే రాజు సైన్యాలు నగరంకేసి పారిపోయి వస్తున్న మన సైనికులను అడ్డవారివెంట వచ్చి ఆటకాయించినై పోరాటం జరిగింది. మనవాళ్లు చాలామంది మరణించారు. రాజప్రతినిధి తన అశ్వికులతో, శత్రువులు వేగంగా నగరంకేసి రాకుండా అడ్డుతూ తిరోగమిస్తున్నారు," అని చెప్పారు.

సైనికులు యిలా చెపుతూన్నంతలో మరి కొందరు గుర్రపు రౌతులు వారికేసి రావటం కనిపించింది. చూస్తూన్నంతలో ధీరమల్లుడు మహవేగంతో వారిని సమీపించి, "సుబాహూ! ఇక మనం నగరరక్షణకు వెళ్లవలసిందే. సర్పకేతుడితో " అంటూ మాట మధ్యలో ఆగి, చంద్రవర్మకేసి చూసి ముఖంలో ఆశ్చర్యం కనబరిచి, అంతలోనే ఎక్కడలేని సంతోషంతో గుర్రంమీదినుంచి ఒక్క గెంతున కిందికి దూకి, "మహారాజా!" అంటూ చంద్రవర్మదగ్గిరకు పరిగెత్తుకువచ్చి అతడి చేయి పట్టుకున్నాడు.

"మళ్లీ నిన్ను కలుసుకోగలనన్న నమ్మకం నాకేనాడూ కలగలేదు ధీరమల్లూ! కాని మనం ఇలాంటి విచిత్ర పరిస్థితుల్లో కలుసు కున్నాం. తీరిగ్గా మాట్లాడుకునేందుకు సమయంకాదు. నగరరక్షణకు బయలుదేరు దామా?" అన్నాడు చంద్రవర్మ.

సేనాని ధీరమల్లుడు ఒక్క క్షణకాలం ముందు వున్న సైన్యంకేసీ, వెనకనుంచి పారిపోయి వస్తున్న అశ్వికులకేసీ చూసి, "మహారాజా! మీ రాకతో పరిస్థితి మారి పోయింది. సర్పకేతుడితో ఆఖరు పోరాటం జరపవలసిన సమయం ఆసన్నమయింది. అది నగరంలోగాని, నగరం వెలపలగాని, ఎక్కడైనా ఒకటే. ఇప్పుడు ఈ మార్గాన ముందుకు తోసుకువస్తున్నది ముఖ్యంగా అతడి అశ్వసైన్యం. కాల్బలమంతా ఆ కొండ వెనక మైదానంలో వున్నది. మనం









వ్యూహం పన్నటానికి కొంచెం వ్యవధి కావాలి," అంటూ సుబాహుడికేసి తిరిగి, "సుబాహూ! సైన్యాన్నంతా పక్కకు మళ్లించి ఆ కనబడే కొండ కనుమలోకి తీసుకుపో. కనుమద్వారాన్ని కాపాడుకోవ టానికి కొద్ది సైన్యం చాలు. అక్కడ కొద్ది మంది అశ్వికుల్నీ, గురిగాళ్లయిన కొంత మంది విలుకాళ్లనూ కాపలా వుంచు," అంటూ చంద్రవర్మతో కలిసి కనుమద్వారం కేసి బయలుదేరాడు.

కొద్దిసేపటికల్లా సైన్యమంతా కనుమలో ప్రవేశించింది. చంద్రవర్మ ధీరమల్లుడితో, తను వీరపురం వదిలిపోయిన తరవాత, తనకు తటస్థపడిన కష్టసుఖాలను గురించి సంగ్రహంగా చెప్పాడు. అంతా శ్రద్ధగా విన్న ధీరమల్లుడు ఎంతో వినయంగా చంద్ర వర్మతో, "మహారాజా! నేనూ, సుబాహుడూ పడ్డ కష్టాలూ, చివరకు ఈ శివసింహరాజు కొలువులో చేరి, ఆయన ప్రతినిధిగా శివ పురానికి రావటం — అంతా సుబాహుడు మీకు చెప్పేవుంటాడు. ఈనాడు తలవని తలంపుగా మనకు సర్పకేతుడితో పోరు తట స్థించింది. ఆ దుష్టుడితో ఏదో ఒకనాడు మనం యుద్ధం చేయక తప్పదుగదా? ఆ పని యిప్పుడే చేద్దాం. ఇందులో విజయమో, వీరస్వర్గమో — అంతకన్న మనకు మరో మార్గం లేదు!" అన్నాడు.

"అవును, ధీరమల్లా! మనం స్వదేశం వదిలి, ఈవిధంగా దేశాలు పట్టుకు తిరగ టంలో అర్థంలేదు. సైన్యాన్ని సమాయత్త పరుచు. ఆ సర్పకేతుడితో చావో బతుకో తేల్చుకుందాం," అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ యిలా అంటూండగానే కనుమద్వారం దగ్గిర కలకలం బయలు దేరింది. అక్కడ కాపలావున్న విలుకాళ్ళు బాణాలు ఎక్కుపెట్టి, ముఖద్వారంకేసి రివ్వురివ్వుమని వదులుతున్నారు. కొందరు అశ్వికులు గుర్రాలను ముందుకు దూకించి






తమ చేతగల ఈటెలతో కనుమలోకి చొచ్చుకురా ప్రయత్నిస్తున్న శత్రు అశ్వికులను పొడుస్తున్నారు.

"మహరాజా! సర్పకేతుడు కనుమలోకి ప్రవేశించేందుకు ప్రయత్నిస్తున్నాడు. ఆ ఇరుకు మార్గంలో వాడిని రెండువైపులనుంచి ఎదుర్కొని నాశనం చేయటమే మన వ్యూహం," అంటూ సేనాని ధీరమల్లుడు చెంగున గుర్రంమీదికి ఎగిరాడు. చంద్రవర్మ కూడా ఒక్క గెంతున తన అశ్వాన్ని అధిరోహించాడు.

చంద్రవర్మా, ధీరమల్లుడూ కలిసి క్షణాల మీద తమ సైన్యాన్ని రెండుగా భాగించి, కనుమకు రెండువైపులా నిలబెట్టారు. సుబాహుడు కొద్దిమంది కాల్బల సైనికులతో, అశ్వికులతో కనుమ ద్వార రక్షణకు పూనుకున్నాడు.

క్రమంగా సర్పకేతుడి సైన్యం యిరుకైన కనుమ ద్వారాన్నుంచి లోపల ప్రవేశించేందుకు గట్టి ప్రయత్నం ప్రారంభించింది. వందల వేల సంఖ్యలో వున్న అతడి అశ్వికులూ, కాలిబంట్లూ ప్రళయ భయంకరంగా గర్జిస్తూ, కనుమలోకి తోసుకువచ్చేందుకు ప్రయత్నించ సాగారు. వారిలో చాలామంది ద్వారందగ్గిరే సుబాహుడి అశ్వికుల ఈటెపోటులకూ, విలుకాళ్ళ అంబుల దెబ్బకూ



హతం కాసాగారు. వాళ్ళను తప్పుకొని ముందుకువచ్చిన సైనికులను, చంద్రవర్మా, ధీరమల్లుడూ తుద ముట్టించుతున్నారు.

పోరాటం యీ విధంగా కొంతసేపు సాగే సరికి, శత్రుసైనికులతోపాటు కొంతమంది చంద్రవర్మ సైనికులుకూడా మరణించటం జరిగింది. శత్రువులు అసంఖ్యాకులు. తమ సైన్యం బహుకొద్ది. సర్పకేతుడు మరికొంత సైన్యాన్ని కనుమద్వారంమీద దాడికి ఉపయోగిస్తే, తాము చిక్కులో పడిపోగలమని చంద్రవర్మా, ధీరమల్లుడూ వూహించారు.

వాళ్ళిద్దరూ మార్గాంతరం ఏమిటా అని ఆలోచిస్తున్నంతలో సర్పకేతుడి కంచు కంఠం కనుమద్వారందగ్గిర మార్మోగింది.

"ఆ చంద్రవర్మా, ధీరమల్లుడి తలలు తెచ్చినవాడికి లక్ష వరహాలు యిస్తాను. ఆ పరగణా కంతటికీ సామంతరాజును చేస్తాను. ముందుకు దూకండి. హేయ్!" అంటూ సర్పకేతుడు తన సైనికులను హెచ్చరిస్తున్నాడు.

కన్నుమూసి తెరిచేంతలో కనుమ ముఖద్వారం భయంకర యుద్ధరంగంగా మారిపోయింది. సర్పకేతుడు యిస్తానన్న బహుమానాన్ని ఆశించిన శత్రుసైనికులు అన్నిటికీ తెగించి సన్నని కనుమద్వారం గుండా లోపలికి వచ్చేందుకు పోటీలు పడి







యుద్ధం చేయసాగారు. సుబాహుడివద్ద వున్న కొద్ది సైన్యానికి తోడుగా ధీరమల్లుడు మరి కొంత సైన్యాన్ని పంపాడు. కాని సర్పకేతుడి సైనికులు చచ్చిన, చావనున్న తమ తోటి వాళ్ళమీదుగా గుర్రాలను దూకిస్తూ క్రమంగా ముందుకు తోసుకువస్తున్నారు.

హఠాత్తుగా చంద్రవర్మ తన గుర్రాన్ని ధీరమల్లుడి గుర్రంకేసి దూకించి, "ధీర మల్లా! నాకొక వుపాయం తోస్తున్నది. మనం కొంత సైన్యంతో, ఆ కనబడే రాళ్ళ గుట్టలమీదుగా ఎక్కి అవతలికి పోయి వెనక నుంచి సర్పకేతుడి సైన్యాన్ని ఎదిరించటం బావుంటుంది. ఒకవేళ అవతలికి దిగటం సాధ్యం కాకపోతే, ఆ రాళ్ళగుట్టల చాటునే వుండి మన విలుకాళ్ళు, శత్రువులమీద బాణాలు ప్రయోగించవచ్చు. అప్పుడు సర్ప కేతుడు తప్పనిసరిగా కొంతసైన్యాన్ని కనుమ ముఖద్వారాన్నుంచి వెనక్కు మళ్ళించి తిసుతాడు," అన్నాడు.

"అవును, మహారాజా! మనం ఈపరి స్థితుల్లో ఏదోఒకటి చేసి తీరాలి. శత్రుసైన్య మంతా ఒక్కసారిగా కనుమలో ప్రవేశిస్తే, యిక మనకు పారిపోయేందుకూడా మార్గం లేకుండా పోతుంది," అన్నాడు సేనాని ధీరమల్లుడు.

చంద్రవర్మ కొందరు విలుకాళ్ళను వెంట బెట్టుకుని పెద్దపెద్ద బండరాళ్ళమీదుగా పాకుతూ పైకెక్కి, కనుమముందు వున్న మైదానంకేసి చూశాడు. అతడి కంటబడిన దృశ్యం ఎంత ధైర్యశాలినైనా భీమవుగా చేసేలా వుంది. పదుల వేల సంఖ్యలో వున్న సర్పకేతుడి అశ్వసైన్యం, కాల్బలం కనుమ ముఖద్వారంకేసి కదులుతున్నది. అంత గొప్ప సైన్యాన్ని యుద్ధంచేసి ఎలా ఓడించ గలను? అనుకున్నాడు చంద్రవర్మ. మహా అయితే తనూ, ధీరమల్లుడూ, సుబాహుడూ, మునలివాడి కొడుకు దేవలుడూ శత్రువుల చేత పడకుండా పారిపోవచ్చు. ఆ తరవాత,







తిరిగి తనకు అరణ్యాలు పట్టుకు తిరిగే జీవితం ప్రారంభమవుతుంది.

చంద్రవర్మ మనసులో యిలా అనుకుంటూ నిస్పృహగా శత్రుసైన్యం కేసి చూస్తున్నంతలో అతడికి మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. అతడు ఎంతో గుండె నిబ్బరంతో, శత్రుసైన్యం దృష్టికి కనబడేలా ఒక ఎత్తయిన రాతిమీద నిలబడి, ఖంగుమనే కంఠస్వరంతో వాళ్ళనుద్దేశించి యిలా అన్నాడు.

"ఓ సైనికులారా! నేను వీరపుర సామంతుడైన సూర్యవర్మ కుమారుణ్ణి, చంద్రవర్మను! దుష్టుడైన సర్పకేతుడు, మాహిష్మతీ రాజవంశాన్ని ఎంత క్రూరంగా నిర్మూలించి, తను చక్రవర్తి అయాడో మీకందరికీ తెలుసు. నేను తిరిగి మాహిష్మతీ రాజ్య సింహాసనంమీద యశోవర్ధన చక్రవర్తి సంతానంలో మిగిలివున్న తపోవర్ధనుణ్ణి కూర్చోబెట్టదలిచాను. ఒకవేళ ఆయన అందుకు సమ్మతించని పక్షంలో మీకిష్టుడైన మరెవరినైనా సరే చక్రవర్తిని చేయవచ్చు. దుష్టుడూ, కపటీ, క్రూరకర్ముడూ అయిన సర్పకేతుణ్ణి ముందు బంధించాలి. నా వీరపుర సంస్థాన సైనికులెవరైనా మీలో వుంటే వారికి ఈ పని ఒప్పచెపుతున్నాను."

చంద్రవర్మ కంఠస్వరం వింటూనే సైనికులంతా స్థాణువుల్లా అయిపోయారు. అతడు మాట్లాడటం ముగించేసరికి, సైన్యంలో ఒక భాగంనుంచి, "వీరపుర మహారాజుకూ, జై!" అన్న కేకలు వినిపించినై. ఆ వెంటనే సైన్యంలో అక్కడక్కడా కలకలం, తోసుకోవటాలూ, గుమ్ముకోవటాలూ ప్రారంభమయింది. చూస్తూండగానే సైన్యంనుంచి ఒక పెద్ద సమూహం వేరుపడి, చంద్రవర్మ నిలబడివున్న చోటుకు రాసాగింది. ఆ వెంటనే "సర్పకేత మహారాజుకూ, జై!" అన్న కేకలు వినిపించినై. చంద్రవర్మకేసి వస్తున్న అశ్వసైనికులూ, కాల్బల సైనికులూ





చప్పున వెనుదిరిగి, భీకరంగా అరుస్తూ, వాళ్ల మీదికి దూకారు.

చంద్రవర్మ వెనుదిరిగి కనుమలో వున్న సేనాని ధీరమల్లుడితో, "ధీరమల్లా! ఇదే మంచి అవకాశం. సర్పకేతుడి సైన్యంలో ఒక పెద్దభాగం మనపక్షానికి తిరిగింది. వాళ్ళు మిగిలిన వాళ్ళతో పోరాడుతున్నారు. నువ్వు మన భటులనందరినీ హెచ్చరించి, ఒక్కుమ్మడిగా కనుమ ముఖద్వారంమీద దాడిచేసి బయటి మైదానంలోకి రాగలిగావంటే, సర్పకేతుణ్ణి క్షణాలమీద సర్వనాశనం చేయవచ్చు," అని కేకపెట్టాడు.

సేనాని ధీరమల్లుడు తన అనుచరులను హెచ్చరించేలోపలే, సర్పకేతుడు తనకు రానున్న ప్రమాదాన్ని గుర్తించాడు. తన సైనికుల్లో చాలామంది శత్రుపక్షం వహించి తనమీద కత్తిదూయటం చూస్తూనే, అతడు తన అనుచరులను కనుమ ముఖద్వారం నుంచి వెనక్కు రప్పించి, విశ్వాసపాత్రులైన మిగతా సైనికులతో యుద్ధరంగం వదిలి పారిపోసాగాడు.

చంద్రవర్మా, ధీరమల్లుడూ తమ సైన్యాన్ని కూడదీసుకుని, పారిపోతున్న సర్పకేతుడి సైన్యంవెంట పడ్డారు. ఇరుకైన కొండమార్గాలవెంట, నిటారుగావున్న పెద్దపెద్ద రాళ్ళనూ, లోతైన అగాధాలనూ తప్పుకుంటూ చంద్రవర్మ మిట్టమధ్యాన్నం వేళ వరకూ సర్పకేతుడి సైన్యాన్ని తరిమాడు. శత్రు సైనికుల్లో కొద్దిమంది ఆశ్వికులూ, కాలిబంట్లూ అతడిచేతికి దొరికారు. కాని, ముఖ్య సైన్యంతో సర్పకేతుడు చంద్రవర్మకు అందకుండా కొండల్లో చాలాదూరం పారిపోగలిగాడు.

సేనాని ధీరమల్లుడూ, చంద్రవర్మా సంప్రతించుకుని నలుగురు ఆశ్వికుల్నీ, పదిమంది భటులనూ, సర్పకేతుడి జాడ తెలుసుకునేందుకు ముందుకుపంపారు.

—(వచ్చే సంచికలో ముగింపు)






## 18

[శివపురం పొలిమేరల్లో చంద్రవర్మా, సేనాని ధీరమల్లుడూ కలిసి తమ సైన్యాలతో, సర్పకేతుణ్ణి ఒకానొక కొండ కనుమలో ఎదుర్కొన్నారు. సర్పకేతుడి సైనికుల్లో చాలామంది చంద్రవర్మ పక్షానికి వచ్చారు. సర్పకేతుడు మిగిలిన సైన్యంతో పారిపోసాగాడు. చంద్రవర్మ అతడి వెంట కొందరు భటులను పంపాడు. తరవాత—]

సూర్యుడు పడమటి దిక్కుకు బాగా వాలిపోయిన తరవాత, చంద్రవర్మ పంపిన భటుల్లో యిద్దరు తిరిగివచ్చి, సర్పకేతుడి సైన్యం కనబడలేదనీ, కాని, కాలి గుర్తులను బట్టి వాళ్ళు పడమటి దిశకేసి పోతున్నట్టు తెలిసిందనీ వర్తమానం తెచ్చారు.

ఈ వార్త వింటూనే చంద్రవర్మ, ధీరమల్లుకేసి తిరిగి, "ధీరమల్లూ! సర్పకేతుడు మాహిష్మతీ నగరంకేసి పారిపోవటంలేదనీ, అతడు సరాసరి కంచుకోటవైపుకు ప్రయాణం కట్టాడనీ నా అభిప్రాయం," అన్నాడు. సేనాని ధీరమల్లుడూ, సుబాహుడూ కూడా చంద్రవర్మతో ఏకీభవించారు. అయితే యిప్పుడు తాము మాహిష్మతీనగరంకేసి వెళ్ళటమా ? లేక సర్పకేతుణ్ణి అనుసరించి కంచుకోటకు వెళ్ళటమా అన్న సమస్య వచ్చింది. కొద్దిసేపు ఆలోచించిన మీదట కంచుకోటకు వెళ్ళి, అక్కడ సర్పకేతుణ్ణి హతమార్చటమే ఉత్తమమార్గమని వాళ్ళు నిర్ణయించుకున్నారు.







వెంటనే సైనికులందరూ వడవడిగా ప్రయాణానికి సన్నద్ధం చేయబడ్డారు. కొద్ది సేపట్లో సైన్యమంతా కదిలింది. వాళ్లు సర్పకేతుడి సైన్యం నడిచిన గుర్తుల ఆధారంతో కొండల్లోనుంచి బయటపడి కొంతదూరం అడవిమార్గాన ప్రయాణించి, ఒక పెద్ద నది ఒడ్డుకు చేరారు. ఆ నదిని చూస్తూనే చంద్రవర్మ నివ్వెరపోయాడు. ఇంత పెద్ద సైన్యాన్ని నది దాటించటం ఎట్లా? సర్పకేతుడు నదిని ఎలా దాటగలిగాడు?

చంద్రవర్మ యిలా మథనపడుతున్నంతలో, దాపుల వున్న ఒక మహావృక్షం కొమ్మలనుంచి పెద్దగా బుసలుకొడుతూ మూడు తలల మహాసర్పం ఒకటి దభీమంటూ భూమిమీద పడింది. అందరూ భయాశ్చర్యాలతో దానికేసి చూస్తున్నంతలో, ఆ సర్పం మానవరూపం పొంది, "చంద్రవర్మా!" అంటూ ఎలుగెత్తి కేకపెట్టి, అతడికేసి పరిగెత్తుతూ వచ్చింది.

తనను పేరున పిలుస్తూ, సమీపానికి వస్తున్న ఆకారాన్ని చూస్తూనే చంద్రవర్మ ఒక్క గెంతున ముందుకు వెళ్ళి "కాలనేతా? నీవా!" అంటూ అతడి చేయి పట్టుకున్నాడు.

"అవును, వర్మా! నీ దయవల్ల కాలనేతుడుగా మారిన, మంత్రగత్తె కాపాలిని సేవకుడు కాలనాగును నేనే! నీ శత్రువు సర్పకేతుడు యింతకుముందే తన సైన్యంతో నదిని దాటి పోయాడు. అతడు నది దాటేందుకు ఉపయోగించిన తెప్పకొయ్యలనూ, దూలాలనూ అద్దరినుంచి యిద్దరికి చేర్చి అదుగో, ఆ కనబడే చెట్లచాటున వున్న నదిపాయలో భద్రపరిచాను," అన్నాడు కాలనేతుడు. తరవాత అతడు చంద్రవర్మ చేయి పట్టుకుని అతన్ని అల్లంత దూరంలో వున్న చెట్లచాటుకు తీసుకుపోయి, "చంద్రవర్మా! నేను నీకు సహాయం చేయాలన్న వుద్దేశంతో శంఖుది కొండనుంచి హుటా









హుటిగా యిక్కడికి వచ్చాను. చాలారోజుల క్రితమే కాపాలిని చనిపోయింది. చనిపోయే ముందు ఆమె భూత వర్తమానాలను చూపే గాజుగోళాన్ని, మానవాస్థికనూ నాకు యిచ్చి పోయింది. వాటివల్లనే నీవు ఎలాంటి కష్టాల్లో వున్నావో నేను గ్రహించగలిగాను. ప్రస్తుతం నీ శత్రువు.... ఆ కారణంగా నా శత్రువు కూడా అయిన సర్పకేతుడు తన సైన్యాలతో ఎక్కడ వున్నాడో చూద్దామా?' అంటూ కాలకేతుడు చెట్టుచాటునుంచి గాజుగోళాన్ని బయటికి తీసి, మంత్రం జపిస్తూ దాన్ని మానవాస్థికతో తాకాడు. మరుక్షణంలో వాళ్ళకు ఓ అద్భుత దృశ్యం కంటబడింది.

సూర్యకాంతిలో కంచుకోట గోడలు తళతళ మెరుస్తున్నవి. కోట గోడల్లో ఉత్తర దిశగా వున్న ముఖద్వారపు పెద్ద కంచు తలుపులు బార్లా తెరవబడి వున్నవి. వాటి ముందు కొద్దిమంది సైనికులు కాపలా వున్నారు. కోటలోపల శిథిల స్థితిలో వున్న అనేక భవనాలలో సర్పకేతుడి సైనికులు విచ్చలవిడిగా సంచరిస్తూ, వెలలేని రత్నాలనూ, బంగారాన్ని కొల్లగొడుతున్నారు.

"చంద్రవర్మా! ఇవీ మన శత్రువుల గుట్టుమట్లు చాలామంది అనుకుంటున్నట్టు కంచుకోట గోడలను సముద్రజలం తాకటం లేదు. దాదాపు నూరు సంవత్సరాలక్రితం సముద్రం పొంగి కంచుకోటను జలమయం చేసి, క్రమంగా కోటగోడలను విడిచి దాదాపు ఒక కోసెడుదూరం వెనక్కుపోయింది," అన్నాడు కాలకేతుడు.

కాలకేతుడు యిలా చెప్పగానే, చంద్రవర్మ ఎంతో ఉత్సాహంతో తన సైనికులను నది దాటేందుకు ఆయత్తపరిచాడు. కాలకేతుడు జాగ్రత్తపరిచిన తెప్పకొయ్యలూ, పెద్దపెద్ద దుంగలూ ఉపయోగించి, సైనికులు నది దాటారు.

కాలకేతుడు ఒక గుర్రం ఎక్కి ముందుండి దారి చూపుతూండగా సైన్యం









యావత్తూ శరవేగంతో కంచుకోటకేసి పోసాగింది. ఒక గంట తరవాత వాళ్ళకు ఆకాశాన్నంటుతున్నవా అన్నట్టున్న కంచుకోట గోడలు కనిపించినై. వాళ్ళు క్రమంగా కోటను సమీపించి ఉత్తరపు వైపున వున్న కోట ద్వారాలకేసి వెళ్ళేసరికి, ద్వారాలు బంధింపబడి వున్నవి. చంద్రవర్మ సుబాహుణ్ణీ, సేనాని ధీరమల్లుణ్ణీ వెంటపెట్టుకుని ద్వారాలను సమీపించి, వాటిని పరీకించి చూశాడు. అవి దృఢమైన కంచుతో చేయబడి వున్నవి. ఇంత బలమైన కంచు తలుపులను బద్దలు కొట్టి, కోటలో ఎలా ప్రవేశించటమా? అని చంద్రవర్మ ఆలోచించేంతలో, కోట గోడల మీద సర్పకేతుడు ఉగ్గరగా అరవటం వినబడింది. అతడివెంట పెద్ద తట్టలూ, బుట్టలూ, గోతాలూ పట్టుకుని వున్న కొందరు సైనికులు కనిపించారు.

సర్పకేతుడు తన పక్కన నిలబడివున్న సైనికులను, గోడలకింద వున్న చంద్రవర్మ సైనికులకు చూపుతూ, "ఇవిగో, నా సైనికుల దగ్గిర వున్న గోతాలూ, బుట్టలూ చూశారా? వాటినిండా రత్నాలూ, బంగారం వున్నది. చంద్రవర్మను వదిలి నా పక్షానికి వచ్చే ప్రతి సైనికుడికీ అన్ని రత్నాలూ, బంగారం యిస్తాను. అలా నా పక్షానికి వచ్చేవారికోసం కోట తలుపులు తెరవబడతవి. ఈ గోతాల్లో








వున్నది బంగార మట్టనే కాదో మీరే చూడండి!" అన్నాడు.

సర్పకేతుడు అలా అనగానే, అతడి వెంట వున్న సైనికులు బుట్టలనుంచీ, గోతాల నుంచీ వెండి బంగారాలనూ, రత్నాలనూ చంద్రవర్మ సైనికులపై బడేలా కుమ్మరించారు. చంద్రవర్మ సైనికులు వాటికోసం కొట్లాడుతూ, ఒకరినొకరు కుమ్ముకో సాగారు. పరిస్థితి ప్రమాదకరంగా పరిణ మిస్తున్నదని గ్రహించిన చంద్రవర్మ, సుబా హుడితో, "సుబాహూ! నువ్వు మన వీర పుర సైనికులను వెంటబెట్టుకుని, శత్రు పక్షంలో చేరేవాడిలా నటిస్తూ కోటతలుపులు తెరవమని కేకలుపెట్టు. అది నమ్మి సర్ప కేతుడు తలుపులు తెరిపించేట్టయితే, వెంటనే కోటలో జొరబడు. నేనూ, ధీరమల్లుడూ మిగిలిన సైన్యంతో వస్తాం. అప్పుడు ఒక్కు మ్మడిగా అందరం శత్రువులమీద పడి వాళ్ళను సర్వనాశనం చేద్దాం," అన్నాడు.

చంద్రవర్మ యిలా చెప్పగానే సుబా హుడు సైనికుల దగ్గరకు వెళ్ళి, వాళ్ళతో రహస్యంగా మాట్లాడాడు. చూస్తూండగానే సైన్యంలోనుంచి ఒక పెద్ద భాగం వేరుపడి, "సర్పకేత మహారాజుకూ, జై!" అంటూ కోటతలుపులకేసి కదిలింది. వాళ్ళు ముందుకు పోకుండా ఆటకాయించేవాళ్ళలా









కొందరు సైనికులు, వాళ్ళతో శత్రుత్రి యుద్ధం ప్రారంభించారు.

చంద్రవర్మ సైన్యంలో తిరుగుబాటు వచ్చిందని నమ్మిన సర్పకేతుడు కోటగోడల మీదినుంచి వికటాట్టహాసం చేస్తూ, "కోట తలుపులు తెరవండి! శత్రుసైన్యంలో ఎక్కువభాగం మన పక్షమైంది. చంద్రవర్మనూ, వాడి ముఖ్యానుచరులనూ క్షణాల మీద నా కత్తికి ఎరచేస్తాను!" అని కేకలు పెట్టాడు. ఆ వెంటనే సర్పకేతుడి సైనికులు కోట తలుపులను తెరిచారు.

ఆ తరవాత కన్నుమూసి తెరిచేంతలో జరిగిపోయిందా, అన్నంత ఆశ్చర్యకరంగా సర్పకేతుడి సైన్యం తుడిచిపెట్టబడింది. సైనికులతో కోటలో ప్రవేశిస్తూనే సుబాహుడు ఎదురైన శత్రుసైనికులను తన కత్తితో నరక సాగాడు. అంతలో చంద్రవర్మ, ధీర మల్లుడూకూడా కంచుకోటలో ప్రవేశించారు. వారి ధాటికి సర్పకేతుడి సైన్యం చెల్లా చెదురుగా పారిపోసాగింది.

జరిగిన మోసం చూసి సర్పకేతుడు నెలు వెల్లా భగ్గుమన్నాడు. అతడు కోట గోడల మీద తన వెంటవున్న కొద్దిమంది సైనికు లను హెచ్చరించి, అక్కడ వున్న పెద్దపెద్ద బండరాళ్ళను ఎత్తి, దిగువ నున్న చంద్ర వర్మ సైనికులమీదికి విసరసాగాడు. అది చూసిన చంద్రవర్మ, సుబాహుడితో "సుబాహూ! ఆ దుష్టుణ్ణి సాధ్యమైతే ప్రాణా లతో పట్టుకో. అలా సాధ్యంకాని పరిస్థితుల్లో నీ కత్తితో తునాతునియలుగా నరుకు!" అని కేకపెట్టాడు.

సుబాహుడు కొందరు సైనికులను వెంట పెట్టుకుని కూలిపోయిన కోటగోడ రాళ్ళ మీదుగా పాకి, గోడ పైభాగానికి వెళ్ళాడు. కాని, సర్పకేతుణ్ణి పట్టుకోవటం సాధ్య మయేలా అతడికి కనిపించలేదు. తనకు ఎలానూ చావు తప్పదని నిశ్చయించుకున్న సర్పకేతుడు రాక్షసుడిలా బొబ్బలుపెడుతూ,











ఎదురైన సైనికులను తన కత్తితో ఊచకోత కోస్తున్నాడు. కోటగోడలమీద సుడిగాలిలా యిటునుంచి అటు పరుగెత్తుతూ అతడు చేసే భీభత్సాన్ని చూసి చంద్రవర్మ సైనికులు వణికిపోయారు.

"చంద్రవర్మా! సర్పకేతుడికి సరి అయిన ప్రతియోధుణ్ణి నేను! వాడు కోటగోడలమీదినుంచి, పెను శిలలా కింద పడబోతున్నాడు. ప్రాణాలతో వాణ్ణి బంధించదలిస్తే, వాడు భూమిని తాకి ముక్కలు కాకముందే జాగ్రత్తపడి పట్టుకో!" అంటూ కాలకేతుడు కత్తిదూసి ఒక్క ఎగురున కోటగోడలమీదికి వెళ్ళాడు.

కాలకేతుణ్ణి చూస్తూనే, సర్పకేతుడు పెద్దగా రంకె వేసి అతడిమీదికి దూకాడు. కాలకేతుడు అతడి కత్తిదెబ్బను తప్పుకుని, తన కత్తిని ముందుకు సాచి అతడిమీదికి లంఘిస్తూ, "సర్పకేతూ! నువ్విప్పుడు పోరాడుతున్నది కాలకేతుడితో! కాలకేతుడంటే మూడుశిరస్సుల మహాకాలసర్పం!" అంటూ చటుక్కున సర్పాకృతి దాల్చి, బుస్సుమంటూ పైకి లేచాడు.

సర్పకేతుడు ఒక్క క్షణకాలం స్తంభించిపోయి, ఆ వెంటనే ప్రాణభీతితో కీచుమంటూ అరిచి కోటగోడలమీదినుంచి తలకిందులుగా కిందికి పడిపోయాడు. చంద్రవర్మ సమీపించేసరికే, అతడి ప్రాణం పోయింది. దానితో చావగామిగిలిన సర్పకేతుడి సైనికులు చంద్రవర్మకు లొంగిపోయారు.

• • •

కాలకేతుడు తాను కంచుకోటలో నివాసం ఏర్పరుచుకునేందుకు అనుమతి కోరగా, చంద్రవర్మ అందుకు అంగీకరించాడు. ఆ రాత్రి తన సైనికులతో అతడు కంచుకోట శిథిలాలలో కాలం గడిపి, అక్కడ దొరికిన ధనరాసులతో, తెల్లవారగానే రుద్రపురం వైపుకు ప్రయాణమయాడు. ఒకటి రెండు రోజుల ప్రయాణం తరవాత రుద్రపుర







వాసులు కొందరు చంద్రవర్మ దగ్గిరకు వచ్చి, రాజు శివసింహుడు కొండల్లోకి పారిపోయాడనీ, యిప్పుడు తమకు రాజు లేడనీ విన్నవించుకున్నారు. చంద్రవర్మ, ముసలివాడి కొడుకు దేవలుణ్ణి రుద్రపుర రాజుగా నియమించాడు.

చంద్రవర్మ మాహిష్మతీ నగరానికి కొన్ని కోసులదూరంలో వుండగానే, నగరవాసులకు క్రూరుడైన సర్పకేతుని చావును గురించి తెలిసింది. వాళ్ళు మంగళ వాయిద్యాలతో బయలుదేరి, చంద్రవర్మకు ఎదురువచ్చి, ఆతణ్ణి తమకు చక్రవర్తిగా వుండవలసిందని కోరారు. కాని, చంద్రవర్మ అందుకు అంగీకరించలేదు. యశోవర్ధన చక్రవర్తి పెద్ద కుమారుడు తపోవర్ధనుడు చక్రవర్తి కావటం ఉత్తమంగా వుంటుందని ఆతడు వారికి తెలియపరిచాడు.

మాహిష్మతీనగర పరిసరారణ్యాల్లో ఆశ్రమం నిర్మించుకుని తపస్సు చేసుకుంటున్న తపోవర్ధనుడి దగ్గిరకు చంద్రవర్మతో పాటు నగరవాసులుకూడా వెళ్ళి, ఆయనను సింహాసనం అధిష్ఠించవలసిందిగా కోరారు. తపోవర్ధనుడు దానికి అంగీకరించక, "నేనెనాడో సర్వసంగపరిత్యాగం చేసినవాణ్ణి. నాకు రాజ్యకాంక్ష లేదు. మీ అందరి గౌరవాదరణలకూ, ప్రేమాభిమానాలకూ పాత్రుడైన చంద్రవర్మ మీకు చక్రవర్తిగా వుండటం అన్నివిధాలా మంచిదని నేను భావిస్తున్నాను," అన్నాడు.

తరవాత ప్రజల కోరికను మన్నించి తపోవర్ధనుడు స్వయంగా కిరీటాన్ని చంద్రవర్మ శిరస్సున పెట్టాడు. ప్రజలు జయజయ ధ్వానాలు చేశారు.

చంద్రవర్మ, తనకు విశ్వాసపాత్రులైన ధీరమల్లు, సుబాహులకు ముఖ్య మంత్రి పదవీ, ముఖ్య సేనాని పదవీ యిచ్చి, ప్రజానురంజకంగా ఎంతోకాలం రాజ్యపాలన చేశాడు. —(అయిపోయింది)




